

# ఈ సంచికలో



ముఖచిత్రం : మేఘమల్హార్

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

వచ్చే సంచికలో

కొమ్మూరి వేణుగోపాల రావుగారి

నాకు నచ్చిన నా కథ

# తప్పక చూడండి!

ఆక్రోశమెందుకో?
ఆవేశమెందుకో?
పదవెందుకో?
పలుకుబడెందుకో?
ఓట్లెందుకో?
సీట్లెందుకో?
డబ్బు గట్టి
రాజ్యమేలడానికో?

విశ్వశాంతి మూవీస్

# హరిశ్చంద్రుడు

దర్శకత్వం: LION U. విశ్వేశ్వరరావు B.Sc.,

# జూలై నెల యువ

# భావ పరిచయ పోటీ

## బహుమానము రూ 25-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

*గమనిక:* వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి జూలై 10వ తేదీలోగా పంపవలెను

# తప్పక చూడండి!

"ఓహో! తాగడంకోసమే వచ్చేసారా?"

యించుకోడంకోసం.

ఫోటో తీయించుకోవడంకోసం."

"ఎత్తి పొడుస్తున్నారా?



దాసరి నారాయణరావు

ప్రేమకు అర్థం! పెళ్ళికి నిర్వచనం!

## పాలు-నీళ్ళు

లక్ష్మీ ఫిలిం

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 44 జూలై 1981 సంచిక 1


గ్రామ పంచాయితీలకు, పంచాయితీ సమితులకు ఎన్నికలు ముగిసినవి. ఈ ఎన్నికలు పార్టీతరపునగాక, స్వతంత్ర అభ్యర్థుల పేరుతో జరిగినవి. ఏడు సంవత్సరాల తరువాత జరిగిన ఈ ఎన్నికల ఫలితంగా, యీ ఎన్నికలలో గెలిచిన అభ్యర్థులు ఎన్నుకొనే లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యుల ఎన్నిక జరుగ వలసి వున్నది. అలా ఎన్నిక కావలసిన ఎం.ఎల్.సి. ల సంఖ్య 31. బహుశా, ఆ ఎన్నికలో పార్టీ అభ్యర్థుల మధ్య పోటీ జరగవచ్చు. అలా పార్టీ ప్రసక్తి లేకుండా స్వశక్తిపైనే ఆధారపడి, వ్యక్తులు పోటీచేసి, లెజిస్లేటివ్ కౌన్సిలుకు ఎన్నిక అయినట్లయితే, చాలా బాగుంటుంది. అలా గెలిచినవారు, కేవలం తమ పరువుప్రతిష్ఠలమీద ఆధారపడి గెలిచినట్లవుతుంది. కాని పార్టీతరపున నిలబడి గెలిచినంత సులభంగా వ్యక్తిగతంగా గెలవడం సాధ్యంకాదు. మరి ఎన్నికల విధానం ఎలా వుంటుందో చూడాలి.

మళ్లీ ఏడేళ్ల తరువాత, పంచాయితి సమితులు, జిల్లా సమితులు ఏర్పడుతున్నాయి. పంచాయితీ సమితులు చాలా బాధ్యతలుగల సంస్థలు. పంచాయితీ

సమితుల నిర్మాణం జరిగిన ప్రణాళిక ప్రకారం, సమాజ వికాస కార్యక్రమం. అంతా అమలు జరుపవలసినది, పంచాయితీ సమితియే. వ్యవసాయాభివృద్ధి, చిన్న పరిశ్రమల అభివృద్ధి, విద్య, సాంఘిక సంక్షేమం, మద్యనిషేధ కార్య క్రమాన్ని అమలు జరపడం, చిన్ననీటి వసతులను ఏర్పాటు చెయ్యడం, గ్రామ గ్రామాలమధ్య రవాణా సౌకర్యాలు, ప్రజారోగ్యం, బంజరు భూముల సాగు, కొత్తపద్ధతులలో సేద్యం, మేలురకపు విత్తనాల ఉపయోగం, రసాయనపు ఎరువులు, పచ్చిఎరువుల వాడకము మొదలైన కార్యక్రమాలలో, గ్రామాలలోని ప్రజల సహకారంతో ప్రజల జీవితంలో ఆర్థికంగా, సాంఘికంగా క్రమాను గతమైన అభివృద్ధిని తీసుకొనిరావడం—ఇవన్నీ పంచాయితీ సమితుల బాధ్యతలు.

ఈ విధమైన కార్యక్రమం లక్ష్యంగా, పంచాయితీ సమితులు 1959 జులైలో మొట్టమొదట ఏర్పాటు చేయబడినవి. 1974 వరకూ, అంటే 15 సంవ త్సరాలు ఇలాటి సమితులు వున్నాయి 1974 నుంచీ ఎన్నికలు లేవు. ఇలా 15 సంవత్సరాలు అమలులో వున్న సమితులు తమ లక్ష్యసాధనకు ఎంత తీవ్రంగా కృషిచేశాయి, ఎంత సాధించాయి అని పరిశీలిస్తే గర్వ కారణమైన ఫలితాలు ఎక్కువగా కనపడవు. 1974 నుంచీ ఏడేళ్లు మళ్లీ సమితులు లేవు. ఇప్పుడు ఏర్పడ్డాయి. ఇప్పుడు ఎన్నిక అయిన సభ్యులూ, ప్రెసిడెంట్లూ, గ్రామాల అభ్యుదయానికి బాగా కృషిచేస్తే గ్రామాలలోని నిరుద్యోగత, గ్రామీణుల నిస్పృహ బాగా తగ్గి, గ్రామాలు కలకలలాడుతూ వుంటాయి. గ్రామాలలో తగిన జీవనాధారం లేక ఎందరో ప్రజలు పట్టణాలకు చేరి అక్కడి మురికి కూలాపాలలో మగ్గిపోతున్నారు. కనీసపు సౌకర్యాలతో జీవించడానికి తగిన ఆధారం గ్రామాలలో వుంటే, దౌర్భాగ్య జీవితాన్ని గడపడానికి పట్టణా లకు వలసపోవలసిన అవసరం ప్రజలకు వుండదు. గౌరవంగా గ్రామాలలో బ్రతికిన ఎన్నో కుటుంబాలు, కొండంత ఆశతో పట్టణాలకు వచ్చి అక్కడ హేయమైన జీవితాన్ని గడపడం మనం చూస్తున్నాము. అలాటి పరిస్థితిని అంత మొందించాలంటే గ్రామాలలో అభివృద్ధి కార్యక్రమాలు చురుకుగా సాగాలి. గ్రామ పారిశుద్ధ్యం బాగుపడాలి. అలాంటి కృషిని, నేడు ఎన్నిక అయిన సమితి పెద్దలు నిర్విరామంగా సాగించి, ధన్యులవుతారని ఆశిస్తున్నాము.

---

# జీవం ఉట్టిపడేలాగ మురియండి

అపూర్వమైనది లిరిల్. పచ్చని తరంగరేఖలు. నిమ్మకాయల్లోని తాజాదనపు ఉత్సాహంతో. చురుకైన, పులకరింపజేసే లిరిల్ మిమ్మల్ని నవనారిగా రూపొందిస్తుంది.




**లిరిల్**

తాజాదనపు సబ్బు. నిమ్మకాయల తాజాదనపు ఉత్సాహంతో

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.

27-1710 TL

# జరుగుతున్న చరిత్ర

ఫ్రెంచి విప్లవం స్వేచ్ఛ - సమానత్వం - సోదరీసోదర భావాల బావుటా ఎగరవేసింది. దాని ప్రభావం ప్రపంచ మంతటా వ్యాపించింది. కాని ఫ్రెంచి సీమలో చివరకు మొగ్గు కన్సర్వేటివ్ ధోరణివైపుకు పడింది. సోషలిజం, కమ్యూనిజం బలమైన, విశాల వ్యాప్త మైన శక్తులుగా విజృంభించినవి. కాని, ఎన్నికల ఫలితాలు కన్సర్వేటివ్ శక్తుల గెల్పునే సూచించేవి. కడకు 1978 లో సోషలిస్టు - కమ్యూనిస్టు శక్తులు కలిసి కన్సర్వేటివ్ శక్తుల నెదిరించి పోరాడినవి. కమ్యూనిస్టులతో కలయిక సోషలిస్టులకు అప్పుడు కలిసిరాలేదు. ఈసారి, కమ్యూనిస్టుల సాయంతో విశిష్టంగా ఫ్రెంచి సోషలిస్టులు తమ అభ్యర్థిని నిలబెట్టి నెగ్గినారు. యూరప్ (ఎర్రబడని యూరప్) లోని సోషలిస్టులు ఆనందపరవశులైనారు. తమ సీమలలో ఫ్రెంచి ఎన్నికల ఫలితం సోషలిస్టుద్యమాన్ని ముందుకు నెడుతుందని ఆశిస్తున్నారు.

కొత్త ఫ్రెంచి ప్రెసిడెంట్ మిత్రాన్ (Mitterand) చేయబోయే పనులను గురించి అప్పుడే ఊహాగానం ఆరంభమైనది. పరిశ్రమల వ్యాప్తికై, కొన్నింటిలో పునర్నిర్మాణానికై ప్రయత్నించి, ఎదిగివచ్చే శ్రామిక శక్తికి జీవనాధారాలను కల్పించడం హర్షించదగిన విషయమే. కాని, ప్రయివేట్ యాజమాన్యాన కాకుండా, పబ్లిక్ యాజమాన్యాన ఆ ప్రయత్నాన్ని కొనసాగించి ఎక్కువ మందికి పని కల్పించి, సమర్థవంతంగా పరిశ్రమలను నడిపించవలెనని కొత్త ప్రెసిడెంట్ ఆలోచిస్తున్నాడని తెలిసింది. (Renault) రెనాల్ట్ కంపెనీ ద్వారా ఒక చక్కని మోటార్ కార్ల పరిశ్రమ ఫ్రెంచి సీమలో పబ్లిక్ యాజమాన్యాన ప్రసిద్ధిగన్నది. ఆ నమూనాలో మరికొన్ని సంస్థలు నడిస్తే గర్వకారణమే.

బ్యాంకులను జాతీయం చేసే కార్యక్రమం కూడా అమలుజరగవచ్చును.

ఈ రెండు పనుల ద్వారా జాతీయ జీవనంపై గవర్నమెంట్ కంట్రోల్ అధికం కాక తప్పదు. అటువంటప్పుడు గవర్నమెంటును నడిపేవారూ, వారికి సంబంధించిన పార్టీవారూ సమసమాజ ధ్యేయానికి అంకితమైనవారుగా వుండవలెను. కొత్త ప్రెసిడెంట్ తలపెట్టిన పనులు మొదలైతే, పరిణామాలను కొంతవరకు అంచనా వేయవచ్చునని

---

*మండి జగన్నాథం*

విషయమ్మే లనుకుంటున్నారు.

ఈ కొత్త తతంగమంతా అమెరికన్ పాలకవర్గానికి గిట్టడంలేదు. కొన్ని అమెరికన్ కంపెనీలు జాతీయం కావడం ఒక్కటే అమెరికన్ల ఆగ్రహానికి కారణం కాదు. అసలీ పబ్లిక్ యాజమాన్యాల పొడ వారికి గిట్టదు. ఫ్రెంచి సీమ ఆఖరున దివాలా తీయడానికి మార్గాన్ని వెతుక్కొని పోతున్నదని వారు శాపనార్థాలు కూడా పెట్టినారు.

నిశితమైన పరిశీలకుల దృష్టిలో సహకార సంస్థల మార్గం ఉత్తమం. పబ్లిక్, ప్రయివేట్ యాజమాన్యాలతో సంభవించగల అపాయాలు సహకార యాజమాన్యంలో సంభవంకావని వారి అభిప్రాయం.

డెన్మార్క్ ఒక్కటే సహకార ప్రజారాజ్యమై (Co-operative Commonwealth) వర్ధిల్లుతున్నది. మిగతా చోట్ల, పబ్లిక్ యాజమాన్యమో, ప్రయివేట్ యాజమాన్యమో లేక కలగాపులగమో నడుస్తున్నవి. ప్రస్తుతం మన ప్రభుత్వాన్ని కేంద్రంలో నడిపేవారి చిత్తవృత్తి కలగాపులగానికి (Mixed economy) అనుకూలంగా వున్నదని జగద్విదితం. కలగాపులగమే ఇప్పట్లో మనకు క్షేమైన పద్ధతి అని వారి నాయకులు బహిరంగంగా ప్రకటించి వున్నారు.

* * *

మన ప్రధానమంత్రి పర్యటన ఫలప్రదంగానే సాగింది. జెనీవాలో ఆరోగ్యమే మహాభాగ్యమని పలికి, 2000 సంవత్సరంలోగా అందరికీ ఆరోగ్యం లభించే ప్రపంచ ఆరోగ్య సంస్థ పథకాన్ని ప్రశంసించింది. కుటుంబ నియంత్రణలో, జనాభా అవసరానికి మించిన ఆహారోత్పత్తిలో విజయం పొందిన మన పాత్రను సగర్వంగా అందరికీ తెలియజేసింది. కువైత్, అబూదాబీ (ఆయిల్ సీమలతో) రాజ్యాలలో మన స్నేహసంపదను పెంచుకుని వచ్చింది.

అంతేగాక, పెద్ద దేశాలు తమ వనరులను యుద్ధసామగ్రికోసం వినియోగిస్తూ, పేదల బ్రతుకులను బాగుచేయడానికై వనరుల పరిశోధనను విజ్ఞానులకు సాధ్యంకాకుండా చేస్తున్నవని ఆరోపించింది. మానవ నాగరికతనే నాశనం చేసే న్యూక్లియర్ సాధనాలను రాజ్యాలు తయారుచేస్తూ ప్రపంచ శాంతికి భంగం కలుగచేస్తున్నవని పలికింది.

* * *

ఐరిష్ కాష్ఠం చల్లారేది ఏనాటికో !

ఐర్లాండు స్వాతంత్ర్య సంగ్రామంలో కారాగారంలో 72రోజుల నిరాహారదీక్షను బూని అమరుడైన టెరెన్స్ మాక్స్విన్ మళ్ళీ గుర్తుకు వస్తున్నాడు. సాండ్స్ (Sands) కారాగారంలో వుండగానే ఎన్నికల పోటీలో నెగ్గినాడు. అట్టి వ్యక్తిని, అయన సహచరులను రాజకీయ

ఖైదీలుగా పరిగణించి వుంటే సాండ్స్ దీక్షపూనేవాడు కాదు.

సాండ్స్ మరణంతో ఉద్యమం ఆగడం లేదు. ఇంకా ఇద్దరు ఐరిష్ రిపబ్లికన్ ఆర్మీ వీరులు కారాగారంలో నిరహారదీక్షలో వున్నారు. 60 రోజులైనది. ఇంకా అనేకమంది ఆ దీక్షలో కలియవచ్చును.

వీరి పోరాటం ఎందులకు? ఐర్లాండుకు స్వరాజ్యం వచ్చినప్పుడు, ఉత్తర భాగాన్ని వేరుచేసి, దానిమీద బ్రిటిష్ పెత్తనం వుండేట్లు చేశారు. ఉత్తర భాగంలోని వారు ప్రొటెస్టెంటులు. దక్షిణాదివారు కాతలిక్కులు. ఐతే, ఉత్తర భాగంలో కూడా కొందరు కాతలిక్కులున్నారు. తమను పూర్తి పౌరులుగా పరిగణిస్తూ, ఉత్తరభాగాన్ని దక్షిణాది రాజ్యంలో కల్పి, ఒకే ఐర్లాండ్ రాజ్యం నిర్మాణం కావడానికి ఆంగ్లేయులు అంగీకరించవలెనని వారి పట్టుదల. బ్రిటిష్ పరిపాలనకు ముఖ్యులైన వారెవరు వీరి గోడును వినడంలేదు. సాండ్స్ చర్యను క్రిమినల్ అంటాను- పొలిటికల్ అనను అని కన్సరేటివ్ ప్రధాని మదాం థాచర్ గర్జించేసరికి, లేబర్‌పార్టీ నాయకుడైన మైకల్ ఫుట్ అదే మాట అన్నారు. (ఇటీవల ఒక కొత్త పార్టీ ఆంగ్లసీమలో ఏర్పడినపుడు లేబర్‌పార్టీ నుంచి వచ్చి అందులో ఈయన చేరాడు.)

అమెరికాలో మాత్రం సంచలనం కలిగింది. లోగడ ఐరిష్ స్వాతంత్ర్య సమరానికి అమెరికాలోని ఐరిష్‌వారు చాలా సాయపడ్డారు. ఇప్పుడు కూడా వారు ఐర్లాండు ఉత్తర భాగంలోని కాతలిక్ మైనారిటీకి అండదండలు ఇచ్చే ధోరణిలో వున్నారు. బ్రిటిష్ వైమానిక సర్వీసును బాయ్‌కాట్ చేయవలసిందనే పొలికేక కూడా వినిపించింది. మన రాజ్యసభలో మహాత్మగాంధి, జతీన్‌దాస్ గారల ఉపవాసాలకు సాండ్స్ ఉపవాసాన్ని కొందరు నాయకులు పోల్చారు.

బ్రిటిష్ ప్రొటెస్టెంటులు- ఐర్లాండు ఉత్తరపు ప్రొటెస్టెంటులు కలిసి కాతలిక్కుల దౌర్జన్యాలను 'ఎదుర్కొంటాము గాని, లొంగము' అంటున్నారు. ఈ దౌర్జన్యపరులు నిర్దోషులైన వారిని స్త్రీ పురుషులను, బిడ్డలను వధించారు- సాండ్స్‌ను మేము హత్య చేయలేదు. తనకై తాను ప్రాణం తీసుకున్నాడు ఇదీ వరస. ఇంచుమించు ఆ మాటలనే అక్షరాలా బ్రిటిష్ ప్రధాని ఉచ్చరించింది.

పరిణామం ఊహించ శక్యం కాకున్నది.

---

**యువ మే 1981 భావ పరిచయ పోటీ**

**రు. 25-00 బహుమతి పొందిని వ్యాఖ్య**

ఇంటి దొంగవు నీవు బయటి దొంగను నేను,

నాకు ఇస్తే మరి భాగం నీకు లేదింక భయం.

- *గూడూరు పద్మావతి*, సికింద్రాబాద్



# నింగిలోని సిరిమల్లి

చంద్రవల్లి

రైల్వే ప్లాట్‌ఫాంపై రాబోయే రైలుకోసం అసహనంగా నుంచుంది సుజాత.

ఆరోజు రైలు రెండున్నర గంటలు లేటు. ఇంట్లో బయలుదేరటం హడావిడి అయింది. ఎన్ని రోజులున్నా తల్లిదండ్రుల్ని వదలి వెళ్లాలంటే బాధే! అందుకే యింటినుంచి బండి కదలటం చాలా ఆలస్యమైపోయింది. రైలు సరిగ్గా పది గంటలకి వస్తుందక్కడికి. బండి స్టేషను చేరేసరికి యింక పదినిమిషాలు మాత్రమే టైం వుంది. సూట్‌కేస్ చేతబట్టుకుని హడావిడిగా కౌంటర్‌వద్దకి వెళ్ళింది. టికెట్ తీసుకుని ప్లాట్‌ఫాం మీదికి వచ్చేసింది. అప్పుడు తెలిసింది అరగంట లేటని. ఆ అరగంటల్లా గడిచి, గడిచి రెండున్నర గంటలైంది. పాలేరు వెంకన్న మళ్లీ వేకువనే పనికి వెళ్లాలంటూ అప్పుడే వెళ్లిపోయాడు.

అది చాలా చిన్న స్టేషను! ప్రయాణీకులు లేరు ఎవ్వరూ. ప్లాట్‌ఫాంకంతా సుజాత ఒక్కతే వుంది. బెంచీమీద కూర్చుని కూర్చుని విసిగెత్తింది. మేరీ కార్టలెండ్ నవల చదువుతూ కొంతసేపూ, ఆ వారం పత్రిక తిరగేస్తూ కొంత సేపూ గడిపింది. మరీ అర్ధరాత్రి అయ్యేసరికి, అక్షరాలు చూస్తూ వుండటంవల్ల కళ్లకి అలుపు వచ్చేసింది.

కీచురాళ్ల రొద! నిశ్శబ్ద సంగీతం! దూరంగా స్తంభాన్ని ఆనుకుని పోర్టరు. లోపల గదిలో కునికిపాట్లు పడుతూ స్టేషన్‌మాస్టరు! బుకింగ్ ముందు క్లర్కు!

గంట కొట్టేడు పోర్టరు. 'హమ్మయ్య రైలు వస్తోంది!' అనుకుంది సుజాత. టైం చూస్తే పన్నెండూ ముప్పై! 'ఉదయం ఎనిమిదింటికి చేరే ట్రెయిన్ ఏ పదకొండింటికో చేరుతుంది కాబోలు!' అనుకుంది.

వెలుగులు చిమ్ముతూ వచ్చేసింది ట్రెయిన్. ఇద్దరు దిగేరు. అంతే! వాళ్లు తన వూరివాళ్లు కాదు. రైలుకట్టకి అటువేపున్న వూరివాళ్లేమో! ట్రెయిన్‌లో రద్దీ లేదు. అంతా నిశ్శబ్దం. స్టేషనులో రైలాగితే మెలుకువ వచ్చి తిరిగి కళ్లు మూసుకుని పడుకున్నట్లున్న ప్రయాణీకులు.

ఆడవాళ్ల కంపార్టుమెంటులో ఎక్కేసింది సుజాత. అది చిన్న పెట్టె. నాలుగు బెర్త్‌ల్లాంటి సామాన్లుంచే బల్లలున్నాయి. కూర్చునే నాలుగు బల్లలు ఉన్నాయి. ఎవరో ఓ ముసలమ్మ ఓ బెంచీపై పడుకుంది.

కిటికీ వారగా కూర్చుంది సుజాత.

రైలు కూత వేసింది.

సరిగ్గా ట్రెయిన్ కదిలేసమయంలో ఓ యిరవయియ్యేదేళ్లు దాటిన యువకుడు హడావిడిగా ఎక్కేశాడు. మసక వెలుతుర్లోనే అతని ముఖంలో అలసట ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. అతని చేతిలోవున్న సుమారు మూడు నెలలున్న పసిపాపని అతడు తన ఎదురు బెంచీపై కూర్చునేదాకా గమనించలేదు సుజాత.

ఎదురుగా కూర్చున్నాడతను. పొత్తిళ్లల్లోని ఆ పసిపాప గాఢంగా నిదర పోతోంది. లయాన్వితంగా రైలు చేస్తోన్న శబ్దంమాత్రం వినిపిస్తోంది.

"క్షమించండి! చూడక ఆడవాళ్ళ కంపార్టుమెంటులో ఎక్కేను!" అన్నాడతను. ఆ మాటలో కొట్టొచ్చినట్టు కనిపించే సభ్యత, సంస్కారం సుజాతని ఆకర్షించాయి.

"ఫర్వాలేదులెండి! ఇక్కడేం రష్ లేను. అభ్యంతరపెట్టేందుకూ ఎవరూ లేరు! ఒక్కదాన్ని బిక్కు బిక్కుమంటూ వుండకుండా తోడున్నారు!" నవ్వేస్తూ అంది సుజాత.

అతనేం అన్లేదు. బయటికి చూస్తూ వుండిపోయాడు.

అతని చేతుల్లో వున్న పాపపై వెలుగుపడుతోంది. నిండా మూడునెలలు నిండని యీ పసిపాపని ఎక్కడికి తీసికెళుతున్నాడు? ఆ పసిబిడ్డ తల్లి ఎక్కడ? చనిపోయిందా? ఉలికిపడింది సుజాత. ఛ! ఛ! తెలియకుండా ఎంత ఘోరం వూహించింది తను. ఈ లేతప్రాయంలో తల్లికి కరువు కావటం ఎంత దురదృష్టం!

రైలు వేగం నెమ్మదించింది. అది పాసింజర్ ట్రెయిన్ కావటంతో మెల్లిగా అన్ని స్టేషన్సులోనూ ఆగుతూ నడుస్తుంది నత్తనడక! పొత్తిళ్లలోని పాపని బల్లపై పడుకోబెట్టాడతను. ఊయల్లోలాగా రైలు ఊపులకి నిద్ర పోతోంది పాప!

అతను లేచాడు. "ఇక్కడ దిగిపోతాను నేను!" అన్నాడు.

"మరేం ఫర్వాలేదు! కూర్చోండి! నాకేం అభ్యంతరం లేదు! అంతగా మరెవరయినా వచ్చి, అభ్యంతరం చెబితే వెళ్లిపోదురుగాని!" అంది

అతనేం అన్లేదు. స్టేషను రాగానే ట్రెయిన్ ఆగింది. అతను గుమ్మంవైపు నడిచివెళ్లాడు. ట్రెయిన్ దిగి తిరిగి కిటికీవద్దకి వచ్చి అటుగా చూస్తూ నుంచున్నాడు.

'కాఫీకో, నీళ్లకో!? దిగాడు!' అనుకుంది సుజాత.

ట్రెయిన్ కూతవేసి మెల్లిగా కదిలింది. అతను పెట్టెవెంటే మెల్లిగా నడుస్తున్నాడు.

"ఎక్కెయ్యండి! వేగం పుంజుకుంటోంది!" అంది సుజాత గాబరాగా.

"చూడండి మీ రెవరో నాకు తెలియదు; కానీ ఆ పాప యిక మీ పాపే! మీరు - దాన్ని కన్నతల్లిలాగా పెంచుకుంటారని నమ్ముతూ, మీతో వదిలేస్తున్నాను. నే నంటూ బ్రతికివుంటే ఎప్పటికయినా మిమ్మల్ని కలుసుకుంటాను!" అని ఆగిపోయాడు.

రైలు వేగం హెచ్చింది. "ఏమండీ ఏమిటిది? ఎందుకిలా చేస్తున్నారు! మీ పాపని మీరు తీసికెళ్లండి!" గట్టిగా అరిచింది సుజాత అయితే అతను ఆ మాటలు వినిపించుకోకుండా గబగబా వెళ్లిపోయాడు.

చప్పున యిటు చూసింది సుజాత. ఒళ్ళంతా నిస్సత్తువ ఆవహించినట్టు నరాలన్నీ ఎక్కడికక్కడ నీరసించిపోతున్నట్టు అనిపించి తల పట్టుకుని దిక్కుతోచని స్థితిలో కూర్చుండిపోయింది.

* * *

అనుకున్నట్టుగానే పదకొండున్నరకి ట్రెయిన్ ఆ వూళ్లో ఆగింది. ఒకచేత్తో సూట్‌కేస్, మరో చేత్తో కొత్తగా పెరిగిన బాధ్యతాయుతమైన బరువు - ఆ పసిపాపని భుజంపై పడుకోబెట్టుకుని దిగింది సుజాత. టికెట్ యిచ్చి గేటుదాటి ఎదురైన ఆటోలో కూర్చుని 'గాంధీ బజార్' అంది. ఆటో కదిలింది. ఇల్లు సమీపించే కొద్దీ ఆమె గుండె దడ హెచ్చసాగింది. బి.పి. పెరిగిపోతున్నట్టుగా అనిపించింది.

'ఏం చెప్పాలి తను?' ఈ ప్రశ్న పదేపదే వేధించసాగింది. మొదట అతనెంత నిష్పూచీగా, బాధ్యతారహితంగా వదిలేశాడో, తనూ అలాగే ఆ పాపని వదిలెయ్యటానికి మనస్సు అంగీకరించలేదు. సరే! ఊరు చేరనీ తర్వాత ఆలోచిద్దాం' అనుకుంది.

గేటుముందు ఆగింది ఆటో. సందుమలుపు తిరుగుతూ వుండగా చెప్పిన గుర్తుతో ఆటో ఆపేడతను. దిగి రెండు రూపాయలు చేతిలో పెట్టేసింది. చిల్లర కోసం కూడా ఆగకుండా తడబడే అడుగులతో, బెదిరే కళ్ళతో భుజంపై పాప, చేతిలో సూట్ కేస్‌తో నడిచింది.

ఆ కాంపౌండ్‌లో అయిదారు కుటుంబాలున్నాయి. అంతా ఉద్యోగం చేసే ఆడవాళ్లే. అంచేత యిల్లంతా నిద్రపోతున్నట్టుగా ఉన్నాయి. చంటిపిల్లలు నిద్రపోతూ వుంటారు. ఎదిగిన పిల్లలు బళ్ళకి వెళ్లి వుంటారు.

ఇల్లుగలావిడ జానకమ్మగారు "ఎన్నాళ్లయింది సుజాతా! ఈ రైల్లో దిగేవా! బాగా అలస్యమైందే!" అంటూ పలకరించింది.

"అవును పిన్నిగారూ!" తడబడుతూ అంది.

"మీ పిన్ని కిపుడు నెమ్మదిగా వుందా!"

'ఆఁ' సూట్ కేస్ కిందబెట్టి తాళం తీసి, వాకిలి తోసింది. అది రెండుగదుల యిల్లు. తలుపు తోసుకుని లోపలకి పోగానే వెచ్చటి గాలి ఆవహించింది. ఫేన్ వేసి, భుజంపై పాపని మంచంపై పడుకోబెట్టింది. ఫేన్ గాలికి దుమ్ము రేగటంతో, స్పీడ్ తగ్గించి, చీపురుతో ఆ గది చకచకా చిమ్మేసింది.

'అదృష్టం! ఇదింకా నిదరపోతున్నది' అనుకుని వంటిల్లు దాటి, బాత్ రూంలోకి వెళ్లింది. పంపు తిప్పగానే నీళ్ల వచ్చేయి. 'టాంక్‌లో నీళ్లున్నాయన్న మాట' అనుకుని, చకచకా వంటగది శుభ్రంచేసి, తనూ స్నానంచేసి బయటికి వస్తోంది.

అంతలో ముందుగదినుంచి "సుజాతా! ఎవరే యీ పాప?" అన్న జానకమ్మ గొంతు వినిపించి త్రుళ్లి పడింది. గొంతు తడారిపోయినట్టుగా అయింది. అయినా ఆ ప్రశ్న వినిపించనట్లుగా జవాబివ్వకుండా ఆ గదిలోకి వచ్చింది.

జానికమ్మగారు చేతిలో పళ్లెంనిండా పప్పూ, అన్నం, కూరలు వేసుకుని వచ్చింది. మరో చేతిలో మజ్జిగ గిన్నె వుంది. "ఇప్పుడేం వంటచేసుకుంటావని నేనే తెచ్చానమ్మా!" అంది.

"ఎందుకు శ్రమపడ్డావు పిన్నీ"!

"ఇందులో శ్రమేం వుందమ్మా! ఇంట్లో వుంది తెచ్చాను. అంతే! సరేగానీ యీ పాప ఎవరమ్మా!" అంది మళ్లీ.

'ఆ పాపా!'




"ఆఁ ఎంత బావుంది! ఆ కళ్లు, ఆ బుగ్గలు, ఆ రంగూ, ఆ బుల్లి పెదాలు, ఆ చుబుకం ముద్దొస్తోంది-" సహజంగా ఉప్పొంగిన మాతృహృదయంతో అంది.

సుజాత సమాధానం యివ్వలేదు.

అంతలో కెవ్వుమంటూ లేచింది పాప. అప్రయత్నంగా వెళ్లి ఎత్తుకుంది సుజాత. "ఉండమ్మా! పాలు తెస్తాను. పడుదువుగానీ. ఇప్పుడు నీ వద్ద ఎక్కడివి ?" అంటూ హడావిడిగా వెళ్లిందామె

'ప మ్మయ్యా!' అనుకుంది సుజాత పాప యింకా ఏడుస్తూవుంటే, ఉదయం లాగానే నోటిలో వేలు వుంచింది. అమాయకంగా ఆ వేలిని చీకుతూ వుండిపోయింది పాప. అప్రయత్నంగా అప్పుడు ట్రెయిన్‌లో జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది.

తను ఆలోచనలో మునిగిపోయి రాత్రంతా నిదరేపోలేదు. రాత్రి కడుపు నిండా పాలుపట్టేదేమో అతను, ఉదయందాకా పాప కెవ్వుమని కూడా అన్లేదు. కదలనూ లేదు. కానీ తెల్లారేక ఏడుపు ప్రారంభించింది

"ఏంటమ్మా! పాప అలా ఏడుస్తూవుంటే నువ్వు ఆలోచనలో పడిపోయావు?" పక్కబల్లపై పడుకున్న ముసలమ్మ తనని కుదుపుతూ ప్రశ్నించింది

ఉలికిపడింది తను.

"పాలు పట్టమ్మా!"

"పాలా ?"

"ఏమ్మా! అయ్యో! పాపకి తల్లిపాలు కరవయ్యేయా, అయితే పోత పాలయినా పట్టు- సీసా వెంట తెచ్చుకోలేవా?" ప్రశ్నపై ప్రశ్న! ఏం చెబు తుంది తను "అదేం చోద్యం తల్లీ! పిల్లని చేతుల్లోకయినా తీసుకో. తల్లి స్పర్శ తగిలితేనే చాలు ఏడుపు మానుతుంది!" అంది మళ్లీ అప్రయత్నంగా. చేతులు చాచి ఎత్తుకుంది. చిత్రం! పాప ఏడుపు మానేసింది తన స్పర్శలో మాతృస్పర్శ లభించిందా యీ పాపకి?

"వచ్చే స్టేషన్‌లోనయినా పాలుకొని పట్టమ్మా! అంతదాకా నావద్ద మందు కోసం వున్న తేనె వేలితో అద్ది నోటికి తాకించు!" అంది. పల్లెటూరి ఆమె అయినా ఎంత ఆదరణ? ఎంత ఆప్యాయత! ఎవరికెవరు? ఎక్కడిదీ స్వచ్ఛత! సహజంగా దయా, దానం, ప్రేమ ఉంటాయి వీళ్లలో!

'ఊరు చేరగానే అనాధ శరణాలయంలో చేర్చెయ్యాలి' అనుకుంది. తర్వాతి స్టేషన్‌లో పాలుకొని పట్టూ! తన ఉద్యోగానికీ యీ చాకిరీకి ఎలా కుదురు తుందీ పసిబిడ్డ? సంరక్షణ అంటే మాటలా? తనతో ఏమవుతుంది? రైల్లోనే వదిలేసి వెళ్ళాలనుకున్న నిర్ణయం పాప ఏడుపూ, ముసలమ్మ చొరవతో అలా మారింది

"ఇదిగో సుజాతా పాలసీసా! మా చంద్రమణి తర్వాత దీని ఉపయోగం లేకపోయింది. వెతికి శుభ్రంచేసి తెచ్చేసరికి కాస్త ఆలస్యమయింది!" జానకమ్మ పిలుపుతో ఊహలనుంచి బయటపడి, సీసాకి కర్చీఫ్ చుట్టిపెట్టి పాప నోటికి అందించింది సుజాత.

పది నిమిషాలలో పాలు తాగుతూ మళ్లీ నిదురపోయింది పాప "పద! నువ్వు భోంచేద్దువుగాని. యీ పూట యిక ఎలాగూ ఆఫీసు కెళ్లే పనిలేదుగా! కాస్సేపు పడుకుందువు రాత్రంతా ప్రయాణమాయె!"

జానకమ్మలో వుండే చిత్రమే అది ఆమె ప్రాణం పెడుతుంది సుజాత అంటే! ఆమె మాటల్లో ప్రేమ, ఆత్మీయత అలా అలా వర్షిస్తాయి.

భోజనానికి కూర్చుంది సుజాత. ఎదురుగా కూర్చుందామె. 'ఎప్పుడో మళ్లీ తలెత్తుతుంది!' అనే భయంతో ఆమెవైపు చూడకుండా తలొంచుకుని భోజనం ముగించింది.

"ఆ యిప్పుడు చెప్పు! ఎవరీ పాప"!

సూటిగా అలా నిలేసి కళ్ళల్లోకి చూస్తూ ప్రశ్నించేసరికి సుజాత మాట తడబడింది. "పిన్నీ - యీ పాప - పాప... " ఆమె తర్వాత పూర్తి చేయలేక

పోయింది. 'ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి? ఎవరో స్టేషన్‌లో ఎక్కేసి, తర్వాతి స్టేషన్‌లో దిగుతూ యీ పాపని తన కప్పగించి వెళ్లారని చెబితే ఎవరు నమ్ముతారు! నిజమయినా ఎంత కష్టం ఒప్పించేందుకు!'

"సుజాతా!" ఆ పిలుపుకి ఉలికిపడింది.

"మీ అక్క కూతురా!"

"ఆఁ" అంది అప్రయత్నంగా.

చప్పున నవ్వేసింది. "దొంగపిల్లా! అబద్ధం ఆడినా అతికినట్టుండాలి! ఇక చాలుగానీ నువ్వేం చెప్పక్కర్లేదు. నా కంతా తెలిసిపోయింది. మరి ఉద్యోగానికీ దీనికీ లంకె కుదరదే ఎలా చేస్తావు?"

గాబరాపడిపోయింది సుజాత. 'పిన్నిగారూ! మీ రేమనుకుంటున్నారు? ఈ పాప_ఈ పాప_ఈ పాప_నా పాప...."

"పిచ్చిపిల్ల_యింకేం మాటాడకు. నువ్వు ఆఫీసుకి వెళ్ళి వచ్చేదాకా మా యింట్లో వుంటుంది___"

ఒక సమస్య తీరిందనిపించింది. 'కానీ _ కానీ తనను గురించి ఏమనుకుంటుంది ఈమె_ ఈమెతో వివరంగా చెప్పెయ్యాలి!'

"ఇక పడుకోమ్మా! సాయంకాలం మళ్లీ వస్తాను. ఈ పూటకి పాలు లేవు. సాయంకాలం తీసి వుంచుతాలే. పాపకోసం మరో అరలీటరు ఎక్కువెయ్యనా? ఆవుపాలు విడిగా పంపుతాలే!" అద్దెయిళ్ళతోపాటు ఆమెకి పాడిపశువులూ వున్నాయి. ఆ కాంపౌండ్‌లో అందరికీ చిక్కని పాలు తాగే అదృష్టం కలిగిస్తుంది ఆమె.

జానకమ్మగారు వెళతోంటే చూస్తూ వుండిపోయింది. పాపకేసి చూసింది! హాయిగా పొత్తిళ్లల్లో నిద్రపోతోంది. భయంలేదు, ఆందోళన లేదు. ఆలోచన లేదు. ఆరాటం లేదు! బాల్యం ఎంత అదృష్టవంతమైంది! ఆలోచనలలో నిద్రలోకి జారిపోయింది సుజాత!

## 2

జానకమ్మగారి పుణ్యమా అంటూ ఆ పూట సాఫీగా గడిచిపోయింది.

బేబీ ఆట్టే ఏడుపుగొట్టు పిల్ల కాదు కాబోలు. ఆ సాయంకాలం జానకమ్మ నీళ్లుపోస్తూ వుంటే కేరింతలు కొట్టింది. నిండా మూడు నెలలుంటాయేమో! పౌడరువేసి, బుగ్గన చుక్కపెట్టి, బొట్టూకాటుక పెట్టగానే రబ్బరుబొమ్మలా తయారయింది. ఆ పిల్లని చంకన వేసుకుని వెళ్లిందామె.

అంతా ఆఫీసుల నుంచి తిరిగొచ్చి అసురుసురై పోయినట్టుగా వున్నారు. అయినా జానకమ్మగారి చేతిలో నెలల బిడ్డ కనిపించగానే అందరూ ఎక్కడలేని ఉత్సాహంతో, కుతూహలంతో 'ఎవరెవరు?' అంటూ ఆరా తీశారు.

జానకమ్మగారు నవ్వుతూనే చెప్పింది. కథలాగా చెప్పింది. అందరూ నోళ్లు నొక్కుకుని 'కలికాలం!' అన్నారు.

సుజాత యింటిపనితో బయటికే రాలేదు. అందరూ తలొకరీతిగా వ్యాఖ్యానిస్తూ, రకరకాలుగా ప్రశ్నిస్తూ వేధిస్తారని భయపడింది కూడా. ఆ రాత్రి బేబీ ఎనిమిదింటికి తిరిగొచ్చింది సుజాతవద్దకి.

"సుజాతా ఏం పేరే పిల్లపేరు?"

తెల బోయింది సుజాత. 'అవును! ఏం పేరు అనుకుంది' అనుకుంది.

"పోన్లే! సిరిమల్లి పువ్వులాగా తెల్లగా, బొద్దుగా ఉంది. మల్లీశ్వరి అని పేరు పెడదాం! పాపం! యిలాటి పిల్లలకి నామకరణమా బండలా?" అంది

సుజాత మళ్లీ తెల్లబోయే పరిస్థితి అది. పిల్లని ఆమె చేతికిచ్చి "పాలు పట్టాను. మళ్లీ రాత్రి ఏడిస్తే పట్టు? లేకపోతే వద్దు." అని వెళ్లిపోయింది జానకమ్మ.

తలుపేసుకుని పడుకున్నా సుజాత ఆలోచనలు విరిగిపోలేదు. 'ఈ పిల్లని గురించి ఎవరికయినా ఏం చెప్పాలి. అంతా జానకమ్మలాగా వుంటారా? ఆవిడ ఏదేదో వూహించుకుంటుంది. అయినా విశాల హృదయంతో అర్థంచేసుకోగలిగినట్టు ప్రవర్తిస్తోంది. అంతా అలా వుంటారా? తనేం చెప్పినా ఎవరు నమ్ముతారు. ఊహూఁ లాభం లేదు. రేపు అనాధ శరణాలయంలో విడిచేసి రావాలి!'

ఆ ఆలోచన రాగానే అటు చూసింది. నోట్లో వేలేసుకుని బంగారుబొమ్మలా నిద్రపోతుంది మ-ల్లీ-శ్వ-రి. అవును జానకమ్మగారు మంచి పేరే పెట్టేరు.

'ఈ పిల్ల తల్లి ఎవరో? అసలు అతను తండ్రేనా?'

ఎందుకలా వదిలేసి వెళ్ళాడు? ఎక్కడికి వెళ్లిపోయాడు?

నేనంటూ బ్రతికుంటే ఎప్పటికయినా మిమ్మల్ని కలుసుకుంటానని ఎంత ధైర్యంగా చెప్పాడు. ఎలా కలుసుకోగలడు? అంతదాకా తను యీ పిల్లని, నిందల్ని మోస్తూ బ్రతకాల్సిందేనా?

సుధ ఎవరని అడుగుతాడు? అతనికి రేపోమాపో తెలుస్తుంది. ఆఫీసులోనో వీధిలోనో ఎవరో ఒకరు చెపుతారు! అప్పుడు తనేం సమాధానం యివ్వగలదు? నలుగురూ నాలుగు విధాలా అంటూ వుంటే అతను, తను సహించుకోగలరా?

ఇది ఒకనాటి బరువా ? ఒక వాడ బరువా ? అందునా ఆ-డ-పి-ల్ల - దీన్ని పెంచి పెద్దచేసి ఓ అయ్యచేతిలో పెట్టాలి ? తనే ఓ అయ్య చేతిలో లేదే' ఇక ....

ఆలోచించలేకపోయింది ఆ పైని. ఆలోచనతో తల పగిలిపోతున్నట్టుగా వుంటే వేడి వేడి పాలు గ్లాసునిండా ఒంపుకుని తాగింది. ఆలోచనలని దూరం చేసింది. మరో అరగంటలో నిదురలోకి జారిపోయింది.

మరురోజు ఉదయం తొమ్మిది గంటలకల్లా తయారైంది. భోజనంచేసి మధ్యాహ్నానికి టిఫిన్ తయారుచేసుకుంది. దాన్ని బేగ్‌లో వేసుకుని, తలుపులు వేసి, బేబీని తీసుకుని జానకమ్మగారింటికి వెళ్ళింది.

లోపల ఆమె భర్త, పిల్లలు భోజనం చేస్తున్నారు.

"పిన్నీ! పాపని ఈ పూటకి జాగ్రత్తగా చూసుకో. సాయంకాలం ఆఫీసు నుంచి అటే శరణాలయానికి వెళ్ళి మాటాడి వచ్చి, విడిచిపెడతాను. ఆఫీసుకి టైం అయింది!" అంది గబగబా.

జానకమ్మగారు తెల్లబోయిన క్షణంలో తేరుకుని "వెర్రిపిల్ల ఎవరో ఏదో అనుకుంటారని అలా బెంబేలుపడిపోయి - కన్నతల్లిని బంగారు బొమ్మలాంటి పిల్లని అనాధాశ్రమం పాలుచేస్తావా! చాల్లే వూరుకో - అంతగా నీకు బరువు అయితే నే పెంచుకుంటా! చంద్రమణి తర్వాత మా యింట్లో పసిపిల్లలు లేరని తెగ ఉబలాటపడుతున్నారు. సరె! సరె! నువ్వు ఆఫీసు కెళ్ళిరా!" అంది దాన్ని ముద్దులాడుతూ.

'ఈ పిల్ల నా పిల్ల కాదు. నేను యింకా కన్నెనే! కావాలంటే నన్ను డాక్టరుతో పరీక్షింపచేసుకోండి! రైలుస్టేషన్‌లో ఎవరో దౌర్భాగ్యుడు నాకు అంటగట్టి పోయాడు. కర్మ! నేను అందరితో మాటలు పడుతున్నాను' అని అరవాలనిపించింది. అయినా సభ్యత అడ్డువచ్చి మెల్లిగా తిరిగొచ్చింది.

సరిగ్గా తొమ్మిదిన్నరకి ఆ సందుమలుపులో సిటీబస్సు ఆగుతుంది. ఆ యింటిలో అద్దెకుంటున్నవాళ్ళు, ఆ చుట్టుపక్కల ఆఫీసు కెళ్లేవాళ్లూ అంతా అక్కడ హాజరవుతారు ఒకటి రెండు నిమిషాల ముందు.

సుజాత అక్కడకు వెళ్ళి నించుంది. ఆమెని చూసి ఎవరూ పలకరింపుగా నవ్వలేదు. ఉదయంనించీ ముఖాలు చాటుచేసుకున్నారు. ఎవరి యింట్లో వాళ్ళకి చచ్చేంత పని. సమయానికి అన్నీ తెముల్చుకుని బయటపడటం బ్రహ్మ ప్రళయం ఇక అప్పుడు కబుర్లకి టైం ఎక్కడలే అనుకుంది.

విశాల, సునంద, ఉత్తర, రేణుక ఎవరూ పలుకరించలేదు. లత గబగబా

వచ్చింది దగ్గరికి. ఆ పిల్లకి మాట తొందరెక్కువ. అన్నీ గబగబా కలిపేసి నట్టుగా మాటాడుతుంది.

"హాయ్! ఈ మూడునెల్లూ ఎక్కడి కెళ్లావే! మీ పిన్నికి జబ్బన్నావ్! నాన్న రాశాడన్నావ్! నువ్వే తీసిపోయి వచ్చావు! అవునూ! లగేజ్‌తో వచ్చావందే జానీ అత్తయ్య! ఏదీ నీ లైప్లీ లగేజ్ ఎక్కడుంది?"

తెల్లబోయింది సుజాత.

"అదేనే - నీ మల్లి - నీ నల్లమల్లి - సిరిమల్లి-"

"జానికమ్మ పిన్నిదగ్గరే వుంది." క్లుప్తంగా అంది సుజాత.

"ఇంతకీ ఆ హీరో ఎవరే?"

ఒళ్లు మండిపోయింది సుజాతకి "షటప్!"

లత ముఖం వాడిపోయింది. మళ్లీ ఏదో అనబోయేలోగా బస్సు అల్లంత దూరంలో కనిపించింది "డోంటాక్ ట్రాష్!" అంది సుజాత.

బస్సు రాగానే ఎక్కింది. అందరూ ఎక్కేసినా ఎవరూ మాటాళ్లేదు. నన్ను ముట్టుకోకు అన్నట్టుగా వుండిపోయారు.

ఆఫీసు స్టాప్ రాగానే దిగేసింది సుజాత.

* * *

ఆఫీసు మెట్లెక్కుతోంది సుజాత. అయినా ఆలోచనలే! భయం – కూడా పట్టుకుంది. మూడు నెలల మెడికల్ లీవ్ తర్వాత తొలిసారిగా వస్తోంది వారం రోజులు కాజువల్ లీవ్ పెట్టి వెళ్లింది ముందు. తర్వాత అక్కడ పరిస్థితి చూసి డాక్టర్ సర్టిఫికెట్‌తో మెడికల్ లీవ్ పెట్టింది ఏడుస్తూనే శాంక్షన్ చేసి వుంటారు ఆఫీసరు పర్లేదు మేనేజరే ఏడ్చిపోయి వుంటాడు.

"గుడ్ మార్నింగ్!?"

అప్రయత్నంగా "మాణింగ్" అని తలెత్తి చూసింది. సుధ! సుధాకర్! తన కో క్లర్క్! వెన్నెలలాటి చిరునవ్వుతో నిలుచున్నాడు.

"ఎప్పుడొచ్చారు!"

"నిన్న?"

'సరిగ్గా వంద రోజులు!'

"ఏ పిక్చర్‌కి?" నవ్వుతూ అడిగింది అతనికి సినిమాపిచ్చి కాస్త ఎక్కువ.

"ఏ సినిమాకీ కాదు. మీరు వూరెళ్లి! మరిచిపోయారా?"

"ఓహ్!" నవ్వేసింది సుజాత. మెల్లిగా మెట్లెక్కుతోంది. "బాగున్నారా?"




"చూస్తున్నారుగా! ఈ తెల్లబట్టలు మాయలేదు, క్రాఫింగ్ చెరగలేదు. వెయిట్ తగ్గలేదు. శుభ్రంగా వున్నాను!"

గలగలా నవ్వేసింది. "మీరేం మారలేదు!"

"మారిపోయి వుంటాననుకున్నారా? ఊహూఁ మీలాగే నేనేం మారిపోలేదు."

"నేనేం మారిపోయాను!" ఆఫీసులో అడుగుపెడుతూ అంది. ఇంకా ఎవరూ సీట్లోకి రాలేదు. మేనేజరు మహాశయుడు సరిగ్గా పదీపదికి వస్తాడు. టైం ఇప్పుడింకా పదికి పది తక్కువే!

"ఊరికెళ్ళగానే ఉత్తరం రాస్తానన్నారా! ఊహూఁ మెడికల్ లీవుకి ఎప్లికేషన్ పెట్టావు ఏమైందోనని హడలి చచ్చాను."

"ఎందుకు ?!"

"ఏమండీ! మెడికల్ లీవు అంటే ఎవరికయినా భయం కాదా! మీ క్షేమయిందోనని ఒకటికి రెండుత్తరాలు రాశాను. ఏదీ మీ నుంచి సమాధానం వస్తేనా ?" నిష్ఠూరంగా అన్నాడు.

"సారీ! సుధా! నేను ఉత్తరం రాసేందుకు వీల్లేకపోయింది. ముందుగా నీకు క్షమాపణ చెప్పుకోవాలనుకున్నాను. అలాగే నీవే ముందుగా వచ్చావు యీరోజు!"

"నీకోసమే వచ్చాను. రోజులు లెక్కపెడుతున్నాను. నిన్నటికి ఆఖరు. ఈ రోజు తప్పక వస్తావని నమ్మేను. అలాగే వచ్చారు. బ్రతికించారు!"

"ఏం"

"మళ్లీ ఎక్కడ సెలవు పెట్టేస్తావోనని! ఆఫీసరుగారికి ఎలాగో చెప్పి అప్పుడు శాంక్షన్ చేయించాను. మేనేజరు శతవిధాలా అడ్డుప్రశ్నలు వేశాడనుకో-అయినా ఆయన నా మాటే విన్నారు!"

"థాంక్స్!"

"ఏమిటండి సుజాతా! అలా పొడి పొడిగా మాటాడుతున్నారు. మాటలూ మనుషులూ మరిచిపోయారా!'

"లేదు సుధా! పరధ్యాన్నం!"

'ఎవరి గురించి!'

"ఛీ! పో!" అంది నవ్వుతూ.

"అదుగో మేనేజరాధముడు విచ్చేయుచున్నాడు. ముందస్తుండి దండప్రణామములు లంచం సమర్పించుకుని ప్రసన్నుడిని చేసుకో. లేదా అగ్గిరావుడయిపోతాడు - సెలవు జీతం శాంక్షన్‌కి రాయడు!"

సుధాకర్ మాటలు పూర్తికాకముందే, మేనేజరాధముడు అనబడే రామలింగయ్యగారు వచ్చారు. ఆయన శ్రీవైష్ణవుడు. చక్రాంకితాలువేయించుకున్న నిష్ఠాపరుడు. పట్టెవర్ధనాలతో, కోటుతో, పిలకతో, నశ్యంకాయతో ఆఫీసుకి విచ్చేసి తిరువరాధనంలాగా ఆఫీసుని కాచి రక్షిస్తూ వుంటారు.

"నమస్కారమండి!"

"నమస్కారం" అంటూనే ఆశ్చర్యంగా తలెత్తి చూశాడాయన ఈ వంద రోజులుగా వినబడని తెలుగువందనం ఎక్కడిదా అనుకుంటూ! అంతా 'గుడ్ మార్నింగ్!' గాళ్ళే. ఒక్క సుజాతే నిండుగా చేతులెత్తి నమస్కరించి అంటుంది మరి!

ఆయన ముఖం వికసించింది ఆ సంబోధనకి. ఆనందంతో ఒక్కపట్టు పొడుం పీల్చి "ఆఁ ఎప్పుడొచ్చావ్ అమ్మాయ్!" అన్నారు. అంతలో ఆయనకి పూర్వాపరాలు అన్నీ గుర్తుకొచ్చాయ్. "ఇదిగో సుజాతా! అలా చెప్పాపెట్టకుండా సెలవులు పెట్టేస్తే ఎలా? ఇదేం ఆఫీసా? ధర్మసత్రమా! మనపై అధికార్లు ఉన్నారు! అపై అధికార్లున్నారు! ఆపై ప్రభుత్వం వుంది. పనులు కుంటితే ఎలా! మేం పనిసాగక ఎంత చచ్చామనుకున్నావ్. ఇదిగో సుధాకర్ నీ సీటు వర్కులో సగం పూర్తిచేశాడు. మిగతా ఈ పిలకమీదుగా వెళ్లింది. ఒక్కరూ ఇతర్ల పేపర్లు చూడరే! సరే! ఏదో అయిందయిపోయింది! ఇకముందు సెలవు పెట్టకుండా చూడు!" అన్నాడు.

"అలాగేనండి!"

"ఇంతకీ ఆరోగ్యం ఎలా వుంది! కాస్త చిక్కినట్టున్నావ్!"

"జబ్బా నాక్కాదండీ! మా పిన్నికి. అలాగంటే నెలవిశ్వరవి మెడికల్ సర్టిఫికెట్ జతపరిచేను!'

"హర్నీ! బావుందమ్మా! బావుంది! చంపేవు ఈ నిజం చెప్పి ఆఫీసులో దుమారం లేపొద్దు. అంతా ఎమ్మెల్ అంటారు!" అన్నాడు నవ్వుతూ.

"అలాగేనండీ! ఇదిగోనండి ఫిట్‌నెస్ సర్టిఫికెట్టు. జాయినింగ్ రిపోర్టు!"

"రిజిస్టర్లో సంతకం చెయ్యమ్మా!"

సంతకం పెట్టేసింది సుజాత! సరిగ్గా పదిన్నర! 'హమ్మయ్య!' అనుకుని ఆఫీసు పనిలో మునిగిపోయింది.

* * *

లంచ్ బ్రేక్‌దాకా వంచిన తల ఎత్తకుండా పనిచేసింది సుజాత! మనస్సుకి విరామం యివ్వకుండా పనిచేస్తేకానీ ఆలోచనలు దూరం అయ్యేట్టుగా లేవు. అందుకే చకచకా పనిచేస్తూ పెండింగ్‌లో వున్న ఒకటి రెండు ఫైళ్లు డిస్పోజ్ చేసింది. రామలింగయ్యగారికి అందించి కాంటీన్‌వైపు కదిలింది.

ఇద్దరూ ఓ మూల కూర్చున్నారు. తన టిఫిన్ తెరిచి ఉప్మా సగం ప్లేటుకి సర్దింది. రెండు వడలు యిటు సర్దేడు సుధాకర్.

"ఇస్తివాయినం పుచ్చుకుంటి వాయినం. బావుంది."

"థాంక్యూ! వడలు బావున్నాయంటే మా అమ్మ మరీ సంతోషిస్తుంది! ఈ మూడునెలలూ ఒంటిగా టిఫిన్ తిన్లేకపోయాననుకోండి!"

"సుధా! ఇక మామూలుగా పిలవు. ఒకసారి అండీ అంటావు మరోసారి నువ్వు అంటావు. అలవాటు తప్పించవా!" నవ్వుతోనే అంది.

"సారీ!" అన్నాడు సుధాకర్.

అంతలో వచ్చాడు నాగరాజు. అతను జానకమ్మగారి తమ్ముడు. అవతలి సెక్షన్‌లో సెక్షనాఫీసరు. వసపిట్ట. అతని అంతరాంతరాల్లో సుజాత కాపురం చేస్తోంది. ఎలాగయినా ఆమెని పెళ్ళాడాలనేది అతని ఆకాంక్ష.

"హల్లో! సుజాతగారూ! ఎప్పుడొచ్చారు. ఇద్దరు మాటాడుతూ వుంటే మధ్యన వచ్చేవాడు మూర్ఖుడన్నారు. అఫ్‌కోర్స్! నేను మూర్ఖశిఖామణిని కాను - అయినా ఈ రోజే మీరు ఆఫీసుకి వచ్చేరు కాబట్టి పలుకరిస్తున్నారు!"

"థాంక్స్!" తనముందు టీ అతనివైపు జరుపుతూ "కూర్చోండి తీసుకోండి టీ!" అంది.

"నో థాంక్స్! నేను అన్నీ ముగించుకొనే వచ్చాను!"

సుజాత రెట్టించలేదు.

"సుజాతగారూ! ఆ పాప ఎవరండీ?"

ఉలికిపడింది. అతనింత సూటిగా అడుగుతాడని అనుకోలేదామె. అసలా విషయం ఆఫీసుదాకా వస్తుందనీ అనుకోలేదు కూడా! అందుకే "ఆ పాప - ఆ పాప - మా పాపే -" అంది.

"మీ పాపా!"

"అవును!"

అతని ముఖంలో కారుమబ్బులు కమ్మాయి. సుజాత ముఖంలో చిరుచెమట్లు పడుతున్నాయి. ఇద్దర్నీ గమనిస్తోన్న సుధాకర్‌కి ఏమీ అర్థంకాలేదు.

"ఎవరండీ ఆ అదృష్టవంతుడు? అదే ఆ పాప తండ్రి?"

సుజాత ముఖం ఎర్రబడింది. అతని ప్రశ్నలోని హేళనకి అసహ్యించుకుంది. "నాకూ తెలియదు!" అంటూ లేచి నుంచుంది. గబగబా నడిచింది.

కొత్తగా అర్థంకాని సుధాకర్ మౌనంగా అనుసరించాడు. సుజాత పడివడిగా తన సీటుకి వెళ్ళిపోయింది.

తలబద్దలవుతున్నట్టుగా వుంది ఆమెకి. కళ్ళు మూసుకుని కణతలు నొక్కుకుంది. అంతలో ఎటెండర్ శాస్త్రి వచ్చి "ఆఫీసరుగారు పిలుస్తున్నారు!" అని చెప్పాడు.

టాయ్‌లెట్ రూంలోకి వెళ్ళి ముఖాన చారెడు నీళ్ళు కుమ్మరించుకుని, తల విదుల్చుకుంది. తర్వాత నెమ్మదిగా ఆఫీసరు దగ్గరికి నడిచింది. ఆ సమయంలో అతనక్కడే వున్నాడు. అతన్ని చూసీచూడనట్టుగా, ఆఫీసరుగారికి నమస్కారం చేసింది అక్కడున్న నాలుగయిదు నిమిషాలూ ముళ్ళమీద వున్నట్టుగా గడిపి, బయటపడింది. ఆయనేం అడగలేదు. కుశలమడిగి, యికముందు అలా అర్థాంతరంగా సెలవు పెట్టొద్దనీ, జాగ్రత్తగా పనిచేసుకోమని చెప్పేడు. చౌదరి గారికి యాభయ్ సంవత్సరాలుంటాయి. పేచీలు ఎరగని మనిషి. అతనికి కావలసింది వర్క్ అండ్ డిసిప్లిన్.

తగ్గుతోన్న తలనొప్పి పెరుగుతున్నట్టుగా అనిపించినా, యిక చేసేదేంలేక

ఊరకే గడిపేసింది. ఏదో పేపర్‌కి రిప్లై రాయబోతున్నా సరిగా రాయలేక పోయింది. దాంతో పనిని బండకేసి ఊరకే గడిపేసింది,

సరిగ్గా అయిదింటికే బయటపడింది మేనేజర్‌కి చెప్పి.

గేటుదాటగానే "సుజాతా! ఎందుకలా అప్‌సెట్ అయ్యావు ?" అని అడిగాడు సుధాకర్.

"సారీ సుధాకర్!"

"మరి ఆ అమ్మాయి – అదే పాప–"

"సారీ అన్నానా! ఇంకేం అడక్కు–నేనే ఓ రోజున చెబుతాను!" అంది. ఆమె కంఠంలో దిగులు, భయం, విసుగు.

"సారీ! మళ్లీ అడగను. చెప్పేదయితే నువ్వే చెబుతావుగా!" అన్నాడు.

అతనలా అన్నా ఆ మగబుద్ధిని గమనించింది సుజాత. అయినా ఏమీ అన లేదు. అంతలో బస్సు వచ్చింది. "వెళ్ళొస్తాను!"

"అదేం మరో బస్సుకి వెళదువుగానీ– వేడివేడిగా కాఫీ, టీ తీసుకుందువుగాని రా! ఓ టాబ్లెట్ వేసుకుంటే సరిపోతుంది!"

'సారీ! నేను అర్జంటు యింటి కెళ్ళాలి!" అని బస్సు ఎక్కేసింది. అతను తెల్లబోయి నుంచున్నాడు.

"ఏమిటి సుధాకర్! రాణిగారు చెక్కేసారు అప్పుడే!" సిగరెట్ కాలుస్తూ అడిగాడు నాగరాజు.

తలతిప్పి చూశాడు సుధాకర్. అతనికి అతనంటే గిట్టదు. అయినా సభ్యత కోసం పలుకరిస్తాడు. సుజాతని గురించి అలా ఎద్దేవగా మాటాడటం యిష్టం లేదు. అయినా ఏమనగలడు ? "తలనొప్పిగా వుందని యింటికి వెళ్లిపోయారు!" అన్నాడు క్లుప్తంగా.

పకపక నవ్వేడు నాగరాజు. "మీరెంత అమాయకులండీ! ఆడాళ్లు ఏం చెప్పినా నమ్మెయ్యటమేనా ? ప్చ్! ప్చ్! ఆవిడ అంతగా పరుగులు తీసింది పాప కోసమండీ!"

"పాపా ? పాపెవరు ?" కనుబొమలు ముడుస్తూ అడిగేడు.

"ఏమో! ఆవిడపాపే అంటున్నారంతా! ఉదయం ఆవిడ ఓ బేబీతోటి దిగింది. ఈ మూడు నెలలు అందుకే సెలవుపెట్టిందేమో మరి!" నింపాదిగా అన్నాడు

సుధాకర్ వేళ్లు బిగుసుకున్నాయి. పళ్లు గిటగిటమన్నాయి. 'ఇంత అభాండం

వేస్తాడా రాస్కెల్!' అనుకున్నాడు. అతని మాటలవి లక్ష్యపెట్టనట్టుగా "అదిగో బస్ వచ్చింది. వెళతాను!" అని వెళ్లిపోయాడు.

"పూర్ ఫెలో!" అనుకున్నాడు నాగరాజు.

## 3

"అమ్మా గడ్డపెరుగు మావయ్యొచ్చాడు!" తల్లిని కేకేసింది జానకమ్మగారి కూతురు సవిత.

"నోర్ముయ్! గడ్డపెరుగు రుచి నీకేం తెలుసు!"

"రావోయ్ బొమ్మరిదీ రా! ఈ మధ్య యిటు రానేలేదే! గడ్డపెరుగుమీద మనసుపోయిందా యివాళ!" రాఘవయ్యగారు కూడా నవ్వుతూ అన్నారు.

"ఏమిటి బావగారూ! మీరు మరీను – బ్రహ్మచారిని – మజ్జిగ నీళ్లతో సరిపెట్టుకుంటున్నవాడిని! ఎప్పుడూ మీ యింటి గడ్డపెరుగును వర్ణిస్తే యిక ఎప్పుడూ అదే మాటనా!"

"నువ్వూరుకోరా రాజూ! వీళ్లందరికీ నువ్వు అలుసైపోయావు. ఏమండీ మీకూ మీ పిల్లలకే అంత లోకువయ్యాడా వాడు!" కసురుకుంది జానకమ్మ.

నవ్వుతూనే వున్నాడు నాగరాజు.

అంతలో ఏడ్చింది కెవ్వుమంటూ మల్లీశ్వరి.

"ఎక్కడిదీ సన్నాయి మేళం?" అడిగాడు రాజు.

"ఆఁ ఎవరో మన కాంపౌండులో వచ్చివుంటారు. మీ అక్కయ్య అలుసు చూసుకుని నెత్తికెక్కించారు!"

"ఎవరక్కయ్యా!"

"ఓరే నాగరాజూ! ఎన్నాళ్లయిందిరా యీ మధ్య నువ్విటు రాక? సవితకి మీ ఆఫీసులో ఏదో సంబంధం వుందన్నావు. కుర్రాడు బుద్ధిమంతుడన్నావ్? ఏదీ మాటాడిందెక్కడ?"

జానకమ్మగారి మాటలకి "పోమ్మా! నీ కెప్పుడూ నా పెళ్లి దిగులే! నే నిప్పుడేం చేసుకోను. నేను చదువుకుంటాను. బాగా చదువుకుని ఉద్యోగం చేస్తాను!" అని పరిగెత్తిపోయింది సవిత.

"నీ కేం తెలుసమ్మా నా బాధ. పదహారు పదిహేడు నిండీ నిండకమునుపే నీ పెళ్లి చేయాలి." అని తనలో అనుకుని "ఏరా! పలుకవేం?" అంది.

"రేపు ఆదివారం పిలుచుకుని వస్తాలే!"

"అతనితో హెచ్చరించావా?"




"ఇదిగో జానీ! ఈ కాలపు పిల్లలు అలా చెబితే రారు. మనింటికి టీకి తీసుకునిరా రాజూ! ఇక్కడ పరిచయం చెయ్ అందర్నీ. తర్వాత అతనితో విషయం కదిలించు!" అన్నాడు రాఘవయ్య.

"దట్స్ గుడ్! మంచి ఐడియా బావగారూ!"

"పద భోంచేద్దాం! గడ్డపెరుగు, ఆవకాయ, పప్పులుసు, అప్పళాలు—'

"నోరూరించేస్తున్నారు బావగారు!"

"మాటలతో కడుపు నింపేస్తారా!" అంది జానకమ్మ.

"పిన్నీ!" అంటూ వచ్చింది సరిగ్గా ఆ సమయంలోనే సుజాత. ఆమె రాగానే చేతికి అందించింది పాకని. జానకమ్మగారితో "వస్తా పిన్నీ!" అంటూ కదిలింది సుజాత.

రాజు అలాగే చూస్తూ వుండిపోయాడు.

భోజనాల వేళలో "అయితే ఆ పాప సుజాతగారి పాపా?" అని అడిగాడు రాజు.

జానకమ్మగారు సమాధానం యివ్వకుండా "ఇంకొస్త వులుసు వడ్డించనా?" అంది.

"అడిగి వడ్డిస్తారండీ! వెయ్!"

"చాలు! చాలు! కడుపు నిండిపోయింది!"

"అప్పుడేనా మామయ్యా! ఇంకా గడ్డపెరుగు—"

"సవితా! గడ్డపెరుగు రుచి నీకేం తెలుసు? కాటకం ప్రాంతాన్నించి వచ్చిన వాడికి పొంగులెత్తే తుంగభద్రని చూస్తే ఎలా వుంటుంది? తెరులుతూ నాచుకపోయిన పొలంవాడికి నిండుగా వెన్నులతో గాలికి తలలూపే పొలం చూస్తే ఎలా వుంటుంది?"

"మజ్జిగనీళ్ల పోసుకునేవారికి చాకుతో తెగనరకాలన్నట్టుండే మీగడతోటి పెరుగు చూస్తే అలా వుంటుందా మామయ్యా! అమ్మా మామయ్యకి ఓ బర్రెని తోలివ్వరాదూ! లేదా రోజూ పాలు పంపరాదూ?"

"సవితా?"

తల్లి గద్దింపుకి సవిత "నోర్మూసుక తింటా?" అంది.

ఫక్కున నవ్వేరందరూ!

భోజనాలయ్యాక "సుజాతగారు యిక్కడే వుంటున్నారా అక్కయ్యా?" అని ఏమీ తెలియనట్టుగా అడిగాడు.

"ఆఁ,"

"ఆ పాప ఆవిడ పాపేనా?"

రాఘవయ్యగారూ కుతూహలంగా చూశారు.

"ఆఁ."

"ఆఁ" ఆశ్చర్యపోయారు రాఘవయ్యగారు. "ఆ అమ్మాయికి పెళ్లి కాలేదన్నావు కదటే!"

"ఆ! అయిందట!"

"ఎప్పుడు?"

"ఎప్పుడో ఒకప్పుడు. ఆఁ ఆరాలు మీ కెందుకు?" చిరాగ్గా వెళ్లిపోయింది జానకమ్మ.

నింపాదిగా నవ్వుకున్నాడు నాగరాజు.

రాఘవయ్యగారేం మాటాళ్లేదు. "వస్తా బావా! వస్తానక్కయ్యా!" అంటూ వెళ్లిపోయాడు నాగరాజు.

లోపలినుంచే "అలాగే" అంటూ కేకేసింది జానకమ్మ.

అక్కడినుంచి కదలి మెల్లిగా సిగరెట్ కాల్చుకుంటూ సుజాత గదిముందు నిల్చున్నాడు నాగరాజు. పున్నమి వెన్నెల చెట్లగుండా మసక మసగ్గా పడుతోంది. ఇంకా ఎవరూ మంచాలు బయటవేసుకోలేదు. తిళ్లతో కబుర్లతో గడుస్తోందికాలం.

"సుజాతా!"

అ పిలుపుకి ఉలికిపడింది సుజాత. అది నాగుబాము బుసకొట్టినట్టుగా వినిపించింది ఆమెకి.

తలుపు తోసుక లోపలికి వచ్చాడు. ఆ సమయానికి ఆమె మల్లీశ్వరిని పక్కలో పడుకోబెట్టి కూర్చునుంది.

"గుడ్! పక్కా తల్లిలా వున్నారు!"

ఆమె పెదాలు కంపించాయి.

"నేను దుర్మార్గుడిని కాను. మంచివాడిని. చాలా మంచివాడిని. నాకయినా నిజం చెప్పండి. ఈ బిడ్డకి తండ్రెవరో చెప్పండి. వాడిని నిలదీసి లాక్కొస్తాను!"

"నాకు తెలియదు!"

నవ్వేడు నాగరాజు! ఆ చూడండి! మరీ అంత అమాయకత్వం మీ ఫేస్‌లో పలకదు. నేను అనుకోవటం ఆ పాప మీ పాప కాదు. ఎవరి పాపమో మీ రెండుకు భరించాలి! సుజాతగారూ! కళంకం ఒకసారి వస్తే పోదు. అది అజన్మాంతం వెన్నంటుతూ వుంటుంది!"

ఒక్క క్షణం ఆమె కళ్లు మిలమిల మెరిశాయి. మళ్లీ మామూలుగా అయ్యేయి. "మీరు వెళ్లిపొండి!" అంది మృదువుగా.

"మీ పట్టుదల మిమ్మల్ని నాశనం చేస్తుంది!"

"నే నంత సులభంగా నాశనంకాను!"

"అదే నా నమ్మకం! మీ మాటలు, మీ ప్రవర్తన ఎందరినో ఎన్ని విధాలో గాయపరుస్తున్నాయి. నిజం చెప్పండి!'

'నేను నిజమే చెప్పాను!'

ఒక్క క్షణం మౌనంగా గడిచిపోయింది.

"సుజాతగారూ! మీరు యీ అమ్మాయిని వదల్చుకోండి. ఏ అనాథశరణాలయానికో యిచ్చెయ్యండి! లేదా ఎవరికయినా ఇవ్వండి. కానీ మీతోపాటు ఉంచుకోకండి!"

ఆమె మాటాళ్లేదు.

"నా సహాయం కావలిస్తే చెప్పండి! నా ఫ్రెండ్ ఒకడు ఆర్ఫనేజ్ మేనేజరుగా వున్నాడు! అక్కడ వదిలేద్దాం!"

"థాంక్స్!" పొడిగా అంది.

"నే వస్తాను. గుడ్ నైట్!"

అతను వెళ్లిపోగానే బయటికి వచ్చి అటూ యిటూ చూసి తలుపులు గట్టిగా మూసి 'భగవాన్!' అనుకుంటూ మంచంపై వాలిపోయింది. ఆమె మనస్సులో తుఫాను చెలరేగుతోంది.

* * *

వేకువనే లేచి తండ్రికి ఉత్తరం రాసింది. తను క్షేమంగా చేరినట్లూ, ఆఫీసులో చేరినట్టూ, అంతా సరిగా వున్నట్టూ రాసింది. పినతల్లి ఆరోగ్యం జాగర్త అని తమ్ముడిని బాగా చదువుకోమనీ, చెల్లాయిని బడికి తప్పక పంపుతూ వుండమనీ రాసింది. నెలవు జీతం శాంక్షనయి రాగానే కొంత పంపిస్తానంటూ రాసింది. కానీ రైల్లో వ్యక్తి పరిచయం, అతను హఠాత్తుగా ఓ పాపని తనపై వదలి వెళ్ళటం, ఆ పాప తనకి బరువుగా తయారవటం రాయలేదు.

తనే యింకా పాప విషయమై ఓ నిర్ణయం తీసుకోలేదు. రెండు రోజులకే ఆ పాపని విడిచి వుండలేని ఆత్మీయత పెరిగింది. ఆ పిల్లని ఆశ్రమంలో వదలటమా, తనతో వుంచేసుకుని లోకాన్ని ఎదిరించటమా? అన్నీ చిక్కులే రావచ్చు. సుధాకర్ తనపై చూపుతున్న అభిమానం తను ప్రేమగా అనుకుంటుంది. అతనూ మామూలు మగవాడిలాగా ప్రవర్తిస్తే - తను యిన్నాళ్లుగా తన మనస్సులో నిర్మించుకున్న ప్రేమమూర్తి చిన్నాభిన్నమవుతుంది. దాన్ని తను భరిస్తుందా?

సుధాకర్‌ని తను దూరంచేసుకోగలదా? ఊహూఁ ఆ ఊహే బాధాకరంగా వుంది. అందరూ వున్నా ఎవరూ లేని తనకు, తన ఒంటిమనస్సుకి అతను రాగబంధువయ్యాడు. అతనేనాడూ నోరు తెరిచి ప్రేమిస్తున్నానని అనలేదు.

కానయితే ఆ చూపులు, ఆ కళ్లల్లో కనిపించే ఆత్మీయతానురాగాలు, ఆ ఆరాధనా భావం, ఆ ఎటికసీ తనకు ప్రేమభాష్యం చెబుతున్నాయి. తను ఆ భాషని చదవగలదు.

మరి యీ సమస్య ఎలా?

అతనికి విడమరచి చెప్పాలి. ఈ రోజు వీలయితే చెప్పాలి. అతని సలహా తీసుకోవాలి. అతనెలా చెబితే అలా నడుచుకోవాలి. అతనిదే తుదినిర్ణయం.

ఆ ఊహ మనస్సులో నిర్ణయమైపోయేసరికి సుజాత మనస్సు తేలికపడింది. తెల్లగా తెల్లారేసరికే తను స్నానం చేసి, ఇల్లు శుభ్రంచేసి, ఇంటిపనల్లా చేసేసుకుంది.

పాపని లేవగొట్టి స్నానం చేయించి, కొత్తగా కొన్న గౌను తొడిగి, పాలు



పట్టింది_ఆడుతూ పాడుతూ పాపని నిద్రపోనివ్వకుండా ఆడిస్తూ, ఆ బుజ్జిముండకి కబుర్లు చెబుతూ వంటచేసింది. అది ఏడవకుండా నవ్వుతూవుంటే చకచకా తయారై, భోజనం చేసింది. టిఫిన్ సిద్ధంచేసుకుని రంచన్‌గా తన మామూలు టయానికి తయారైపోయి మల్లిని జానకమ్మగారికి అప్పగించేసి బస్సుస్టాండుకి వెళ్లింది.

ఈరోజు ఎవరినీ లెక్క_చేయనంత ధైర్యం వచ్చింది. ఆ ధైర్యంతోనే బస్ స్టాపులో నిబ్బరంగా నుంచుంది.

* * *

## 4

పదయిందిః వళ్లంతా కళ్లుచేసుకుని చూస్తోంది సుజాత. అయితే సుధాకర్ పొలకువే లేదు. అసహనంగా గేటువైపే చూసి వెళ్లి తన సీట్లో కూర్చుంది. మరో పది నిమిషాలకి రామలింగయ్యగారు వచ్చారు. నమస్కారం చేసింది సుజాత.

"ఆఁ రామ్మా! నీతో పనుంది. ఈ పూట సుధాకర్ సెలవు పెట్టాడు. అతని సీటుకి సంబంధించిన రెండు ఫైళ్లున్నాయి. కొంచెం చూసిపెట్టు!"

హతాశురాలై ఆ ఫైళ్లు అందుకుని సీట్లోకి పోయింది. ఫైలు తెరవగానే అతని దస్తూరీ కనిపించింది. ఆ దస్తూరీలో అతని ముఖం కనిపించినట్లైంది. అతనిలాగే అతని అక్షరాలూ పొందిగ్గా అందంగా వుంటాయి.

తనెంత ఆశగా వచ్చిందో అంత నిరాశ ఎదురైంది. అతను రేపు రాడని కాదు, రేపూ అడక్కూడదనీ కాదు. కానీ రేపు రేపే! ఈ రోజు ఈ రోజే! ఒకరోజు నిశ్చింతగా గడిచిపోవలసింది – ఆందోళనతో నిరాశతో గడుస్తోంది ప్చ్! తన అదృష్టంకంటే దురదృష్టమే ఓ అడుగు ముందుగా వుంది.

ఆలోచనలని పక్కకి నెట్టి ఆ ఫైల్స్ రెండూ పూర్తిచేసింది. రామలింగయ్య గారు సంతోషించారు. "చూడు సుజాతా! నీలాటివాళ్లు సెక్షన్ కొక్కరున్నా సరే దేశం యీ రోజు యిలా వుండేదికాదు. అయ్యో ప్రభుత్వం సొమ్ము రోజు కింత తింటున్నామే అన్న ఆలోచనే వుండదు. రోజంతా శ్రమపడినా రిక్షావాడికీ, కూలీవాడికీ పది రూపాయలు గిట్టవు. హాయిగా ఫేన్లకింద, కుర్చీల్లో కూర్చుని బల్లమీద రాసేందుకి బద్ధకం. పనిచేసే అయిదున్నర గంటల్లో సిగరెట్లు, కాఫీల కని గంట తగలేస్తారు. ఒక్క ముక్క పని పూర్తిచెయ్యరు. దీనికి తోడు శనివారం శలవు వచ్చేసింది. ఆ మటుక్కి మన ఆఫీసు మెరుగనుకో!"

సుజాత ఆ కాంప్లిమెంటుకి సంతోషించలేదు.

నిస్పత్తువగా సీట్లోకి వచ్చేసింది. లంచ్‌లో టిఫిన్ సహించలేదు. కాంటిన్‌కి వెళ్లకుండా సీట్లోనే ముగించింది. మిగిలింది శాస్త్రికి యిచ్చేసింది. అతనితోనే టీ తెప్పించుకుని తాగింది. తలనొప్పిగా వుంటే టాబ్లెట్ మింగింది.

లంచ్ తర్వాత ఏదో ఫైలుమీద ఆఫీసరు 'స్పీక్' అంటే వెళ్లి వివరించి వచ్చింది. ముందు యీమె రాసిన నోట్ కాదన్న ఆయన, ఈమె మాటలు విన్నాక ఓకే అన్నాడు. అదో తృప్తి!

"కూర్చోండి!" అన్నాడు నవ్వుతూ బట్టతల సవరించుకుని.

"థాంక్స్!" అంటూ కూర్చుంది.

బెల్ నొక్కితే శాస్త్రి టీ తెచ్చి యిద్దరిముందూ పెట్టాడు.

"తీసుకోండి."

"థాంక్స్!" అంటూ కప్పు తీసుకుంది! 'ఈ రోజున్న తలనొప్పికి బండ్లకొద్దీ టీ తాగాలనిపిస్తోంది!' అనుకుంది.

"మీరు బాగా వర్క్ చేస్తారు. ఎకౌంటెస్టుకి రాయండి. తప్పకుండా ప్రమోషనొస్తుంది. మీ రెలాగూ జాబ్‌లో కంటిన్యూ అవుతారు కదా! లేకపోతే మీ వుడ్‌బీ కాదంటే మానేస్తారా!"

ఆ మాటలకి సమాధానం యివ్వాలనిపించలేదు.

"ఎప్పటికీ జాబ్ వదిలెయ్యకండి! ఈ కాలంలో ఆడవాళ్ళకి జాబ్‌కి మించిన సెక్యూరిటీ లేదు. ఆడవాళ్ళకి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని మించిన ఆరోగ్యం మరేదీ లేదు!"

"అవున్సార్!"

"అందుకే అమ్మాయి లిద్దర్నీ బ్యాంక్స్‌లో చేర్పించాను. ఇద్దరూ గ్రాడ్యుయేట్స్. కవల పిల్లలు. ఇక పెళ్ళిళ్ళు చేయాలి!"

సుజాత మృదువుగా నవ్వేసింది. 'తనని గురించి తండ్రి యిలా అనుకుంటాడా? ఆయన కెప్పుడూ డబ్బుయావ! జీతం మొత్తం ఆయనకే పంపించి, తనెలా గడిపినా ఫర్లేదు. చెల్లిపై, తమ్ముడిపై ఉన్న ప్రేమలో అణుమాత్రం ప్రదర్శించినా తనెంత సంతోషించేది. ఆ విషయంలో పిన్నే నయం!'

"పెద్దమ్మాయికి ఓ ఐ.ఎఫ్.ఎస్. పాసైన సంబంధం వచ్చింది. రెండో అమ్మాయికి ప్రొబేషనరీ ఆఫీసర్–ఇన్‌కంటాక్స్ డిపార్టుమెంట్– సంబంధం చూశాను. ఇద్దరూ దూరపు బంధువులే!"

తలూపింది. 'తన సంబంధం తనే వెదుక్కుంటోంది. తను పద్మం! అయినా సుధాకర్ చుట్టూ తన మనస్సు తిరుగుతోంది. అతని ఐశ్వర్యానికీ, వాళ్ళ హోదాకి తను తగదు గాక తగదు. కానీ తనని తనుగా స్వీకరిస్తే తన కంటే అతనికి మంచి అమ్మాయి దొరుకుతుందా? అతని మనస్సెలా వుందో?'

"సరే! వెళ్ళిరామ్మా!" అన్నాడు నాగరాజు రావటంతో.

సుజాత లేచి వెళ్ళిపోయింది సీట్లోకి.

సాయంకాలం టపాల్లో శుభలేఖ వచ్చింది. తన ఫ్రెండ్ చందన! తనతోపాటు డిగ్రీచేసి, బి.ఎడ్. చేసి మునిసిపాలిటీలో చేరింది వరుడు విశ్వనాథ్. ఫారిన్‌లో ఇంజనీర్! అదృష్టవంతురాలు అనుకుంది.

ఓ అరగంట ముందుగానే పర్మిషన్ అడిగి బయటపడింది. మెల్లిగా నడుస్తూ దగ్గర్లో వున్న ఓ హోటల్లో దూరి టిఫిన్‌కి ఆర్డరిచ్చింది.

"హలో!"

సుధాకర్ గొంతు విని ఉలికిపడింది. సుధాకర్, అతని పక్కనే మరో

అమ్మాయి. మేడ్ ఫర్ ఈచ్ అదర్ అన్నట్టుగా వున్నారు. ఒక్క క్షణం మనస్సులో అసూయ జర్రిపోతులా కదలాడింది. "హల్లో!" అంది మృదువుగా.

"అలా వున్నారేం?" ఎదురు కుర్చీల్లో కూర్చుంటూ అడిగేడు. ఆ అమ్మాయి అతని పక్కనే కూర్చుంది.

"ఏంలేదు! ఈ మధ్య తలనొప్పి తరచుగా వస్తోంది!"

"ఊరు మారింది కదా! వాటర్ చేంజ్ వల్ల అలా వుందేమో! వంట్లో వేడిగా వుందా ?" చప్పున చేయి అందుకొని చూశాడు.

"ఊహూం" మృదువుగా విడిపించుకుంది. ఓ అపరిచిత యువతి ముందు అతనలా చనువుగా తన చేతిని పట్టుకోవటం సిగ్గుగా అనిపించింది.

"షి యీజ్ మృదుల! ఎం.బి.,బి.యస్. మా కజిన్. ఇక్కడ జి.హెచ్.కి పోస్టింగ్ యిచ్చారు. ఈ రోజే డ్యూటీలో జాయినైంది అందుకే యీ రోజు సెలవుపెట్టాను!" అన్నాడు.

"నమస్కారం!"

"చెప్పానుగా మృదులా! మా ఆఫీసు అంతటికీ ఏకైక నమస్కారం ఈవిడే!"

మృదుల మృదు గంభీరంగా నవ్వింది తనకి ముందే చెప్పినట్టుగా. ప్రతి వందనం చేసింది.

సుజాతకి ఉడికిపోయింది. కళ్లు వేగంగా చలించాయి. అతని కళ్లు కొంటెగా నవ్వుతున్నాయి. ఖరీదైన సూట్‌లో రాజులా వున్నాడు. స్ప్రే చేసుకున్న ఇంటిమేట్ సువాసనల్ని నింపుతోంది. ఆవిడ ఖరీదైన పట్టుచీర కట్టుకుంది. 'హాస్పిటల్‌కి వెళ్లిందా పేరంటానికి వెళ్లిందా ?' అనుకుంది.

అంతలో బేరర్ వచ్చి ముగ్గురి ముందూ స్వీట్స్ పెట్టి వెళ్లేడు. "తీసుకోండి!" అన్నాడు అతను. సుజాత ఏదో అనబోయింది. "ప్లీజ్ టేకిట్!" అంది మృదుల స్వీట్ వాయిస్‌తో.

మరో అరగంట అలా గడిచిపోయింది. మృదుల మంచి మాటకారి. సంస్కారయుతంగా మాటాడుతుంది. నీట్‌గా, సింపుల్‌గా మాటాడుతుంది.

బయటికి రాగానే "రండి! కార్లో డ్రాప్‌చేస్తాను!" అన్నాడు.

"నో థాంక్స్!"

"బెట్టుచేయకు! నేనూ రోజూ ఆఫీసుకి కారు తేను. నాన్నగారు ఇండస్ట్రియల్ ఎస్టేట్‌కి తీసికెళతారు. లేదా గ్రేప్‌గార్డెన్‌కి వెళతారు లేదా థియేటర్ కాంప్లెక్స్ వెళతారు! రండి!"

సుజాతకి ఆ లిస్ట్ వినగానే మండిపోయింది. మృదుల ముందు తన గొప్ప చెబుతున్నాడా! లేక తన స్థాయి ఎంత గొప్పదో వివరిస్తున్నాడా అనుకుంది.

డోర్ తెరిచి "కమాన్!" అన్నాడు దర్పంగా.

యువరాజులా వున్న అతని ఠీవికి - బదులు చెప్పలేకపోయింది. కారు రివ్వున దూసుకుపోతోంది. తమ యింటి గేటుముందు ఆపేడు. "ఎప్పుడైనా కలుస్తూ వుండండి!" అంది మృదుల సుజాత చేయి మృదువుగా నొక్కుతూ.

"థాంక్స్!"

"ఆమెని కలవాలంటే హాస్పిటల్‌కి వెళ్లాలి! అక్కడికి మీ రిపుడే వెళ్లలేరు!" కొంటెగా అన్నాడు,

"యూ సిల్లీ! ఏంటా మాటలు? మీరేం పట్టించుకోకండి సుజాతా! నేనుండేది మెటర్నిటీ వార్డులో!"

ఆ మాటలు వినగానే సిగ్గు ముంచేసుకొచ్చింది. బుగ్గల్లోకి వెచ్చని ఆవిర్లు వచ్చేయి. తల వంచుకుంది.

"బై!" అన్నాడు కారు కదిలిస్తూ —

స్వర్గంద్వారం దాకా వెళ్లి తిరిగొచ్చినట్టుగా గేటు తీసుకొని కాంపౌండు లోకి అడుగుపెట్టింది.

నేరుగా తన గదికి వెళ్లకుండా జానికమ్మగారింటివైపు నడిచింది. గేటు దాటగానే ఉదయంనుంచీ వున్న నిరాశ, అలసట, నిస్పృహ ఎటో ఎగిరిపోయిన ట్లైంది. టైఫాయిడ్ రోగికి పథ్యం పెట్టినట్టుగా వుంది. తన మనస్సులోని చికాకునంతా పోగొట్టాడా సుధాకర్!

వెన్నెలకంటే చల్లగా వుండే తన మనస్సుతో, మాటలతో తన దే సీరియస్ నంతా ఒక్క అరగంటలో మాయం చేశాడు అనుకుని ఆ సంతోషంతో మల్లీశ్వ రిని చూడాలని నేరుగా అక్కడికి వెళ్లింది.

* * *

తలుపు దగ్గరికి వెళ్లేసరికి ఏవో మాటలు వినబడ్డాయి. రాఘవయ్యగారి గొంతు వినబడింది.

"అందుకే అమ్మాయిని ఖాళీచేయమంటున్నాను!"

"ఎందుకండీ అంత పట్టుదల? అమ్మాయి తప్పేం వుంది ఇందులో?"

"జానీ! నలుగుర్లో పరువుగా వున్నాం మనం. మన కాంపౌండులో, మన యింటిలో అలాటి అమ్మాయి వుంటే మన పరువూ మర్యాదా?"

"ఎలాటి అమ్మాయి?"

"చెడిపోయిన అమ్మాయి!"

"హుం, చెడిపోవటానికి ఆ అమ్మాయి కాయా? పండా? ఎవరు చెప్పారండీ మీకీ విషయం? ఎవరు నేర్పారండీ యీ బుద్ధులు!"

ఆయనేం అన్లేదు.

"ఎక్కడ ఏ అమ్మాయి దగాపడినా ఆ దగావెనుక పురుషుడున్నాడండీ! మోసం ఊపిరిగా, అన్యాయం ఆశయంగా బ్రతికే మీ మగవాడున్నాడండీ! చూసి చూసి ఏ ఆడపిల్లా తనకై తన గొంతుక కోసుకోదు. ఉచ్చులు బిగిస్తూ, ఆశలు రగిలిస్తూ, కబుర్లు చెబుతూ గోతిలో దించుతారండీ! మనకి తెలియదా? మనం ఈ వూరికెందు కొచ్చామో కొంచెం గుర్తుచేసుకోండి!"

"జానీ!" బాధగా అన్నాడాయన. ఆయన గుండెల్లో ఏవో జ్ఞాపకాల గుబుళ్లు పరువుపై మెరిసిపడిన నిగుళ్లు హోదాని తగ్గించిన దిగుళ్లు.

"కవిత—"

"జానీ!" గద్దించారాయన. భార్య నోటంట ఆ మూడు అక్షరాలూ విని సహించలేనంత ఉద్వేగంతో అరిచాడు.

ఒక్క క్షణం నిశ్శబ్దం.

"ఆ అమ్మాయిని యిక్కడే వుండిపోనీ!" బరువుగా అన్నాడు.

జానకమ్మగారు నిట్టూర్చారు బరువుగా. ఆమె తలుపు వైపుగా వస్తోన్నట్టు అడుగుల చప్పుడు వినిపించింది. తడబడుతున్న అడుగులతో, బరువెక్కిన హృదయంతో యింటివైపు గబగబా వెళ్లిపోయింది సుజాత.

ఆమె మనస్సులో యిప్పుడు కవిత మెదుల్తోంది. కవిత ఎవరు? వీరికి ఏమవుతుంది? తలుపులు తీసుకుని మంచంపై భారంగా వాలిపోయింది.

## 5

సుమారు పదిహేను రోజులు గడిచాయి. మల్లీశ్వరి అటు జానికమ్మగారికీ, యిటు సుజాతకీ బాగా మాలిమిఅయింది. అవుపాలు బాగా వంటపట్టటంవల్ల వళ్లుచేసి బొద్దుగా తయారైంది. 'ఛీ! పో!' అంటే నవ్వుతోంది. పెద్దయ్యాక ఛీపో అంటే ఏడుస్తావే వెర్రిదానా! అంటుంది జానికమ్మ అలాటప్పుడు.

సుజాత ఫకాల్న నవ్వుతుంది.

జానికమ్మ రాత్రి అది చూసి సిగ్గుపడుతుంది.

ఆరోజు రాత్రి ఆ సంఘటన జరిగిన తర్వాత రోజూ మల్లీశ్వరి రాత్రిళ్లు జానికమ్మగారి పక్కలోనే పడుకుంటుంది.




ఆ మరుసటిరోజు ఉదయం నీళ్లపోసి, పౌడరు వేసి తను స్వయంగా కత్తిరించి చేతికుట్టుతో కుట్టిన చేతుల్లేని జాకెట్ తొడిగి తీసుకుని వచ్చి "ఇదిగో నమ్మా నీ పాప!" అందామె.

సుజాత నవ్వుతూ ఎత్తుకుంది. రాత్రంతా అలసి ఆలోచనలతో సతమతమయి పోయి ఎప్పుడో నిద్దరపోయింది. నిద్దర్లోనూ పాపను కలవరించింది.

"రాత్రి పాప అక్కడే నిద్రపోయింది. నువ్వు రావటం కాస్త అలశ్యమై చీకటిపడ్డాక వచ్చావు కదూ! అప్పటికే నిద్రపోతోంది. అందుకే దాన్ని ఎందుకు కదిలించాలని నా పక్కలోనే వేసుకున్నాను!"

"పోన్లే పిన్నీ" అంది దాని బుగ్గలు ముద్దాడుతూ.

'ఈ పాప కళ్లలోకి చూస్తూ, దీన్ని ముద్దులాడుతూ వుంటే ఇంత ఆనందం వుందే – దీన్ని యితర్ల కోసం, ఇతర్ల సూటిపోటి మాటలకోసం వదలుకోనా?' అనుకుంది.

బాగా తర్కించుకుని తర్కించుకుని ఎలాగైనా దీన్ని వదలకూడదనిపించింది. ఆ నిర్ణయమే నిర్ధారణ చేసుకుంది గట్టిగా.

ఈ పదిహేను రోజుల్లోనూ సుధాకర్ చమత్కారాలు ఎక్కువయ్యాయి. మాటల్లో శృంగార ఛాయలు అనుకోకుండా వస్తోన్నాయి. సూటిగా కళ్లల్లోకి చూస్తే అందులో ప్రేమ తప్ప మరో భావం కనిపించటంలేదు.

ఆరోజు సుధాకర్‌కి సెక్షనాఫీసరుగా ప్రమోషన్ వచ్చింది. అందరూ అభినందించారు. ఆఫీసరు పార్టీ ఏర్పాటు చేయించాడతనితో. ఒక బిజినెస్ మాగ్నెట్ కొడుకు పార్టీయిస్తే ఎంత గ్రాండ్‌గా వుండాలో అంత గొప్పగా వుంది ఆ పార్టీ.

అంతా అయ్యాక ప్రత్యేకించినట్టుగా సుధాకర్ ఒకచోట నిలుచుని వున్నాడు. అటూ యిటూ చూసి ఎవరి ప్రత్యేక దృష్టి తనపై పడకుండా చూసుకుని అతని దగ్గరగా వెళ్ళింది సుజాత.

ఏదో ఆలోచనల్లో వున్న అతను ఆమె రాకని గమనించలేదు. "హృదయపూర్వకమైన అభినందనలు స్వీకరించండి!" అంటూ ఓ గులాబీపువ్వు, యింటి నుంచి ప్రత్యేకంగా సెంటులో తడిపింది తీసి యిచ్చింది.

ఉలికిపడ్డట్టయి, సంతృప్తికరంగా చూసి, ఆమె చేతిలోంచి ఆ పువ్వు స్వీకరించి ఎవరూ చూడకుండా చప్పున ఆ చేతిని అలాగే పెదాలకి ఆనించుకుని చిన్నగా ముద్దిడుకున్నాడు.

సిగ్గుతో చేయి లాక్కుంది సుజాత.

"తప్పుచేశానా? తొందరపడ్డానా?"

"ఉహూఁ అవిడన్నట్టు చేసినదాన్లో తప్పులేదు. చోటులోనే తప్పు! అంతే!" అంది నవ్వుతూ.

"ఓహ్! అపూర్వం!"

థాంక్స్ అన్నట్టుగా నవ్వింది. సూటిగా అతని కళ్ళల్లోకి చూసింది. ఆ చూపులో వేయి రాగాలు, లక్ష ప్రేమలు, కోటి హృదయవీణలు పలికినట్లైంది.

"సుజీ!"

"ఊఁ."

"ఎవరో వస్తున్నారిటు! త్వరగా ఓ మాట చెప్పనా!"

"ఊఁ"

"రేపు ప్రత్యేకంగా స్వప్నలో నీకు డిన్నర్ యిస్తాను!"

"ఊఁ"

"తప్పక రావాలి?"

"ఊఁ"

"యింకేం మాటలు రావా?"

సుజాత ఏదో అనబోయేలోగా "నమస్కారం" అంటూ వచ్చారెవరో వ్యాపారస్థుడు.

సుజాత తప్పుకుంది "రేపు చెపుతా!"నంటూ

ఆ మాట అతని హృదయవీణని పలికించినట్లైంది.

"థాంక్స్!" అన్నాడు యింకా మెల్లిగా. తర్వాత వచ్చిన వ్యక్తితో మాటాడుతూ వుండిపోయాడు. ఆ రాత్రంతా సుజాతకి నిదరపట్టలేదు. ఎప్పుడో పొరలి పొరలి నిద్రలోకి జారిపోయింది. అయినా అక్కడ కూడా కలలే! ఆ కలల నిండా సుధాకరే! ఆమె హృదయమంతా అమృతం నిండినట్టుగా వుంది.

* * *

మరనటి రోజంతా ఆఫీసులో ఆనందంగానే గడిచిపోయింది. సూటిగా అతని కళ్ళల్లోకి చూడాలంటే సిగ్గుగా ఉంది. పదే పదే అతను ముద్దాడిన చోటు కళ్ళముందు కనిపిస్తోంది. ఆ చేయి పైభాగం అమృతీకరణమైనట్టుగా అనుభూతి కలుగుతోంది.

తీయని తలపుల మధ్య కాలం గడిచిపోయింది. ఆఫీసు వదలగానే బయటికి వచ్చారిద్దరూ!

అప్పటికీ యిప్పటికీ తేడా! అతనాఫీసరు! అదే సెక్షన్‌లో తను ఓ మామూలు క్లర్క్! అంతేనా! అతనెంతో ఐశ్వర్యవంతుడు. కోటీశ్వరుని ఏకైక పుత్రుడు. అతనితో పోలిస్తే తనా యింటి గుమ్మంఎక్కే స్థాయికూడా లేదు తనకి. తను ఓ మామూలు మధ్యతరగతి మనిషి కుమార్తె! అదీకాకుండా తన పుట్టుక ..!

అప్పై పూర్తి చేసుకోలేకపోయింది.

"త్వరగా రావాలి!" అన్నాడతను.

తలూపింది.

"ఆరున్నరకల్లా వెయిట్‌చేస్తూ వుంటాను —"

"అలాగే!?

"ఒక్కడినే వుంటాను!"

నవ్వింది సుజాత. అతనూ నవ్వేడు. అంతలో బస్ వచ్చేసింది. ఎక్కేసింది సుజాత. అతను కళ్ళతోటే టాటా చెప్పి తన స్టాపువైపు కదిలాడు.

ఇంటికి చేరి యార్డ్లీ సోప్‌తో స్నానం చేసింది. అది ఆమె గర్ల్ ఫ్రెండ్ పంపింది. పెట్టె అడుగున వున్న దాన్ని తీసి తొలిసారిగా వాడింది. ఖరీదైన పౌడరు, ఆపైన స్ప్రే వేసుకుంది. ఖరీదైన చీర కట్టుకుంది. ఇవన్నీ చందన పంపిన కానుకలు. తను పెళ్ళికి వెళ్ళకపోయినందుకు కోపగించుకుని ఉత్తరం రాస్తూ స్టేట్స్‌నుంచి భర్త తెచ్చినవి పంపింది.

బయటపడేసరికి ఆరు। చుట్టుపక్కలవాళ్లంతా విచిత్రంగా కళ్లు విప్పార్చుకుని చూసేరు। నడుస్తోన్న పరిమళంలాగా వుంది సుజాత। ఆ అందానికి, ఆ అలంకరణకి, ఆ హొయలకి పరిమళం అబ్బినట్టుగా వుంది ఆ వస్తువులని వాడటం.

హోటల్ ముందు కారాపుకుని, దాన్ని ఆనుకుని ఎటో చూస్తున్నాడు సుధాకర్. గంభీరంగా, హుందాగా, ట్రిమ్‌గా స్నఫ్ కలర్ సూట్‌లో హీరోలా వున్నాడనుకుంది, అతన్నా సమయంలో చేరి పలుకరించటానికి జంకింది.

ఆమె మనస్సుకి అతను తనంతకు పూర్వం ఎరిగిన వ్యక్తిలా కనిపించ లేదు. ఎవరో మారిపోయిన మనిషిలా అనిపించాడు. హిమాలయాల ఔన్నత్యం, సాగర గాంభీర్యం, ఆకాశ వైశాల్యం కనిపించాయి అతనిలో.

అయినా తనూ, తన సౌందర్యం కూడా వెలలేనివే అనిపించి ఆమెలో ధైర్యాన్ని కలిగించాయి. కలహంసలా, రాయంచలా నడిచింది. అందెలు మృదుపదరవళిని సృష్టించాయి.

ఆ చిరుసవ్వడికే అతనికి ధ్యానభంగం కలిగినట్టయి తల తిప్పి ఆమెని చూసి "ఓహ్!" అన్నాడు, ఆరాధనాపూర్వకంగా.

"నేను_నేను_"

"యు ఆర్ - యు ఆర్ బ్యూటిఫుల్!" అన్నాడు. అతని కళ్లల్లో ప్రశంస. ఆరాధన.

"థాంక్యూ!"

"యు ఆర్ మార్వెలస్. ప్రత్యేక సృష్టి నీది!"

తలొంచుకుంది సుజాత.

"లోపలికి వెళదామా?" ఆమె అంగీకారం తెలుపగానే లోపలికి దారితీశాడు. ఆ పార్టీ జరిగిన గంటసేపూ అతను గంధర్వలోకంలో, ఆమె స్వర్గసీమలో విహరించినట్టుగా అనుభూతి చెందారు.

ఆమె పెదాలపై సుతారంగా ముద్దుపెట్టుకుని, నడుంచుట్టూ చేతులు బిగించాడు. అతని వెచ్చటి తీపి, ఊపిరి, స్పర్శ ఆమె పాదాల్ని తొందరించాయి. నిగ్రహించుకోలేక చప్పున ముఖం తిప్పుకుంది.

"సుజీ!" ప్రేమగీతం, ప్రేమవేదం పలికినట్టుగా అన్నాడు

అదామెకి రవ్వల రవళి, మువ్వల మురళిలాగా అనిపించింది. మంచుమొగ్గ విరిసి, వానపువ్వు విరిసినట్టుగా అనిపించింది. హృదయగానం, మానసవీణ విన్నట్టుగా వుంది.

"మనం వెళదాం!"

"ఏం?"

"తొందరపడకూడదు. ముందు ఎంతో సుందరమైన భవిష్యత్తు వుంది. తీయని గుర్తుగా వుండవలసింది చేదుతిన్నట్టుగా కాకూడదు!" అరమోడ్పు కన్నులతో అంది.

అతని ఆవేశానికి పగ్గాలు వేసినట్టు, తొందరపాటుకి సంకెల్లు వేసినట్టు అయి ఆ కన్నులపై ముద్రవేసి "పద!" అన్నాడు నవ్వుతూ. ఆ గొంతులో కోపం లేదు. తాపం లేదు. బెస్ట్ ఫ్రెండ్‌లా వున్నాడు.

ఆమె దారితీసింది. అతననుసరించాడు. కారెక్కుతూన్న యిద్దర్నీ చూశాడు నాగరాజు.

* * *

వారం రోజులు తీపి కలలతో, మధుర భావనలతో గడిచాయి. ఆ రెండు జతల కళ్లు సరిగ్గా పదినిమిషాలు తక్కువ పదికి కలుసుకుంటాయి. పలుకరించుకుంటాయి. నవ్వుకుంటాయి లంచ్ అవర్లో టేబిల్‌కి అటూ యిటూ కూర్చుని మాటాడుకుంటాయి. ప్రేమని పూర్తిగా పంచేసుకుంటాయి. సరిగ్గా అయిదూ అయిదుకి వీడ్కోలు చెప్పుకుంటాయి. అప్పుడు చూడాలి ఆ కళ్లని. తిరిగి రేపు కలిసేదాకా ఎలా వేగాలి అన్నట్టుగా వుంటాయి. ఈ రాత్రి ఎందుకు కలిపించారు అన్నంత కసి వుంటుంది. అయితే రేపు కలుసుకుంటాం కదా! భయంలేదు! అన్న భావం వెల్లివిరుస్తుంది. సంతోషంతో విడిపోతాయి. అప్పుడు నవ్వుకుంటాయి.

సుజాత మనస్సునిండా సుధాకరే నిండిపోయాడు. అక్కడ పాపతో, యిక్కడ అతని సాన్నిధ్యంలో ఆమెకి రోజులు వెన్నెలరాత్రుల్లా వున్నాయి.

ఆరోజు ఆఫీసుకి వస్తూ తండ్రిగారికి ఉత్తరం రాసింది.

నాన్నగారూ!

ఇన్నాళ్లూ మీరు నా పెళ్లి గురించి ఏవేవో దిగుళ్లుపడ్డారు. ఎంతో ఆందోళన వెలిబుచ్చారు. ఒకానొక స్థితిలో నాకు పెళ్లే కాదేమోనని నిరాశపడ్డారు. నన్ను మన కుటుంబానికి దూరంగా వుంచుతూ వచ్చారు.

కానీ నాన్నగారూ! నా కన్నతల్లి - ఆ సాధ్వి మిమ్ము మనసారా ప్రేమించి, మీలో వున్న సంగీతాన్ని అభిమానించి మిమ్ము స్వీకరించినందుకు మీ పుణ్య దంపతులకి నేను కలిగినందుకు — ఆ పుణ్యాత్మురాలి ఆత్మ సదా నా యోగ

క్షేమాలే కోరుతూ వున్నందువల్లనేమో నేను ఓ భాగ్యవంతుడికి భార్యని కాబోతున్నాను.

ఆయన నన్ను ముందు అభిమానించారు. తర్వాత ఆదరించారు. ఇప్పుడు ఆరాధిస్తున్నారు. ఆయనకి నేను నేలమీద నడుస్తోన్న జాబిల్లిని. నింగిలో మెరుస్తోన్న సిరిమల్లెని. ఆయనకి నేను దక్కటం ఆయన వలపు పండిన పంటగా భావిస్తున్నారు.

మీరు ఈ ఉత్తరం అందగానే రండి! సాంప్రదాయకంగా మీరు రెండు మూడు మాటలు వాళ్ల నాన్నగారితో మాట్లాడిపొండి. ఇక్కడ మధిరప్రసాద్‌గారంటే ఎంత గొప్పవారో — నిత్యం పేపరు చూసే మీకు తెలుసు. ఈ నగరంలో ఆయనలేని కార్యక్రమం లేదు. పేరో, ఫోటోనో పత్రికలో రాని రోజు లేదు.

మీరు పిన్నితో సహా బయలుదేరి రండి. పిన్నికి ఈ శుభవార్త చెప్పండి. ఆవిడ ఎంతో సంతోషిస్తుంది. తమ్ముడికి, చెల్లికి నా ఆశీస్సులు.

నమస్కారాలతో మీ కుమార్తె,

సుజాత.

మళ్లీ మళ్లీ చదువుకుని, కవరు అంటించి పోస్టు చేసింది. ఆనందంగా ఆఫీసుకి బయలుదేరింది. బస్సు స్టాప్‌లో లతని, మిగతావాళ్లని తృణీకరించి చూసింది.

## 6

ప్రతిరోజూ ఉదయం కలుసుకోగానే నవ్వుతూ ఆనందంగా పలుకరించుకునే కళ్లు యీరోజు నవ్వుకోలేదు. ఆనందంగా పలుకరించుకోలేదు.

రెండు కళ్లు ఎదురు చూశాయి పలుకరింపుకోసం.

మరో రెండు కళ్ళు ఆ కళ్లని పలుకరించుకుంటూ పక్కకి తప్పుకున్నాయి. ఆ కళ్లపై ఉండే కనుబొమలు ముడిపడ్డాయి. ఆ జత కళ్లకి అనుగుణంగా కాళ్లు కొందరించాయి. కాళ్లజతకి వున్న బూట్లు కఠోర శబ్దంచేస్తూ వెళ్లేయి.

నిరాశపడింది సుజాత!

ఆరోజు ఎంతో ఆనందంతో వచ్చిందామె. తండ్రిని రమ్మని రాశానని చెప్పాలని తెగఉబలాటంతో వచ్చింది

ఎంత ఉత్సాహంతో వచ్చిందో అంత నీరుకారిపోయింది.

మధ్యలో ఓసారి ఫైలు తీసికెళ్లింది. అదో సాకు. దగ్గరగా వెళ్లాలని, మాటాడాలని తపన.

"ఏమిటి అలా వున్నారు ?"

అతను మౌనాన్నే ఆశ్రయించాడు.

"ఏమయింది?"

"లంచ్ అవర్లో మాటాడదాం!" ఆ కంఠంలో ప్రేమ లేదు. ఆదరణ లేదు. అప్యాయత లేదు. అసలు ముఖంపైపే చూళ్లేదు. ఫైలు చూస్తూ మాటాడేడు.

ఉస్సురుమంది సుజాత. 'ఎంతయినా మగవాళ్లు!' అనుకుంది. ఆ రెండు గంటలూ ఒక్క ఫైల్ చూళ్లేదు. ఒక్కమాట చదవలేదు. రాయలేదు. ఖాళీ పేపరుమీద పిచ్చిగీతలు గీస్తూ కూచుంది.

సరిగ్గా ఒంటిగంటకి మునిసిపల్ సైరన్ మ్రోగింది. ఉలికిపడింది సుజాత. చేతిలో పేపరుకేసి చూసుకుంది. సుధాకర్-సుధా-సుజాత-సుజాతాసుధాకర్-సుధా సుజాత- ఏంటీ పిచ్చి అనుకుంది. చంద్రబింబాలుగా గీసిన తన మనస్సుని మెచ్చుకుంది. ఎక్కడ చూసినా ఆ పేర్ల చుట్టూ చంద్రబింబాలు.

ఒకొక్కక్కరే కాంటీన్‌కి వెళ్లిపోయారు.

ఇద్దరే - ఆ యిద్దరే మిగిలారు.

అంతదాకా నిగ్రహించుకున్న ఆరాటం, ఆతురత ఆమెని యిక నిలువనీయ లేదు. పరుగులాంటి నడకతో వెళ్లింది.

"కూర్చో." ఏ భావం ప్రకటించని గొంతుతో అన్నాడు.

"ఏమైంది సుధా!" గాబరాగా అడిగింది.

"ప్లీజ్! కూర్చో సుజాతా!" కఠినంగా అన్నాడు.

కుర్చీలో కూలబడింది. "చెప్పు! ఏమిటి యీ సస్పెన్స్!"

"ఆ పాప ఎవరు ?"

"ఏ పాప ?" తెల్లబోయి అడిగింది.

"అదే నీ పాపగా జానికమ్మగారి చేతుల్లో పెరుగుతోన్న పాప! చెప్పు ఎవరితో చేసిన పాప ఫలితం అది ?"

శత శతఘ్నులు గుండెలో పేలినట్టయింది. "సుధా!" అంది నీరసంగా, కోపంగా!

"చెప్పు. ఐ వాంట్ ట్రూత్ ?"

పేలవంగా నవ్వింది. "నీకు నిజం కావాలా ?"

"యస్! స్పీకవుట్!"

"నామీద, నా మాటమీద నమ్మకం వుందా ?"

"ఇంతదాకా వుంది!"

"ఇప్పుడు లేదా ?"

"ఏమో అది నువ్వు చెప్పే నిజంపై ఆధారపడి వుంది!" సూటిగా ఆమె ముఖంలోకి చూడకుండా అన్నాడు.

పకపక నవ్వింది సుజాత.

తెల్లబోయాడు సుధాకర్. "ఏమిటా నవ్వు ?"

"ఆఖరికి నువ్వూ మామూలు మగాడివే ననిపించుకున్నావ్. ఎందుకొచ్చిందో అనుమానం ?"

"ఆ పాప ఎవరు ?"

"నా పాప కాకపోయినా నా పాపే !"

"నీ పాప కాదా ?"

"మళ్లీ మళ్లీ చెప్పాలా ! నా పాప కాదు !"

"ఎవరి పాప మరి ?"

"నాకు తెలియదు !"

"తెలియకుండానే కన్నావా ?"

తెల్లబోయింది సుజాత.

"అందుకేనా మూడు నెలల సెలవుపెట్టేవు. అనారోగ్యం అన్నావ్. పిన్ని అన్నావ్. అంతా అబద్ధమేనా ? నా నుంచి అంతా దాచినదానివి ఆ పాపనెందుకు తెచ్చావు ? ఏ అనాధ శరణాలయంలోనో వదిలేసి వచ్చి వుండొచ్చే ! అలా పెరగటం యిష్టంలేకపోతే ఏ చెరువుగట్టునో, తప్ప చాటునో గొంతు పిసికి చంపివుండొచ్చే—"

"సుధాకర్ ! స్టాపిట్ ? నన్ను శిశుహత్య చేయమంటున్నావా ? నువ్వు మనిషివేనా ?" గర్జించింది.

"అవును. మనిషిని కాబట్టే ఆ మాట అంటున్నాను. నువ్వు యీ ఆఫీసులో చేరినప్పటినుంచీ నాపై అనురాగాన్ని పెంచుకున్నావ్. నీ చూపులు నా కర్థమవు తున్నాయి. అయినా ఆడవాళ్ళకి సహజంగా దూరంగా వుంటాను నేను. అలాటి నన్ను నీ చూపులతో, మాటలతో మనిషిని నమ్మేట్టు చేశావు. నీ ఆకర్షణకి గురయ్యేట్టు చేశావు. నీ ప్రేమని విశ్వసించేట్టుగా చేశావు ?"

"అది తప్పా ? నిన్ను ప్రేమించటం తప్పయిందా ? కానీ నన్ను ఘోరంగా అవమానించటం తప్పు కాదు ! అనుమానించటం తప్పుకాదు ! ఏం మగవాళ్లు ! ఎద్దేవగా అంది.




"అవును మగవాడినే! అందుకే మీ ఆడవారిచేతిలో దగాపడ్డాను!"

"ఏం మోసపోయావ్? నువ్వేం నష్టపోయావ్!"

"ఇంకా ఆ మాట అడుగుతున్నావా? సిగ్గులేదు?"

"ఏం? నేనెందుకు సిగ్గుపడాలి?" రోషంగా అడిగింది. ఆమె కళ్లు నిప్పురవ్వల్లా వెలుగుతున్నాయి.

"పెళ్లికాకుండానే తల్లివైనందుకు. ఆ పిల్లకి తండ్రెవరో కూడా చెప్పుకోలేని దుస్థితిలో వున్నందుకు. పైగా యితర్లని మభ్యపెడుతున్నందుకు—"

"ఇక చాలించండి!"

"ఏం? ఎందుకు? నిజం వింటూవుంటే నిష్ఠూరంలా ధ్వనిస్తోందా?"

"నిజం! నిజం! ఏమిటా నిజం?"

"నువ్వు తల్లివికావటం నిజం! నీ నిజాన్ని దాచటం నిజం? నీ పుట్టుపూర్వోత్తరాలు దాచటమూ నిజం!"

"నా పుట్టు పూర్వోత్తరాలా?" తెల్లబోయింది ఆమె.

"అఁ. నీ పుట్టుక హీనంకామా?"

"సుధాకర్!" కేక వేసిందామె—

"ఊరకే అరవకు! నీ తల్లి వేశ్య. భోగంది. నిన్ను కని నలుగురికీ ముఖం చూపలేకపోయింది. నీ తండ్రిపాలిట పడవేసి ఎటోపోయింది. ఎక్కడుందో

ఎవరికీ తెలియద్దు. నీ తండ్రి పెళ్ళిచేసుకున్నాడు. నీ పిన్నికి నీ పుట్టుక గురించి తెలియకుండా జాగ్రత్తపడ్డాడు. కన్న ప్రేమతో ఊహ తెలిసేదాకా నిన్ను పెంచి, ఆ తర్వాత హాస్టల్స్‌లో పడేసి చదివించాడు!"

నిర్ఘాంతపోయింది సుజాత.

"నీ పుట్టుకే హీనం! నువ్వెలా పుట్టావో నువ్వూ అలాగే తల్లివయ్యావ్. ఎక్కడికి పోతాయి ఆ బుద్ధులు. తల్లి మంచిదయితే కదా బిడ్డలు మంచి వాళ్ళయ్యేది."

ఆమె కళ్ళల్లో నీళ్లు తిరుగుతున్నాయి. ఎంతో ఉదాత్తంగా గొప్పగా ఊహించుకున్న తన కన్నతల్లిని — ఆ మాతృమూర్తిని అతనలా హీనాతి హీనంగా చిత్రిస్తూవుంటే ఆమె మనస్సు తూట్లుపడిపోతోంది.

అవమానం, హేళన, దుఃఖం భరించలేకపోతోంది. అవన్నీ అబద్ధాలేనని వాదించలేకపోతోంది. యదార్థం తెలిస్తే కదా! తను అవి అబద్ధాలనగలిగేది?

"దయచేసి యికపై నాతో ఆ ముచ్చట తేకు. నీవూ నీ బిడ్డా సుఖంగా వుండండి. ఆ బిడ్డకి కన్నతండ్రి ఎవరో కనుక్కొని జీవితాన్ని సుఖమయం చేసుకో. అగ్నిలాంటి ఆ నిజాన్ని దాచి యితర్లని క్షోభపెట్టకు!"

"సుధాకర్!"

"ఇక చాలు! ఇక మాటాడేందుకేం లేదు!" కఠినంగా అన్నాడు. తెల్లబోయింది సుజాత. ఇదా యితని నిజ స్వరూపం! ఇంత కఠినుడా, ఇంత మూర్ఖుడా! అనుకుంది. ఇక అతనితో మరో మాటయినా మాటాడేందుకి యిష్టపడలేదు. చక చకా తన సీట్లోకి వెళ్ళిపోయింది. ఆలోచన తప్ప ఆవేదన లేదిప్పుడు.

* * *

సాయంకాలం దాకా ఎలాగో గడిపేసింది. ఆఫీసు వదలగానే చకచకా బస్‌స్టాపు వద్దకి వచ్చేసింది. అప్రయత్నంగా అటుకేసి చూసింది. ఎదుటి బస్‌స్టాపులో నుంచున్న సుధాకర్ చప్పున తల తిప్పుకున్నాడు.

నవ్వుకుంది సుజాత.

'ఇదా ప్రేమ! తను ప్రేమించానని తనని అభిమానించి ప్రేమించాడట! అంత ప్రేమా తన పుట్టుక తెలిసి, తన పాప రహస్యం తెలియకపోయేసరికి కరిగిపోయిందట! పాపం! ఇదే ప్రేమయితే యీ ప్రేమ ఈ రోజుల్లో అడుగడుగునా కనిపిస్తోంది!' అనుకుంది.

బస్సురాగానే ఎక్కేసి నేరుగా యింటికి వచ్చింది. తలారా స్నానం చేసింది ఆ వేళప్పుడు. భారమంతా దిగిపోయినట్టుగా, శరీరమూ మనస్సూ తేలికపడింది.

"ఇదిగోనమ్మా తల్లీ! ఈ రోజు ఎందుకో ఒకటే ఏడుపు. ఎవరి దృష్టి సోకిందో ఏమో!"

జానకమ్మగారు వస్తూనే నవ్వుతూ అందించింది మల్లీశ్వరిని. పాప సుజాత చేతుల్లోకి రాగానే చిత్రంగా నవ్వేసింది. ఏడుపు మానేసింది. పలుకరింపుగా నవ్వుతూ, కేరింతలు కొట్టింది. ఆపుకోలేక గాఢంగా ముద్దుపెట్టుకుంది సుజాత.

జానకమ్మగారి ముఖం కళకళలాడింది. "ఈ పూటకి నీ వద్దే వుంచుకోమ్మా!"

"అలాగే పిన్నీ! ఇక నుంచి రాత్రిళ్లు నా వద్దే పడుకోనీ! నాకూ ఎలాగో వుంటుంది!"

"అలా అలవాటు చేస్తే నువ్వు ఆఫీసుకి వెళ్లినపుడు యిబ్బందవుతుందమ్మా! పది గంటలకి వచ్చి తీసికెళతాలే!"

"అలాగే పిన్నిగారూ!" అంది.

ఆమె గడపదాటబోతూ వుండగా వచ్చాడు సుజాత తండ్రి సీతారామరావుగారు.

"నమస్కారమండీ! ఎప్పుడు వచ్చారు?" అందామె పలకరింపుగా.

"ఈ ట్రెయిన్‌కేనా నాన్నా!"

"ఊఁ" అన్నారాయన ముభావంగా

"పదండి నాన్నా! కాళ్లు కడుక్కుందురుగాని! పిన్నీ! కాస్తాగు. దీన్ని పట్టుకో! నాన్నకి కాఫీకాచి యిస్తాను!" అంటూ మల్లీశ్వరిని అందివ్వబోయింది.

"ఇప్పుడు కాఫీ గీఫీ అక్కర్లేదు. కాళ్లు కడుక్కోవటం అవీ ఏమీ వద్దు!" కఠినంగా అన్నాడు.

"నాన్నా!"

"సుజాతా! ఆ పాప ఎవరు?"

ఆ ప్రశ్నకి యిద్దరూ తెల్లబోయారు! జానకమ్మగారికంతా అయోమయంగా వున్నట్టనిపించింది.

"నాన్నా!"

"నిజం చెప్పు! ఎవడా దుర్మార్గుడు! ఎవరికి కన్నావీ బిడ్డను. దుర్మార్గురాలా ఎంతకు తెగించావ్! పెళ్లికాకుండానే తల్లివయ్యావా!"

"నాన్నా!" అంతకుమించి అనలేకపోయింది. ఆమె మనస్సు శిల అయిపోయింది. ప్రేమగా పెంచిన తండ్రి యిలా కఠినంగా శిలవేసినట్టు నిలేసి అడుగుతూ వుంటే ఆమె మొద్దుబారిపోయింది.

"హుఁ నాన్న! నీ తల్లినుంచి నీకు రూపం వచ్చిందనుకున్నాను. గుణమూ

వచ్చింది. అదీ అంతే! పుట్టింది భోగంకులంలో అయినా చదువుకున్నది కదా అని తెలియక చేరువయ్యాను. పెళ్ళికాకముందే తల్లి అయింది. నా తొందర పాటుకు ఫలితం అనుకున్నాను. ఏ రహస్యంవుందో ఆ పసిపిల్లని - నిన్ను - నా పాలిటవేసి ఎటో పోయింది - నీవూ అంతే! పెళ్ళి కాకముందే తల్లివయ్యావు. ఎవడు వాడు? ఈ పిల్ల తండ్రి ఎవరు?"

సుజాత మాట్లాళ్లేదు.

"చెప్పు! ఆ దుర్మార్గుడెవరో చెప్పు. వెళ్ళి కాళ్లావేళ్లాపడి, లేదా బెదిరించి, బ్రతిమాలి తెచ్చి ఆ మూడుముళ్లూ వేయిస్తాను!"

పకపక నవ్వింది సుజాత.

"అన్యాయం నాన్నా!"

"అది అన్యాయమా!"

"ఊహూఁ నువ్వూ అందరిలాగా అనటం అన్యాయం అంటున్నాను. ఆ పిల్ల తండ్రి ఎవరో నాకు తెలియదు. అసలేం జరిగిందంటే—"

"ఇక చెప్పకు. నువ్వు మరీ అంత దుస్థితిలో వున్నావనుకోలేదు. కనీసం నీతో కాపురంచేసి, ఆ బిడ్డకి తండ్రి అయిందెవరో కూడా తెలియనంత నీచంగా ప్రవర్తించావంటే చాలు నీ బుద్ధి తెలుస్తోంది. వస్తా!"

"ఏమండీ!" జానకమ్మ గాబరాగా పిలిచింది.

వెళ్లబోతున్నవాడల్లా ఆగి తిరిగిచూశాడు.

"మీ కన్నకూతురిని మీరే మన్నించలేకపోతే ఎలా? అసలు ఆడపుట్టుకే హీనం. ఇలా అవుతాయి మా బ్రతుకులు. కలిసి తప్పుచేసినా ఫలితం మేమే అనుభవించాలి. అమ్మాయి తెలిసో తెలియకో తప్పు చేసింది. దాన్ని మీరు గొప్ప మనసుతో క్షమించాలి! తప్పుచేయటం మానవ సహజం! ఆ తప్పుని క్షమించి జీవితాన్ని చక్కదిద్దటమే దైవత్వం! అదీ మీలాంటి పెద్దలు గ్రహించవలసింది. యువకుల్లాగా ఆవేశపడితే ఎలాగా! బాగా ఆలోచించండి!"

ఒక్క క్షణం జానికమ్మగారివైపు చూసి "అమ్మా! మీకు తెలియదు నా యిబ్బంది. ఈ పిల్ల ఎవరో యింతవరకూ నా భార్యకు తెలియదు. మా బంధువులకి తెలియదు- మా వూళ్ళో తెలియదు. ఈమె తల్లి శమంతకమణిని నేను ప్రేమించిన నేరానికి యీమెని పెంచి యింతదాన్ని చేశాను అయినా ఫలితం బూడిదలో పోసిన పన్నీరు అయింది. ఇదీ తల్లిలాగే చెడిపోయింది!" అని మరోమాటకి తావుయివ్వకుండా వెళ్లిపోయాడు. సుజాతకి ప్రపంచమంతా

అన్యాయంగా వున్నట్టుగా అనిపించింది. ఎక్కడ చూసినా దగా, మోసం పాలన చేస్తున్నట్టుగా అనిపించింది ఆయనకి సంజాయిషీ యిచ్చుకోవక్కర్లేదని పించింది. అందుకే ఆయన్ని ఆపే ప్రయత్నం చేయలేదు.

జానికమ్మగారు నివ్వెరపోయి చూస్తోంది.

"పిన్నీ! నువ్వయినా నన్ను నమ్ము ఏనాటికో యీ మిస్టరీ విడిపోతుంది. అపుడు నా నిర్దోషిత్వం ఋజువవుతుంది కానీ అప్పటికి నేను అందరినీ దూరం చేసుకోవాలి!" అంది బేలగా.

"పిచ్చితల్లీ! కాలమే అన్నిటినీ పరిష్కరిస్తుంది. నువ్వేం దిగులుపడకు!" తల నిమురుతూ అంది ప్రేమగా.

కన్నతల్లి ప్రేమ, వాత్సల్యం, ఆప్యాయత కనిపించాయి ఆ ఓదార్పులో. ఆమె ఒడిలో ఒదిగిపోయింది సుజాత.

## 7

మనస్సంతా జడమయమయిపోయింది. ఎందులోనూ ఉత్సాహం లేదు. ఎందునా యింటరెస్ట్ లేదు నిర్లిప్తంగా ఆఫీసుకి వస్తూ పోతూ వుంది. ఇంట్లో కాలక్షేపమల్లా పాపే!

సుధాకర్ అంటీముట్టకుండా ఆఫీసు వ్యవహారాలకి సంబంధించినంతవరకు ఎంత మాటాడాలో అంతే మాటాడుతున్నాడు.

ఆ ఆత్మీయత, ఆ చిలిపితనం మచ్చుకయినా లేవు. గంభీరంగా వుంటున్నాడు. దానికి తగ్గట్టే మెలుగుతోంది సుజాత కూడా.

అంతలో అతనికి పై ఆఫీసులో ట్రెయినింగ్‌కి వెళ్లేందుకు ఆర్డర్స్ వచ్చాయి. ఆరువారాల ట్రెయినింగ్‌కి వెళ్లిపోయాడతను కాస్త తెరిపిన పడ్డట్టయింది. సుజాతకి మనస్సులో ఏ మూలలో కూడా ఏ మాత్రమయినా ప్రేమ అనేది మిగలకపోయినా ఎందుకో ఆమెకి అతనితో మళ్లీ మామూలుగా మెలగాలంటే ఎబ్బెట్టుగా వుంది. ఓ అపరిచితుడితో బాగా ప్రవర్తించాలంటే వీలవలేదు అందుకే అతని డెప్యుటేషన్ పెద్ద రిలీఫ్ అనిపించింది కొన్నాళ్లలా అతను వెళ్లొస్తే కొంత మార్పు వచ్చినట్టుగా అనిపిస్తుందనుకుంది. ఈ సంవత్సర కాలంలోనూ గడిచిందంతా ఒక కలలాగా అనిపించింది.

సుధాకర్ వెళ్లిపోయిన వారంరోజులకి మరో ఆఫీసుకి డెప్యుటేషన్ మీద వెళ్లిన నాగరాజు తిరిగొచ్చాడు. అతనికి ఆఫీసంతా కొత్తగా అనిపించింది. సుధాకర్ సీటు ఖాళీగా వుండటం అతనికో శుభశకునం అనిపించింది.

ఒంటరిగా. దెబ్బతిన్న లేడిలా వున్న సుజాతని చూడగానే అతని మనస్సు రెపరెపలాడింది. ఇన్ని రోజులూ ఆమెని చూడకుండా గడిపిన కాలం అంతా నిరీక్షణగా అనిపించింది.

"హలో బావున్నారా ?" ఆమె సీటువద్దకి వచ్చి టేబిల్ పై వంగి ప్రశ్నించాడు.

"ఫైన్ ! మీరెలా వున్నారు ? అక్కడ ఎలా వుండింది ?" నవ్వుతూ ప్రశ్నించింది.

"బోర్ ! యమబోర్ ! ఎంత వర్క్ పెండింగ్ వుండిందని ! వాడెవడో సెలవు పెట్టి వెళ్ళాడుగా ! అంతకు ముందు రెండుమూడు నెలలు పనిచేసినట్టే లేడు. అదంతా నా నెత్తిన రుద్దేడు ఆఫీసరు. అయినా అంతా అర్జంటు ఫైల్స్ పెండింగ్ లో ఎలా వుంచాడో !"

నవ్వేసింది సుజాత.

"మీకేం యిక్కడ హాయిగా వున్నారు. నవ్వుతున్నారు. అక్కడ నే చేసి వచ్చిన వెట్టిచాకిరీ చూస్తే తెలిసొచ్చేది మీకు !"

"వెట్టిచాకిరీ ఎందుకవుతుంది లెండి. ఎక్స్ట్రా జీతం డ్రాచేశారుగా !"

"డబ్బొకక్కటేనా మీరు లెక్కించేది ? అదే నిజమయితే చెప్పండి. మీకు బ్రాకెట్ లో రోజూ వేయిా, రెండు వేలు సంపాదించి పెడతాను !"

నోరు వెళ్ళబెట్టింది సుజాత !

"యస్ ! ఒక వేయి మీవి కాదనుకుని యిలా పారవేయండి. నెల తిరిగే సరికల్లా పదివేలు యిచ్చేస్తాను. అలా నెలనెలా తీసుకుంటూ వుండండి. చూస్తూ వుండగానే లక్షాధికారి అయిపోతారు !"

"నాకంత ఆశలేదు బాబూ ! నన్నొదిలేయండి! ఆ లక్షలు మీరే సంపాదించుకోండి. జూదం వ్యసనం నాకు లేదు !"

"దట్సాల్ ! వదిలెయ్యండి ! మిమ్మల్ని ఫోర్స్ చేయను. అన్నట్టు మీ బేబీ ఎలా వుంది ?"

సుజాత ముఖంలో రంగులు మారేయి. అయినా క్షణంలో నిగ్రహించుకుని "ఫైన్ !" అంది.

"ఏం పేరు పెట్టారు ?"

"మల్లీశ్వరి !"

"గుడ్ ! కృష్ణశాస్త్రిగారి భక్తులన్నమాట ! మరి యీ మేఘమాలకి ఏ నాగరాజు రావాలో !" కొంటెగా చూస్తూ అన్నాడు. అతని కళ్ళల్లో చిలిపిదనం వెక్కిరించినట్టు కనిపించింది.



"యు ఆర్ హియర్ !" అంది.

అంతలో శాస్త్రి ఆఫీసరుగారు ఫైలు తెమ్మంటున్నారని రావడంతో నాగరాజు తన సెక్షన్‌కి వెళ్ళిపోయాడు.

అయితే ఆ సాయంకాలం ఆఫీసు వదలగానే సుజాత వెంటబడ్డాడు. "నేనూ ఆ యింటికి వస్తున్నాను పదండి ! బస్సులో ఎందుకు ఆటోలో వెళదాం !" అన్నాడు.

"నా పర్స్‌లో ఈనాటి ఖర్చుగా బస్‌టికెట్‌కి యాభయ్ పైసలున్నాయి అంతే !" అంది నవ్వుతూ సుజాత.

"డబ్బుకి ఆలోచిస్తున్నారా ! నే పేచేస్తాను లెండి !"

"వద్దులెండి ! నేను అలా యితర్ల డబ్బు ఖర్చుచేయను !"

తెల్లబోయాడు నాగరాజు

"అదిగో బస్ వచ్చేసింది!" అంది సుజాత. ఓ నిమిషం తర్వాత అతనూ ఆమె వెంటే బస్సు ఎక్కేడు. బస్‌స్టాపులో దిగాక ఆమె వెంటే నడుస్తూవచ్చాడు.

"మీరు రిఫ్రెష్ కాండి! నేను మా అక్కయ్యని పలుకరించి వస్తాను!" అంటూ జానకమ్మగారి యింటివైపు కదిలేడు.

"సరే!" అనుకుంది సుజాత.

* * *

ఓ రోజు సాయంకాలం అయిదు గంటలవేళ రాజు ఓ కొత్త వ్యక్తితో మాటాడుతున్నాడు పార్కు కాంపౌండ్ వద్ద.

"అంతా మనం అనుకున్నట్టుగానే జరిగింది!"

తలూపేడతను.

"మన రెండు ఉత్తరాలూ బ్రహ్మాండంగా పనిచేశాయి!"

"కానీ చాలా దారుణం!"

"కార్యసాధనలో అలాంటివి తప్పవు కదా!"

"అయినా సుజాత అసహ్యించుకుంటుంది ఈ విషయం తెలిస్తే!"

"నిజమే! అయితే ఫలితం తెలుసుకున్నాక సంతోషిస్తుంది!"

"అవును!"

"మనం యిక కార్యరంగంలో దూకాలి!"

"అలాగే!"

"స్పీడప్ చేద్దాం! ఇప్పుడు యిటునుంచి నరుక్కొచ్చాం! ఇక అటునుంచి నరుక్కు రావాలి! అప్పుడే సుజాతకి ఓ మానసిక తృప్తి! శాంతి! ఆమె జీవితం పాడవకూడదు!"

నవ్వేడు నాగరాజు మాటలకి. "నీలో దయాగుణం వుందంటే ఎవరు నమ్ముతారు. పాము కాటేస్తుంది తప్ప కాచి రక్షిస్తుందని ఎవరయినా అనుకుంటారా?"

"యస్! నా పేరూ పాము అనే అర్థాన్నిస్తుంది కదూ!" నవ్వుతూ అన్నాడు నాగరాజు.

"రేపు జానికమ్మగారిని కలుస్తాను!"

"ఊఁ సుజాత ఆఫీసుకి వచ్చాక వెళ్లు! అసలే జానికమ్మగారిది జాలిగుండె! పైగా దెబ్బతిని వుంది. ఈ విషయం నెమ్మది నెమ్మదిగా చెప్పు. పాకయి, బర్స్టయితే చాలా కష్టం. నలుగురూ జతవుతారు. నాలుగు అంటారు! మనం యింతగా అల్లుకుంటూ వస్తోన్న ప్లాను సగంలో దెబ్బతింటుంది."

"అలా జరగదులే! కథ యింటర్వల్‌లోకి వచ్చేసింది. మెల్లిమెల్లిగా క్లయిమాక్స్‌కి ఎక్కిస్తాను!"

"దట్స్ గుడ్! బై!"

"బై! బై!"

ఆ వ్యక్తి వెళ్ళిపోయేదాకా వుండి నాగరాజు జానికమ్మగారి యింటికి మరలేడు.

అతను రాగానే మామూలుగా సవిత, "అమ్మా! గడ్డపెరుగు మామ య్యొచ్చాడు!" అంది నవ్వుతూ.

నవ్వేడు నాగరాజు. "నమస్కారం బావగారూ!" అన్నాడు రాఘవయ్య గారిని చూస్తూ.

"రావోయ్ రా! స్వంత బొమ్మర్దులు దూరమైనా వేలువిడిచిన బావమరిదివి నువ్వే మేలు! వారానికోసారయినా బావా అంటూ వస్తున్నావు!"

జానికమ్మగారు ఫీల్డులోకి వచ్చింది రయ్యిమంటూ "సొంత బొమ్మర్దులు ఏం చేశారు మీకు? పెట్టి పూజించటానికి వాళ్ళకేలేదు – దగ్గర్లో వుంటే ఏం కంచుక వస్తుందోనని మీరే యింత దూరం వచ్చేశారు!"

"పెట్టుపోతలు ఎవరడిగేరు? పలకరింపూ, ప్రేమా లేదంటున్నాను. అంతే!"

"మనమెంతో అవతలివాళ్ళు అంత!"

"నేను మాటాడనా వాళ్లొస్తే! ఏదీ వాళ్ళొచ్చిందెప్పుడు?"

"మనం పిలిస్తేనా?"

"బావుందే యిది! ఇంటల్లుడిని నన్ను వాళ్ళు పిలవాలా? వాళ్ళని నేను పిలవాలా?" నవ్వుతోన్నారాయన.

"మామగారుంటే అవన్నీ! చిన్నపిల్లలు వాళ్ళు. మీరే పిలిచి వాళ్ళ బాగోగులు చూడాలి!"

"సరె! సరె!"

"అక్కయ్యా! అదంతా సరేగానీ నాకు అకలేస్తోంది. వంట ఏం చేశావు?" అన్నాడు నాగరాజు.

"గడ్డపెరుగు – ఆవకాయ!" అంది సవిత.

"ఏయ్!" చెయ్యెత్తేడు రాజు.

పరిగెత్తింది సవిత.

"పద రాజూ!" లేచారు రాఘవయ్యగారు.

భోజనాలు పూర్తయ్యాయి. రాఘవయ్యగారు బయట కూర్చున్నారు జానకమ్మ భోజనానికి కూర్చుంటే, పక్కన్నే పీటవేసుకుని కూర్చున్నాడు రాజు.

"ఒరేయ్ రాజూ! నువ్వొచ్చినపుడల్లా నాకు బాబాయిని చూసినట్టే వుంటుందిరా!"

అతని కళ్లు చెమ్మగిల్లాయ్.

"పిన్నిని ఓసారి తీసుకరారా!"

"అమ్మ రాదు అక్కయ్యా!"

"అవునురా ఆమెకి మొదటినుంచీ మాపై కోపమే!

"పోన్లే అక్కయ్యా! నేనో విషయం అడగాలని వచ్చాను!" అన్నాడు సీరియస్గా

"ఏమిట్రా?"

"నేను సుజాతని చేసుకుంటే ఎలా వుంటుంది?" హఠాత్తుగా అడిగాడు.

నివ్వెరపోయి చూస్తున్నట్టుగా వుంది జానకమ్మగారు. కొన్ని క్షణాలాగి "ఒరేయ్! నీకు ఎన్నాళ్ళకి మంచి బుద్ధిపుట్టిందిరా! మంచి మాట అన్నావు. తప్పకుండా చేసుకో!" అంది.

"ఆవిడ ఏమంటుందో!"

"ఎగిరి గంతేసినట్టుగా ఒప్పుకుంటుంది!" అని మెల్లిగా, "ఒరేయ్! ఆ పిల్ల యింతకు ముందే కన్నతల్లి అయింది. అదిగో అక్కడ పడుకున్న మల్లి ఆవిడ బిడ్డ!" అంది.

నాగరాజు మాటాల్లేదు.

"ఒరేయ్! వాడెవరో త్రాష్టుడురా! నమ్మించి మోసంచేసి వుంటాడు. కడుపయ్యాక చెప్పకుండా పారిపోయి వుంటాడు. పురాణాలకాలం నుంచీ మా ఆడవాళ్ళ గతి యింతేరా రాజూ! మేం మాతృత్వానికిచ్చిన విలువ మగవాళ్ళకి యివ్వం!"

"అవునక్కయ్యా!"

"ఇపుడు నువ్వే చెప్పు. ఆ అమ్మాయి ఏం చేయాలి? వాడు వెధవై వెళ్లిపోతే, బుద్ధిలేనిదానిలాగా కడుపు తీయించుకోవాలా? పిల్ల పుట్టేక గొంతు నులిమెయ్యాలా? ఆ పసిగుడ్డుని అనాథాశ్రమం పాలుచేయాలా?"

నాగరాజు వింటున్నాడు మౌనంగా. అతని మనస్సులో ఆలోచనలు సుళ్లు తిరుగుతున్నాయి.

"ఇప్పుడు ఆ పిల్లకి పెళ్లికావాలి! ఎవరు చేసుకుంటారు గత చరిత్ర

తెలిస్తే. ఇంకా కొన్నేళ్లు పోవాలిరా! అంతటి మహానుభావుడు పుట్టి రావటానికి. ఇప్పుడు నువ్వు ఆ పిల్లని పెళ్ళి చేసుకుంటానంటే నా కెంత ఆనందంగా వుందో తెలుసా?"

"నేనూ నీలాగే ఆలోచించా నక్కయ్యా!"

"అందుకే నువ్వంటే నా కంత యిష్టం రాజూ!"

"అక్కయ్యా! ఈ విషయం నువ్వే కదల్చాలి!"

"అలాగే రాజూ! ఇంకొన్నాళ్లు ఆగు! ఆ అమ్మాయి యీ మధ్య ఉత్సాహంగా లేదు ఎందుకో. సమయం చూసి చెబుతాను!"

"నీ యిష్టం! ఈ కార్యభారమంతా నీది!"

ఆ మాటలకి ఆమె ముఖం విప్పారింది. "ఒరే రాజూ! ఈ సమయంలో నీకో మాట చెప్పాలని వుందిరా! కవితని నేను కల్యాణ్‌కిచ్చి చేయాలనుకున్నాను. వాడు దేశాలు పట్టిపోయాడు. కవిత గతి అలా అయిపోయింది. అందుకే సవితనయినా నీ కిచ్చుకోవాలని వుండేది. కానీ యిప్పుడీ సంబంధం చెడిపోయిందని దిగులు లేదురా రాజూ! ఎందుకంటే నువ్వు మంచి నిర్ణయం తీసుకున్నావు!"

రాజు నవ్వేసి "వెళతానక్కయ్యా!" అంటూ వెళ్ళిపోయాడు

## 8

జానికమ్మగారు భర్తని ఆఫీసుకి పంపి, పిల్లల్ని బళ్ళకి పంపేసి, మల్లీశ్వరిని నిద్రపుచ్చి చాపపై నడుంవాల్చింది.

ఆ వారం పత్రిక తిరగేస్తూ కూర్చుంది. కొద్దిసేపయ్యాక కళ్లు అలసిపోయినట్లయి పత్రిక పక్కకి పెట్టేసి కళ్లు మూసుకుంది.

"అత్తయ్యా!"

మాగన్నుగా నిద్రపోతున్న జానికమ్మగారు ఆ పిలుపు వినిపించుకోలేదు.

"అత్తయ్యా!"

చప్పున కళ్లు తెరిచిందామె. వరండాలో పడుతున్న ఎండ పొడకి కొద్దిగా కళ్లు మసకలుగా కనిపించాయి. "ఎవరూ!" అంది ఆ వ్యక్తిని గుర్తించలేక.

అతను ఆ చాపమీదే కూర్చున్నాడు. మెల్లగా "నేనత్తయ్యా! కల్యాణ్‌ని" అన్నాడు.

ఆ మూడక్షరాలూ ఆమెపై మంత్రంలా పనిచేశాయి. కళ్లు రెపరెపలాడించి

"ఎవరూ? కల్యాణా?" అంది నమ్మలేనట్టుగా. మరోమారు పరిశీలనగా చూసింది. పదేళ్ళ క్రిందట పదిహేనేళ్ళ వయస్సులో దేశాలుపట్టిపోయాడు అతను. ఆమె ఆడబిడ్డ సౌందర్య కొడుకు కళ్యాణ్! ఆ రూపరేఖలు కొద్దిగా విస్తృతా లయినా అసలు పోలికలు అలానే గుర్తుగా లీలగా కనిపిస్తోన్నాయి. ముఖ్యంగా ఆ ముక్కు, ఆ కళ్ళు, ఆ గొంతుపై మచ్చ! వీడు కల్యాణే! "కల్యాణ్!" అంది సంబరంగా. ఆమెకి అన్నేళ్ళ తర్వాత అతడిని చూడటం ఎంతో ఆనందంగా వుంది

"నేను ముందుగా నర్సాపురం వెళ్ళేనత్తయ్యా! మీరు ఎవరూ అక్కడ లేరు. మామయ్యకి ట్రాన్స్‌ఫర్ అయిందని తెలిసింది. విచారిస్తే ఇక్కడికి వచ్చారని తెలిసింది ఆఖరికి. మీరు ట్రాన్స్‌ఫర్ మీద ఎన్నెన్ని వూళ్ళు తిరిగారో అన్నీ తిరిగొచ్చాను.

"నాకు మీరు ఆస్తంతా అమ్మేసి ఇక్కడ ఇళ్ళుకట్టుకుంటున్నారని తెలిసింది. ముందస్తుగా ఆఫీసుకి వెళ్ళిపోదామనుకున్నాను. అయినా మామయ్య గుర్తుపడ తారో లేదో ననుకుంటూ, ఆఫీసుకి వెళ్ళి యీ యింటి అడ్రసు సంపాదించి వచ్చాను!"

"అవును కళ్యాణ్! ఆ సంఘటన జరిగేక మేం మళ్ళీ వూరెళ్ళి అందరికీ ముఖం చూపించలేకపోయాము – ఆస్తంతా మా పినమరిదికి అమ్మేసి వచ్చాం!" ఆ సంఘటన గుర్తుకి రాగానే ఆమె ముఖం అదోలా అయింది.

"ఏం జరిగిందత్తయ్యా?"

అతని ప్రశ్నకి వెంటనే సమాధానం యివ్వలేదామె. ఏదో ఆలోచిస్తూ వుండి పోయింది.

కల్యాణ్ మళ్ళీ రెట్టించలేదు. అత్తగారి ముఖాన్నే బాగా స్టడీచేస్తూ వుండి పోయాడు.

"పద నువ్వు భోజనం చేద్దువుగానీ? ఎప్పుడనగా తిన్నావో ఏమో! నా మతి కూల! ఊరకే కబుర్లు చెబుతూ కూర్చున్నాను!" అంది లేవబోతూ.

"నువ్వేం శ్రమపడకత్తయ్యా యిపుడు. నేను పదకొండింటికే భోజనం చేసి వచ్చాను!" అన్నాడు.

నమ్మలేనట్టుగా చూసిందామె.

"ఒట్టు అత్తయ్యా! నీ దగ్గర అబద్ధం ఆడతానా! భోజనం ముగించుకుని వచ్చాను!"

"సరే! కాస్త డ్రింక్ అయినా కలిపిస్తాను" అని లేచివెళ్లి పళ్లరసం కలుపుకుని వచ్చింది. అతనికో గ్లాసు యిచ్చి తనో గ్లాసు అందుకుని తాగేసింది.

"ఊఁ అంతా ఆఫీసులకి వెళ్లిపోయారా ?"

"మీ మామయ్య ఆఫీసు కెళ్లేడు. సవిత కాలేజీకి వెళ్లింది. చంద్రమణి హైస్కూలుకు వెళ్లింది.

"మరి కవిత ___"

అతని మాటలు వినగానే ఆమె ముఖంలో విషాదచ్ఛాయలు తాండవమాడేయి. అంతవరకూ కళకళలాడుతోన్న ముఖం పాలిపోయింది. కళ్లల్లో నీటిపొరలు ఏర్పడ్డాయి. దిగులుగా చూసింది.

"మేం యీ వూరికి ట్రాన్స్‌ఫర్ కాకముందు కవిత గుంటూర్లో బి.ఎ. చదువుతూ వుంది. దాన్ని గ్రాడ్యుయేట్‌ని చెయ్యాలనీ, నీ కిచ్చి పెళ్లిచేయాలనీ మొదటి నుంచీ అనుకున్నదే! నువ్వేమో చెప్పాపెట్టకుండా దేశాలు పట్టుక పోయావు. అయితేనేం మీ మామయ్యకీ నాకూ నీ మీద సంపూర్ణ విశ్వాసం. నువ్వు ఏనాటికయినా ప్రయోజకుడివై, మంచి ఉద్యోగం సంపాదించుకుని నలుగురిలో దర్జాగా తిరగగల హోదాతో వస్తావని అనుకుంటూ వున్నాను.

"ఈ రోజుల్లో ఆస్తులు శాశ్వతం కాదు. ఐశ్వర్యం అసలే శాశ్వతం కాదు. ఒక్క చదువూ, దానివల్ల సంపాదించుకొగలిగితే మంచి ఉద్యోగం యివి మాత్రమే మనకి భద్రత. అందుకే కవితని గ్రాడ్యుయేట్‌ని చేసి ఎక్కడయినా ఉద్యోగంలో యిరికించాలని అనుకున్నాం. మేము అప్పుడు పనిచేసే వూళ్ళో కాలేజీ లేదు. అందుకే అంత దూరమైనా మీ మామగారికి తెలిసినవాళ్లున్నారని వాళ్లింట్లో విడిచి గుంటూరులో బి.ఎస్సీలో చేర్పించాము!"

కొద్దిసేపు ఆగిందామె. కూతురి జ్ఞాపకాలు గుండెకోత కోస్తున్నాయి. దాంతో గతస్మృతుల తాలూకు బాధాచిహ్నాలు మనస్సుని వేధించాయి.

కల్యాణ్ ఆతురతతో వింటున్నాడు.

"అక్కడే మేం పొరపాటుపడ్డాంరా కల్యాణ్! దాని భవిష్యత్తుని ఊహించి అక్కడ చేర్పించామే కానీ తలిదండ్రులకి దూరంగా పెరిగే ఆడపిల్లలకి భద్రత తక్కువనీ, యితరుల యిళ్లల్లో వదిలేస్తే వాళ్ల పూచీ పూర్తిగా వుండదనీ తెలుసుకోలేకపోయామురా.

"అందమైన అమ్మాయిల చుట్టూ మగపిల్లలు తిరగటం ఎప్పుడూ వుండేదే! ప్రేమనీ, అనురాగమనీ కల్లిబొల్లి కబుర్లు చెప్పటమూ సహజమే! దానికి అమ్మాయిలు ప్రలోభపడటమూ మామూలేరా.

"అందరిలాగే కవితా ఒకబ్బాయి వ్యామోహంలో పడింది. ముందుగా ఆ అబ్బాయే తన వ్యామోహంలోపడి తన చుట్టూ తిరుగుతున్నాడని ఊహించిందే తప్ప, తనే ఆ అబ్బాయి వలలో పడిపోయానని అనుకున్నది కాదు. అది గ్రహించేసరికి జరుగవలసింది జరిగిపోయింది.

"ఆ అబ్బాయి ఎవరో మా కింతవరకూ తెలియదు. కవితని ప్రశ్నించే అవకాశమూ మాకు దక్కలేదు. అతనితో తిరుగుతోందని తెలిసి చౌదరిగారు కానీ, ఆయన భార్యకానీ, ఆఖరికి వాళ్ళమ్మాయి, మన కవిత క్లాస్‌మేట్, విరజ కానీ ఒక్కమాటయినా మనతో అనివుంటే కథ యింతదాకా వచ్చేది కాదు.

"అతను మన కవిత వాళ్ళమ్మాయి అనుకునే తిరిగేడంటారు కొందరు. అంత ధనవంతుల అమ్మాయి కాదని, మామూలు మధ్యతరగతి కుటుంబీకుల పిల్లనీ తెలిసిన క్షణంనుంచీ అతను కవితతో మాటలు తగ్గించేడట. ఏం చదువుతూ వుండేవాడో ఎవరికీ తెలియదు. అతనెక్కడికో వెళ్ళిపోయాడట!

"అప్పటికే కవితకి నెల తప్పిందన్నారు. ఇదీ ఆ భగవంతుడికే తెలియాలి. ఒకరోజు కవిత చీర, రవిక, వాచీ విజయవాడలో కృష్ణఒడ్డున కనిపించాయన్నారు. దాంతో అది చచ్చిపోయిందనే నిర్ధారణ చేసుకుని, నిరాశ చేసుకున్నాం! దిగులుతో, అవమానంతో బ్రతుకుతున్నాం!"

చాతురి కథ పూర్తిచేసేసరికి ఆమె కంటినీరు తిరిగింది.

కల్యాణ్ కూడా చాలా బాధపడ్డాడు.

ఇద్దరి మధ్యా నిశ్శబ్దం సమరం చేసింది.

"నువ్విన్నాళ్ళూ ఎక్కడున్నావ్ కల్యాణ్ ?"

దానికి అతడు నవ్వేశాడు. "నేను బి.ఇ. చదువుతానంటే నాన్న తనతో కాదన్నాడు. టీచర్ ట్రైనింగ్‌కి వెళ్ళమన్నాడు. మునిసిపల్ ఎలిమెంటరీ స్కూల్ టీచరుగా బ్రతకటం యిష్టంలేకపోయింది. అందుకే పారిపోయాను!"

"ఎక్కడికి వెళ్లేవు ?"

"చెడి చెన్నపట్నం చేరమన్నట్టుగా నేను నేరుగా మద్రాసు వెళ్లేను. నా అదృష్టం బావుందత్తయ్యా. నాతోపాటు ఓ తెలుగాయన మద్రాసు వచ్చాడు. ఆయనకి సినీఫీల్డుతో పరిచయం వుంది. ఫైనాన్షియర్ అన్నమాట.

"నన్ను మాటల్లో పెట్టేసి నా కథంతా విన్నాడు. మద్రాసులో దిగగానే తనింటికి తీసికెళ్ళి సిటీ అంతా చూపించేడు. స్టూడియోలు అన్నీ తిప్పేడు. రికార్డింగ్, షూటింగ్ అన్నీ చూసేను. పిక్చర్ ఫీల్డులోకి వెళతావా అని అడిగేడు. ఊహూ చదువుకుంటానన్నాను. బి.ఇ. చదువుతానన్నాను."

"చాలా రోజులు నన్ను పరీక్షించేడు. వీలయితే ఊరికి పంపించెయ్యాలని నా అడ్రసూ, నాన్నగారి అడ్రసూ నోట్ చేసుకున్నాడు. ఆఖరికి చదువుమీది నా వ్యామోహం అర్థమై నాకు చదువుకునే అవకాశం కల్పించాడు. ఎంతో శ్రమ పడి అక్కడే ఇంజనీరింగ్‌లో సీటు యిప్పించాడు.

"తర్వాత అయినా మీకు ఉత్తరాలు రాయమని చెప్పాడు. నేను ససేమిరా అన్నాను. ఇంజనీరునై, ఉద్యోగం సంపాదించుకునేదాకా మా యింటిముఖం చూడనన్నాను. ఇంట్లో కష్టాలు, బాధలు, యిబ్బందులు చెప్పేను. ఆయన విని సరే అన్నాడు.

"నా చదువు పూర్తయినా, ఉద్యోగం దొరికేసరికి ఇన్నేళ్లు పట్టింది. ఇప్పుడిక ఇక్కడే వుంటున్నాను. నిన్ననే యీ వూళ్లో ట్రాన్స్‌ఫర్ మీద జాయినయ్యాను. అదృష్టం అలా కలిసొచ్చింది."

కల్యాణ్ విషయం వినగానే అవిడకి ఎంతో సంతోషమయింది. "ఊరెళ్లి వచ్చావా?" అంది.

"ఆఁ, వెళ్లి అందర్నీ చూసొచ్చాను."

"పోనీలే బాబూ! మీ నాన్నకి యీ వయస్సులో తోడ్పడేందుకే భగవంతుడు నిన్నింతటివాడిని చేశాడు."

"భగవంతుడు ఎప్పటికీ గొప్పవాడే అత్తయ్యా! ఆయన తలుచుకుంటే ఏమైనా చేయగలడు! ఆఖరికి చనిపోయిందనుకున్న కవితని కూడా బ్రతికించి తేగలడు."

ఆశగా చూసిందామె! కవిత పేరు చెపితే చాలు నాగస్వరం విన్న నాగు బాములా అవుతుందామె, "కల్యాణ్! కవిత విషయమేమైనా విన్నావట్రా?" అంది ఆశగా.

"ఎక్కడ అత్తయ్యా! చనిపోయిందన్నావుగా!"

"లేదురా బాబూ! వాళ్లంతా అన్నా నాకేమో కవిత బ్రతికే ఉంటుందని నమ్మకం వుంది. దానిది అంత పిరికిగుండె కాదురా బాబూ!"

ఒకవేళ బ్రతికినా ఎక్కడుందో! మనం కనుక్కోగలమా? కనుక్కున్నా వెళ్లి తీసుకునివచ్చి యింట్లో పెట్టుకోగలమా? పాడు లోకులు కాకుల్లా అనే మాటలు విని మనం వూరుకోలేం కదా! కన్నబిడ్డనైనా, కట్టుకున్న భార్యనైనా లోకంకోసం వదిలేసే దేశం కదా మనది!"

అతని మాటల్లో ఏదో వ్యంగ్యం! ఏదో ఆశ! ఏదో దారి కనిపించినట్టయింది

ఆమెకి. "కల్యాణ్! నా కూతురు ఎక్కడుందో వెతికిపెట్టు నాయనా! నీకు పుణ్యం వుంటుంది. నా బిడ్డ కనిపిస్తే చాలు నాకు. లోకాన్ని లెక్కచేయను!" అంది ఆవేశంగా.

"ఉన్న ఊరొదిలి ఆస్తి అమ్ముకుని యింత దూరం వచ్చేశారు మీరు! ఆ విషయంలోనే కదా! ఇప్పుడిక —"

"అప్పటి మాట వేరు. ఇప్పటి మాట వేరు నాయనా! మనుషులం మారుతూ వుంటాం కదా!"

"సరే అత్తయ్యా! ఉద్యోగరీత్యా నేను తిరుగుతూ వుంటాను కదా! ఎక్కడయినా తటస్థపడితే వెంటేసుకుని తీసుకుని వస్తాను!" అన్నాడు.

ఆమాత్రం హామీకే ఆమెకి అందలం ఎక్కినట్టుగా అయింది. మరి కొద్దిసేపు ఆ కబురూ ఈ కబురూ అయ్యాక అతను "వస్తానత్తయ్యా" అంటూ లేచాడు.

"ఎక్కడికి? సాయంకాలానికి మీ మామయ్య వస్తారు. అంతా వస్తారు. నువ్వికి ఇక్కడే వుండిపో!" అంది ప్రేమగా.

"లేదత్తయ్యా! నేను ఎక్కువగా క్యాంపులు వెళుతూ వుండాలి. ఈరోజు మూడింటికి మద్రాసు వెళుతున్నాను. తిరిగొచ్చాక వస్తాను!" అంటూ లేచాడు.

"సరే బాబూ నీ యిష్టం! ఇంతకంటే బలవంతం చేయగలమా?" అందామె.

కల్యాణ్ వెళ్ళిపోయాడు.

## 9

తర్వాత నాలుగైదు రోజులు గడిచిపోయాయి. జానికమ్మగారికి కొంత సంతోషంగానే ఉంది. కవిత చహరా తెలిసీతెలియనట్టుగా వుంది. సుజాత సమస్య కూడా కొంత తెరిపినపడ్డట్టయింది. దేవుడు దయతలిస్తే సుజాత పెళ్ళై పోతుంది. రాజు ఆ అమ్మాయి అంటే బాగా యిష్టపడుతున్నాడు. తన సంగతి తెలిసినా వాడు ఒప్పుకోవటం చాలా గొప్పగా వుంది ఆమెకి.

కానీ ఆమె సందేహమల్లా సుజాతని గురించే. ఆ పిల్ల ఒప్పుకుంటుందా అనే అనుమానం యింకా వదల్లేదు. సుజాతకి ఎంతటి స్వాభిమానం, స్వాతిశయం, పట్టుదల వున్నాయో ఆమెకి బాగా తెలుసు. ఏమాత్రం అవమానం జరిగినా సహించుకోలేదు. కన్నతండ్రినే క్షణాలపై దూరంచేసుకోగలదు. అంతటి అభిమానవతి ఆమె.

ఆరోజు నాగరాజు తల్లిగారు చంద్రసేనమ్మగారు వచ్చారు జానికమ్మగారి




ఇంటికి. ఆవిడ భర్త నాగరాజు చిన్నతనంలోనే సన్యసించి హిమాలయాలకి వెళ్లిపోయాడు. ఆవిడకి నాగరాజు ఒక్కడే కొడుకు. ఆయన చాలా మంచి వాడనీ, ఆవిడే పరమగయ్యాళి అనీ, అందుకే ఆయన సన్నాసుల్లో కలిసిపోయారనీ లోకులు అనుకుంటారు.

'కానీ గిట్టనివాళ్లే అలా అనుకోవాలి! మా కోడలు బంగారప్పిల్ల. వాడొట్టి వెధవ సన్నాసి. పిరికిసన్యాసి - అప్పులు చేసి తీర్చలేక దేశాలట్టుకపోయాడు. తోలెడంత ఆస్తి తగిలేశాడు. చేతకానమ్మ బోర్లపోసుకుందని వెధవై వాడు పోతే మా కోడలిని అంటే న్యాయమేముంది!' అంటుంది స్వయానా నాగరాజు నాయనమ్మ, చంద్రసేన అత్తగారూ అయిన సుభద్రమ్మగారు.

ఆవిడింకా బ్రతికే వుంది. ఎనభయ్ సంవత్సరాల వయసులో కూడా ఆవిడకి కనుచూపు తగ్గలేదు. పళ్లు ఊడిపోలేదు. నడుము వంగలేదు. నడిచే దార్ఢ్యం తగ్గలేదు. ఇప్పటికీ వంట ఆవిడే చేస్తుంది. మనవడంటే ఆవిడకి ఆరో ప్రాణం. నాగరాజుకీ నాయనమ్మ అంటేనే గురి.

భర్త సన్నాసుల్లో కలిశాడు. ఉన్నాడో పోయాడో తెలియదు. అంచేత చంద్రసేనమ్మ నిత్యసువాసిని.

ఆవిడ సుజాతని చూసుకునేందుకి వచ్చింది. వెంట నాగరాజు వస్తానంటే వద్దంది.

"రా! పిన్నీ!" అంటూ ఆహ్వానించింది ఆప్యాయంగా. జానకమ్మ ప్రేమతో కూడిన పిలుపుకి ఆమె ఉప్పొంగిపోయింది.

కాఫీ కలిపి తెచ్చిస్తే తాగేసి "జానకీ! నీచేతి కాఫీ రుచి యింకా తగ్గిపోలేదే! కాఫీ గింజల్లో యీతపిచ్చలు కలిపేస్తోన్నా నీ యింటి కాఫీ రుచిగా వుందంటే అది నీ పాడి చలవ! ఇదో ఈ కాఫీకోసం రోజూ వచ్చిపోదామనే వుంటుంది. కానీ ఆ చివర్నించి యీ చివరిదాకా వచ్చిపోవాలంటే ప్రాణం కడగట్టుతుంది!"

"పోనీ రోజూ రాలేకపోతే వారానికోసారయినా రారాదా అమ్మమ్మా!" అంది సవిత.

"ఎక్కడొస్తానే తల్లీ! గుర్రాల్లా వున్నారు. మీరు రానే రారు!" అందామె.

"మాకంటే కాలేజీ-చదువు-బోలెడంత పని!"

"అవునవును సినిమాలూ చట్టుబండలూ-వెధవ పత్రికలు చదవడాలూ —"

"నీకు యింటిపనేం వుంది అమ్మమ్మా! తాతమ్మ చేస్తుందిగా వంట! నీకు లేస్తే కీళ్లనొప్పులు - కూచుంటే కాళ్ల నొప్పులు. నువ్వేం చేస్తావు. వంటకి పేరు పెడుతూ, గంటకోసారి కాఫీ తాగుతూ —"

"సవితా!" గద్దించింది జానకమ్మ.

"పోన్లే! చిన్నపిల్ల - అదనకపోతే యింకెవరంటారు. దీన్ని నా కోడలుగా చేసుకుందామనుకుంటే —"

"నీ కోడలినా! గోవిందో! గోవింద! ఏ కోడరికం వద్దు అమ్మమ్మా! హాయిగా నన్నిలా అమ్మమ్మ మనవరాలిగానే వుండనీ - నీకు గేదెపాల చిక్కని కాఫీ, మామయ్యకి గడ్డపెరుగు - అవకాయ అన్నం నే నెక్కడ తెచ్చేది? కట్నంలోనో, అడపడుచు లాంఛనంగానో గేదెని అడిగేస్తారు మీరు!"

ఫక్కున నవ్వేసింది ఆమె - మనవరాలి మాటలు ముద్దుగా అనిపించాయి. "ఈ మాటలు వినే యోగం పోయిందే సవితా! మీ మామయ్య - ఇక్కడ వుండటగా - ఆ సుజాతని చూసి యిష్టపడ్డాడు. మీ అమ్మ ఛీపో అనకుండా నరే అందిట. నన్ను వెళ్లి చూసిరమ్మంటే వచ్చాను. ఆ దేవుడి దయవల్ల వాడి నెత్తిన నాలుగక్షింతలు పడితే —"

ఆమె మాటలు పూర్తికాకముందే "పెళ్లిచూపులకి వచ్చావా అమ్మమ్మా! పద! పద! నేనూ వస్తా" అంది సవిత.

"సవితా!" గద్దించింది జానకమ్మగారు.

"ఏమమ్మా!"

"ఇలాటి పెద్ద పెద్ద విషయాల్లో మీరు జోక్యం చేసుకోకూడదు. నేనూ,

అమ్మమ్మా వెళ్లొస్తాం. నువ్వు జాగ్రత్త! ఇంకా సేపటిలో మీ నాన్నగారొస్తారు కాఫీ కలిపి యివ్వు!" అంది.

సవిత ముఖం ముడుచుకుంది.

ఇద్దరూ కలిసి వెళ్లేసరికి సుజాత మల్లీశ్వరికి పాలు పడుతూ కూర్చునుంది.

"రండి! రండి!" అంటూ ఆహ్వానించింది చిరునవ్వుతో.

"ఈమె మా పిన్నిగారు! అంటే నాగరాజు తల్లిగారు!"

"ఎవరూ? మా ఆఫీసులో సెక్షన్ ఆఫీసరు నాగరాజుగారా?"

"అవునమ్మాయ్!" అంది చంద్రసేనమ్మగారు. ఆవిడకి సుజాతని చూడగానే కడుపునిండిపోయినట్టుగా వుంది.

బంగారపు బొమ్మలా వుందనుకుంది. కొడుకు సెలక్షన్ బ్రహ్మాండం అనుకుంది.

సుజాత మల్లీశ్వరికి పాలుపట్టడం పూర్తికాగానే జానికమ్మగారు ఎత్తుకున్నారు. ఆవిడని చూడగానే కేరింతలు కొట్టిందా పిల్ల.

"మీ అమ్మగారు ఎక్కడమ్మా?"

"లేరండీ! నా చిన్నతనంలోనే పోయారు!" అంది సుజాత. ఆమె గొంతు ఆ కాస్తకే గాద్గదికమయింది.

"నాన్నగారెక్కడమ్మా?"

"మా వూళ్లో ఎలిమెంటరీ స్కూలు టీచరుగా పనిచేస్తున్నారు పిన్నీ. పిల్లలూ అక్కడే వున్నారు!"

"ఇక్కడ నువ్వూ - మీ అన్నయ్యా వాళ్లుంటున్నారా?"

"నా కన్నయ్యలు లేరండీ!"

"ఒక్కత్తివే వుంటున్నావా?"

"భలేవారే! జానికమ్మ పిన్నిగారింట్లో వుంటే ఒంటరిగా వున్నట్టుంటుందాండి! సొంత తల్లిలా చూసుకుంటారావిడ!"

ఆ మాటలు ఆమెకి తృప్తినే కలిగించాయి. "ఇంత మంచిపిల్ల కాబట్టే జానికమ్మ మా అబ్బాయికి సూచించింది నిన్ను!"

సుజాత తెల్లబోయింది.

"మరయితే యీ పిల్ల ఎవరు?"

ఉలికిపడింది సుజాత. జానికమ్మగారూ తెల్లబోయారు ఆశ్చర్యంతో. అయితే క్షణంలో తేరుకుని "రాజు నీతో ఏం చెప్పలేదా పిన్నీ?" అని అడిగింది.

"చెప్పాడమ్మా! ఈ పిల్ల సంగతులన్నీ చెప్పాడు. కానీ యీ చంటిపిల్ల ఎవరో నాకే అర్థంకావటం లేదు!"

"అది సుజాత కన్నబిడ్డే! వాడికి యీ విషయం తెలుసు. అయినా గొప్ప మనస్సుతో, విశాలభావంతో, తల్లినీ, పిల్లనీ స్వీకరించేందుకు యిష్టపడ్డాడు. ఈనాటి యువతరమే గొప్పది. గొప్పగా మెచ్చుకోతగ్గది. ఎవరో దుష్టుడు చేసిన అన్యాయానికి సుజాత జీవితాంతం బాధపడాలా? వీల్లేదు అన్నాడు!"

ఆ మాటలకి యిద్దరూ ఆశ్చర్యపోయారు! సుజాత ముఖం అవమానంతోనూ చంద్రసేనమ్మ ముఖం కోపంతోనూ ఎర్రబడినాయ్.

ఆమె చివాలున లేచి నుంచుంది. "ఇలాటి చెడినదాన్ని కోడలుగా తెచ్చుకునే దౌర్భాగ్యం నాకు పట్టలేదు. నా కొడుక్కి మతిపోయినా నాకు మతిపోలేదు. ఈ పెళ్లి జరిగేందుకు వీల్లేదు. అంతగా వాడు పట్టుబడితే తల్లిని వదులుకుంటాడు!"

"ఏమండీ!" కోపంగా అరిచింది సుజాత.

"నిన్ననలేదమ్మా! నా కొడుకుని అనుకుంటున్నాను!"

"మీ యిష్టం మీ అబ్బాయిని లక్ష అనుకోండి. తిట్టుకోండి. దండించండి. పెళ్లి చేస్తారో మానతారో మీ యిష్టం. కానీ నన్ను మీ యిష్టం వచ్చినట్టుగా అనే హక్కు మీకు ఎవరిచ్చారు?"

"ఇదిగో అమ్మాయ్ —"

"మాటాడకండి. పెళ్లిచూపులకి మిమ్మల్ని బొట్టుపెట్టి పిలిచారా ఎవరయినా? మీ అబ్బాయి యిష్టపడితే చాలా? నేను యిష్టపడనక్కర్లేదా?"

"అబ్బా! ఇంతటి రంభ దొరకదని మావాడే వరించాడు. చెడిపోయిన —"

"ఆపండి! ఇంకోసారి ఆ మాటంటే మర్యాద దక్కదు. ఎవరు చెప్పారండీ మీకు నేను చెడిపోయానని? పళ్లు రాలగొడతాను రమ్మనండిటు!"

"సుజాతా!"

"ఊరుకోండి పిన్నిగారూ! మీకు తెలియదు. అందరికీ భయపడి తల వంచితే మనల్ని మొత్తేస్తారు. ఎక్కడికక్కడ తిరగబడాలి. అంతే!"

"ఏంటమ్మా నీ తల బిరుసు — పెళ్లి కాకుండానే ఎవడికో బిడ్డని కని, తగుదునమ్మా అంటూ ఆ బిడ్డని పెంచుకుంటూ పైగా నన్నే చివాట్లేస్తావా?"

"ఏమండీ! ఏమంటున్నారు? ఈ బిడ్డ నా బిడ్డా?" ఆశ్చర్యంగా అడిగింది.

"మరెవరి బిడ్డ? నా బిడ్డా?" హేళనగా అంది.

"మీకు చెప్పినా అర్థంకాదు. ఈ పసిపిల్ల ఎలా నా చేతుల్లోకి వచ్చిందో - ఎందుకు నేనే పెంచుతున్నానో మీకు తెలియదు!"

"అయితే యీ పిల్ల నీ కూతురు కాదా !"

ఆశ్చర్యంగా అడిగిన జానకమ్మగారివైపు చూసి "కాదు పిన్నిగారూ ! అదంతా ఓ విచిత్ర సంఘటన — మళ్లీ మీకు చెబుతాను. మీరైనా నమ్మితే చాలు !" అంది.

చంద్రసేనమ్మ లేచింది. "వస్తానే జానీ —" అంది. ఆవిడకి ఎలాగో వుంది.

జానకమ్మగారు మాటాళ్లేదు. అవిడకంతా అయోమయంగా వుంది.

సుజాత మౌనంగా ఉండిపోయింది. ఆవిడ వెళ్లిపోయింది. తర్వాత కొద్ది సేపటికి పాపని తీసుకుని వెళ్లిపోయింది ఆమె.

## 10

"ఏమైంది ?"

"సెంట్ పర్సెంట్ సక్సెస్ !"

"కవిత విషయం ఎత్తేవా ?"

"ఎక్కడుందోనని అల్లల్లాడిపోతోంది. నాకు తెలియదు. తెలియగానే తీసుకొస్తాను అన్నాను. ఆ మాటకే ఆవిడ పొంగిపోయింది !"

"ఇంకేం చెప్పావు !"

"అంతే ! మరేం మాటాళ్లేదు !"

"సరే ! అలా వుంచు. సమయం చూసి చెబుదాం. వీడి విషయ మేమిటి ?"

"పెళ్లి ప్రయత్నాల్లో వున్నాడు రాస్కెల్ ! అమ్మాయిల బ్రతుకులంటే ఆటబొమ్మలకంటే హీనం అనుకున్నాడు !"

"కానీ ! కానీ ! సూటిగా చూసి దెబ్బకొడితే దిమ్మతిరిగిపోతాడు. కాళ్ల బేరానికొస్తాడు !"

"సమయం రావాలిగా !"

"వస్తుంది. తప్పక వస్తుంది !"

"నీ యిష్టం ఎలా చేస్తావో ! ఆ విషయాన్ని ఓ కొలిక్కి తేవాలి !"

"ఊఁ ఆ విషయ మేమైంది !"

దాని కతడు సమాధానం యివ్వలేదు—

"పెళ్లయితే కానీ పిచ్చి కుదరదు. పిచ్చి కుదిరితే కాని పెళ్ళవదు. చూద్దాం. ఆ విషయం తేలిపోతే ఇదీ కుదుటుతుంది !"

"అదే నా ఆశ !"

"ఇంతకీ వ్యక్తిత్వం వున్న మనిషి ! చాలా మొండి ధైర్యం !"

తలూపేడతను. కొద్ది సేపయ్యాక సెలవు తీసుకున్నాడు.

కల్యాణ్ సాలోచనగా వెళ్లిపోయాడు తన రూమ్‌కి.

* * *

దాదాపు తొమ్మిది గంటల సమయంలో యింటికి చేరాడు నాగరాజు. అతని కెందుకో మనస్సు పాడైపోయినట్టుగా అనిపించింది. కారణం ఏమీ లేదు. ఒక్కోసారి ఎవరికయినా నిష్కారణంగా మనస్సులో చికాకు పుడుతుంది. ఎంత ప్రయత్నించినా మనస్సు కుదుటికిరాదు. ఏదో సంఘటనో, విషయమో మారివస్తేగాని ఆ చికాకు తగ్గదు.

ఎన్నడూ లేంది అతనికి విస్కీ తాగాలనిపించింది ఆఖరికి. బ్రాందీనో, బీరో పుచ్చుకోవాలనిపించింది. కాళ్లు అప్రయత్నంగా అటుకేసి దారితీశాయి. మనస్సు నిద్రపోయేట్టుగా చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు.

బార్ ముందుకి రాగానే కాళ్లు రక్కున సంకెలవేసినట్టుగా ఆగిపోయాయి. బార్‌కేసి తలెత్తి చూశాడు. 'గాంధీ వైన్స్' అన్న బోర్డు నియాన్‌లైట్ల వెలుతుర్లో దేదీప్యమానంగా వెలుగుతోంది.

'హుం! ఏం దేశం ఇది! గాంధీ వైన్స్, నెహ్రూ క్షౌరశాల, శంకర్ విలాస్ మిలిటరీ హోటల్ – ఇవా పేర్లు? ఇదా జాతికి చైతన్యం తెచ్చిన మహా మనుషుల కిచ్చే గౌరవం? ప్రజలకి యిందులో న్యూనత తెలియటంలేదా? ప్రభుత్వానికిదేం అవసరం లేదా? అన్నిటికి టైటిల్స్ రిజిస్ట్రేషన్ చేసినట్టుగా వీటికీ చేస్తారే! అప్పుడు అభ్యంతరం పెట్టకూడదా! ప్రభుత్వాని కీమాత్రం తెలియదా?' అనుకున్నాడు.

మనస్సులోని చికాకు మరి కాస్త పెరిగి కోపంగా మారిపోయింది. అనాలోచితంగా తీసుకున్న నిర్ణయాన్ని తొలగించుకుని ఆ క్షణంలో తనలో ఏర్పడిన బలహీనతని తిట్టుకుంటూ యింటిముఖం పట్టేడు. మనస్సు చికాకుకి మార్గం కారణం దొరికిందిగా!

"ఏం నాయనా! తొమ్మిదైనా యిల్లు జ్ఞాపకానికి రాలేదా?" అడిగింది నాయనమ్మ.

సమాధానం యివ్వకుండా లోపలికి నడిచాడు. ఆవిడ పడక వరండాలోనే! వానొచ్చినా వంగదొచ్చినా అదే స్థానం! 'రేపు చచ్చినా అక్కడే చస్తుందేమో ముసలావిడ!' అనుకున్నాడతను.

"బావుందిరా నీ బలాదూరు తిరగటం! సాయంకాలం అయిదింటికి ఆఫీసు వదిలితే కొంపకి చేరేది యిప్పుడా?"

ఊరకే "అమ్మా! అరవకు!"

"ఏమిట్రా విసుగు? ఎందుకా కోపం! ఇప్పుడెవరేం అన్నారని! నీలాగా వెధవపనులు ఎవరూ చెయ్యలేదిక్కడ!"

"ఏంటమ్మా అది! ఎక్కడెక్కడో తిరిగి యింటికి వస్తే యిదా నువ్విచ్చే స్వాగతం! కొంచెం మనస్సుకి విశ్రాంతి యివ్వు!"

"అందుకేరా బాబూ! త్వరగా పెళ్ళిచేసుకోరా నాయనా అంది. నువ్వేమో దేశాన్నీ, స్త్రీజనాన్ని ఉద్ధరిస్తోన్నట్టుగా ఆ పతివ్రతని ఎంచుకున్నావు." హేళనగా అంది.

చురుగ్గా చూశాడు నాగరాజు. "నువ్వు సుజాతయింటికి వెళ్ళొచ్చావా? అక్కయ్య నీతోపాటే వచ్చిందా?" అడిగాడు శాంతంగా.

"అహఁ సుబ్బరంగా యిద్దరం కలిసే వెళ్లాం. ఆ మహాతల్లి మంగళారతులు ఎత్తి పంపింది!"

కనుబొమలు ముడివేశాడతను.

"అయినా నీ కదేం పోయేబుద్ధిరా? పెళ్ళికాకుండా పిల్లతల్లయి, ఆ పిల్లని తగుదునమ్మా అని పెంచుకుంటోన్న పిల్లని ఎంచుకున్నావ్? దేశంలో యింకెక్కడా నీకు నచ్చిన అమ్మాయిలే లేరా?"

"అమ్మా!" శాంతంగా పిలిచాడు. "నువ్వు సుజాతతో ఆ విషయం అడిగావా?"

"అడక్క— కళ్ళెదురుగా రబ్బరుబంతిలా పాప కనిపిస్తోవుంటే ఎలా అడక్కుండా వుండగలను. తండ్రికి దూరంగా ఈ నగరంలో ఒక్కతే ఎందు కుంటుందో అర్థమైంది. ఈ నిర్వాకానికేనేమో!"

"నువ్వు చాలా తప్పుచేశావమ్మా! సుజాత చాలా గొప్ప వ్యక్తి!"

"ఏమిటి? పెళ్ళికాకుండానే పిల్లతల్లి అయింది. గొప్ప వ్యక్తి - నేను పనికి మాలినదాన్నినూనా? బావుంది నీ సంబంధం!"

అతనేం అన్లేదు! 'హుఁ ఎవరికెంత ప్రాప్తమో అంతే! నువ్వు ఆమెకి అత్తవయ్యే అర్హత కోల్పోయావు!' అనుకున్నాడు.

"భోజనానికి పద!"

"ఆకలిగా లేదమ్మా!" అన్నాడు బెడ్‌పై వాలిపోతూ! నిజానికి అంతదాకా బళ్ళతో తినాలనివున్న ఆకలంతా చచ్చిపోయింది.

"ఇప్పుడు నేనేంచేశారా బాబూ! అయినా నాపై కోపం తిండిపై చూపితే ఎలాగా? అన్నం పరబ్రహ్మస్వరూపంరా నాయనా! దాన్ని కాదంటే కావాలను కున్నప్పుడు దొరకదు! రా! తిందువుగాని!"

"వద్దమ్మా! ఎప్పుడో ఎవరికో పెట్టి వుండను. నాకు ఈ పూట లేకుండా పోతోంది. ఇప్పుడు నువ్వే అన్నావుగా, ఎప్పుడో వద్దని తిరస్కరించి వుంటాను!"

"మాటకి మాట! అడ్డాలనాడు బిడ్డలుగానీ గడ్డాలొచ్చాక బిడ్డలా? అంతా నా రాత!" అనుకుంటూ పడుకుంది ఆమె.

ఆ పూట చాలా రాత్రిదాకా నిద్రపోలేదు నాగరాజు.

• • •

మరుసటి రోజు ఉదయం ఆమె ఆఫీసుగేటులో అడుగుపెడుతూ వుండగానే "గుడ్ మార్నింగ్!" అన్నాడు రాజు.

"గుడ్ మాణింగ్!" అంది సుజాత అలవాటుగా.

"ఒక్క నిమిషం మాటాడతారా?"

నవ్వేసింది సుజాత. "మీ ప్రశ్నకి నా నవ్వుకి ఒక్క నిమిషం సరిపోయింది!"

అతనూ నవ్వేడు ఆ మాటవిరుపుకి.

"చెప్పండి? అది మన జాతీయం లెండి. ఒక్క మాట అంటూ పావుగంట మాటాడతాం. ఒక్క నిమిషం అంటూ నవలకి సరిపోయేంత విషయం చెబుతాం. ఒక్కడుగు అలా వెళ్లొద్దాం అంటూ కిలోమీటర్ వెళతాం!" అంది సుజాత.

"మీలో మంచి సెన్సాఫ్ హ్యూమర్ వుంది!"

"అందుకే యింకా బ్రతికివున్నాను. లేకపోతే ఎప్పుడో ఆత్మహత్య చేసుకునేదాన్ని!"

"మిమ్మల్ని అభినందిస్తున్నాను!"

"ఎందుకు?" తెల్లబోయింది సుజాత

"యధార్థంగా మాటాడుతున్నందుకూ – ఆత్మహత్య చేసుకోనందుకూ!"

పకపక నవ్విందామె.

"నన్ను క్షమించండి. మా అమ్మగారి తరఫున క్షమాపణ వేడుకుంటున్నాను. ఆవిడ అలా ప్రవర్తించి వుండకూడదు. మీ యోగ్యత, మీ గుణగణాలు తెలియకుండా మాటాడింది. రియల్లీ అయాం ఎక్స్ట్రీమ్లీ సారీ!"

"మీరు ఆ విషయం మాటాడుతున్నారా? ఇంకా మరేమిటో అనుకున్నాను. భలేవారే! నే నెప్పుడో మరిచిపోయాను ఆ విషయాన్ని. చెప్పారుగా! నాలో సెన్సాఫ్ హ్యూమర్ ఉందని. అందుకే బ్రతికేస్తున్నాను!"

విన్వెరపోయాడు నాగరాజు.




"అయినా నాగరాజుగారూ! నా కెందుకో పెళ్ళిమీద యింట్రెస్ట్ తగ్గిపోతూ వుందండి! ఆ బంగారు బొమ్మని నాలాగా నిండు వ్యక్తిత్వంతో పెంచాలని పిస్తోంది. నా జీవితాన్నంతా త్యాగంచేసయినా ఆ పిల్లని మంచి యోగ్యురాలిగా, బుద్ధిమంతురాలిగా చేసి, బాగా చదివించాలని వుంది. నిజంగా ఆ పిల్ల నాబిడ్డే అయితే – అదే నా జీవితధ్యేయం కాదూ?

"ఏ తల్లి కన్న బిడ్డయితేనేం రాజుగారూ! నా చేతుల్లోకి వచ్చిపడింది. మనకి బజార్లో వజ్రం దొరికిందనుకోండి. ఎవరిదోనని నిర్లక్ష్యం చేస్తామా? మురికిగుంటలో కలువ పూసిందనుకోండి – తుంచి అందుకోమా? వేలకివేలు ఖరీదుచేసే బంగారునగ పెంటపోగులో కనిపిస్తే ఛీ ఛీ అనుకుంటామా? తీసి కళ్ళకద్దుకోమూ?

"ఆ పిల్ల పుటక ఎలాటిదయితేనేం రాజుగారూ! పెంపకంలో బంగారు కమ్మెచ్చు తీర్చినట్టు తీర్చలేనూ! నా కుద్యోగం వుంది. బాదరబందీ లేదు. నా జీతం నాకు చాలు! ఆ పిల్లని బాగా పెంచి పెద్దచేస్తాను. ఇంకా నాకు పెళ్ళెందు కండీ?"

ఆమె కంఠంలో గద్గదికని గమనించేడతను. అతని దృష్టిలో ఆమె వ్యక్తిత్వం హిమాలయోన్నతంగా పెరిగిపోయింది. 'హేట్స్ అఫ్!' అనుకున్నాడు. "సుజాతగారూ! నేను మీ ఫ్రెండ్‌నని చెప్పుకుందుకి గర్వపడుతున్నాను!" అన్నాడు.

ఆ కంఠంలోని సిన్సియారిటీ గమనించిందామె. "థాంక్స్!" అంది.

"ఏమ్మా! బయటే వున్నారు! ఇంకా ఆఫీసు తెరవలేదా?" అంటూ వచ్చారు రామలింగయ్యగారు.

"నమస్కారమండీ."

"గుడ్ మార్నింగ్!" ఇద్దరూ ఒకే సమయంలో అన్నారు.

"నమస్కారం, గుడ్ మార్నింగ్! పదండి వెళదాం! ఏమయ్యా రాజూ! అచ్చం వందపైసలు ఆంధ్రుడివి. చదువుకున్నవాడివి. సుబ్బరంగా నమస్కారం అనలేవుటయ్యా! ఏం మనుషులో ఏమో! ఏదో మేమంటే - ప్రీ ఇండిపెండెంటు మనుషులం. మా కింకా ఆ బ్రిటిష్ వాసనా, ఆ పద్ధతులూ, ఆ ఇంగ్లీషు మోజూ తగ్గలేదనుకో. మీకేమయ్యా! స్వేచ్ఛావాయువులు పీలుస్తూ పుట్టారు. ఆఁ."

నాగరాజు ఏమీ సమాధానం చెప్పలేదు. తన సెక్షన్‌లోకి వెళ్ళిపోయాడు. సుజాత ముసిముసిగా నవ్వింది. రామలింగయ్యగారు తన సీట్లోకి వెళ్ళిపోయారు.

## 11

రోజులు భారంగా దొర్లిపోతున్నాయి. సుజాతకి మల్లీశ్వరితో బాగా ప్రొద్దు పోతుంది. ఇప్పుడా పిల్ల బోర్లపడుతోంది. ముందుకి ప్రాకుతోంది. పేరుతో పిలిస్తే తల తిప్పుతుంది. బోసినవ్వు నవ్వుతుంది. కితకితలు పెడితే నవ్వుతుంది.

ఆ రోజు సాయంకాలం ఆఫీసునుంచి తిరిగొచ్చాక సాయంకాలం ఏడింటి దాకా పాపని ఆడిస్తూ విద్రపుచ్చింది. తలుపు వేసుకోబోతూ కాంపౌండ్ గేట్ వైపు చూసింది. ఎవరో వ్యక్తి జానికమ్మగారి యింటినుంచి తలవంచుకుని గబగబా అంగలువేస్తూ గేటువైపుగా వస్తోన్నాడు. కాంపౌండ్ మధ్యలో వున్న నియాన్ లైట్ వెలుతురు మందంగా ప్రసరిస్తోంది.

అ మందపు వెలుతుర్లో అతని నడక ఎక్కడో చూసినట్టుగా అనిపించింది. అస్పష్టంగా కనిపిస్తోన్న ఆ మనిషి పోలికలు ఏవేవో గుర్తుకి తెస్తున్నాయి. మనస్సుకి అందకుండా పోతున్నాయి. ఎవరో తరుముతున్నట్టుగా వడివడిగా నడుస్తోన్నాడా వ్యక్తి.

అతన్ని బాగా చూడాలని యింకాస్త ముందుకి వచ్చింది. ఏదో స్మృతిపథంలో మెరిసినట్లై తలుపులు చేరవేసి గబగబా తనూ గేటువైపు నడవసాగింది.

కాంపౌండ్‌లో ఎవరూ లేరు! జానికమ్మగారి వరండాలో సవిత కాలేజీ పాఠాలు చదువుకుంటోంది.

ఆ వ్యక్తి గేటుదాటిన నిమిషానికి సుజాత గేటువద్దకి వచ్చింది. అంతలో అతనెవరో ఆమెకి గుర్తు చిక్కాడు.

"ఏమండీ !" అంటూ పిలిచింది మెల్లిగా.

ఆ పిలుపు వినిపించనట్టుగా గబగబా నడుస్తున్నాడు.

"ఏమండీ మిమ్మల్నే ! ఆగండి !" అంది గట్టిగా అటూ ఇటూ చూసి ఎవరూ లేకపోవటంతో

చప్పున అతను వెనుదిరిగి చూశాడు. సుజాతని చూసి ఆగిపోయి తలవంచుకుని నిలుచున్నాడు.

సుజాత సంతోషంతో, సంభ్రమంతో, కోపంతో "ఎందుకండీ పిలుస్తున్నా వినిపించుకోకుండా అలా వెళ్ళిపోతున్నారు !" అంది.

అతను ఏదో చెప్పబోయాడు.

"మీరింకేం చెప్పకండి. మీరు నన్ను అప్పుడే చూసి వుంటారు. అందుకే తప్పించుకుని వెళుతున్నారు. చెప్పండి ! ఎందుకలా వెళ్ళిపోయారు ఆ రోజు ! రైలు ఎక్కి పాపని నా ప్రాణానికి వదిలేసిపోయారు. మీరేమో - బరువుని తగ్గించుకున్నారు. కానీ నేను ఎంతెంత నరకయాతనని అనుభవించాను ! ఎందరెందరి కోపానికి గురయ్యాను? ఎన్ని అవమానాలని ఎదుర్కొన్నాను. మైగాడ్! ఆ శిక్ష శత్రువులకి కూడా వొద్దురా భగవంతుడా అనిపించింది! అయినా వింగిలోని సిరిమల్లిలాటి జాబిలిని చూసి కదలి పొంగిపోయినట్టుగా ఆ పాప ముఖం చూస్తే చాలు పరిపూర్ణ ఆనందం కలుగుతోంది.

"చెప్పండి! ఆ పాప ఎవరు? ఆమె తల్లి ఎక్కడ? ఆమె మీ కేమవుతుంది? అలా ఎందుకి వదిలేసి వెళ్లారు ?

"నేనంటూ బ్రతికి వుంటే తప్పక ఏదో ఒకనాడు వచ్చి పాపని తీసుకెళతానన్నారే ? ఏమిటి మీ విశ్వాసం ? ఏ ధైర్యంతో అలా అన్నారు! నే నెవరో ఎలా తెలుసుకోగలుగుదురు ? ఎక్కడని వెదికేవాళ్లు ! దేవుడి దయవల్ల నా అదృష్టం బావుండి ఆ పాప యోగం బావుండి మీరు యిప్పుడే కనిపించారు.

"పాపం ! నేనీ యింట్లో వుంటానని మీకు తెలిసివుండదు ! అందుకే ధైర్యంగా యీ కాంపౌండ్‌లోకి అడుగెట్టారు ! లేకపోతే కొంపదీసి నేనిక్కడ వుంటున్నానని నా చహరా తెలుసుకునే అప్పుడు పాపని వదిలేసి వెళ్లారా ? చెప్పండి !"

గబగబా ఆవేశంగా ఆశుకవిత్వంలాగా మాటాడింది.

"సుజాతగారూ! నన్ను క్షమించండి! మిమ్మల్ని చాలా క్షోభపెట్టాను. అవమానం, అనుమానాలకి గురయ్యేట్టు చేశాను. అది నా తప్పే! ఆ పాప ఎవరో - ఆ పాప తలిదండ్రులెవరో మీకు త్వరలో చెపుతాను!"

"కొంపదీసి పాపని తీసికెళ్లాలనుకుంటున్నారేమో! ఆ పిల్ల తల్లి స్వయంగా వస్తే తప్ప అప్పగించే ప్రసక్తిలేదు. అసలు యిప్పుడే పాపని వదిలివుండలేని స్థితికి వచ్చాను నేను!" అంది నవ్వుతూ.

"మీరు నిజంగా అమృతమూర్తులు!"

"ఆగండాగండి." నన్ను పొగడకండి! నేను మరీ అంత మంచిదాన్ని కాదు."

"ఆ విశేషణం మీ మాతృమూర్తులందరికీ చెల్లుతుంది సుజాతగారూ! మీరు అంతగా ఆ పిల్ల తల్లిని చూడాలనుకొంటే రేపు ఆదివారం సాయంకాలం అయిదింటికి ప్రకాశం పార్కుకి రండి! చూపిస్తాను. మాటాడిస్తాను!"

సుజాత కళ్లు మిలమిల మెరిసేయి. కనురెప్పలు టపటపా కొట్టుకున్నాయ్. "నిజమా!" అంది.

"ఆ వింగిలోని సిరిమల్లి అంత నిజం!"

"థాంక్స్! తప్పక వస్తాను!"

"అయితే పాపను మటుకు తేకండి. ఈ మధ్యలో నేనెక్కడ కనిపించినా గుర్తించినట్టు చూడకండి! వస్తాను!" గబగబా అంగ లేసుకుంటూ వెళ్లిపోయాడు. "మిస్టరీ!" అనుకుంటూ వెనుతిరిగింది సుజాత! ఆమె మనస్సు యిప్పుడు ప్రశాంతంగా నిండుగా వుంది.

• • •

సుధాకర్ ట్రెయినింగ్ పూర్తిచేసుకుని వచ్చాడు. ఆఫీసరుగారు టీ పార్టీ అరేంజ్ చేశారు. ఆ రోజు ఉదయంనుంచీ అతను ఒక్కసారయినా ఆమె వైపు చూళ్లేదు. మామూలుగా, ఒక సెక్షన్ ఆఫీసరు తన క్రింది ఉద్యోగిని పలుకరించేటంత మాత్రమయినా పలుకరించలేదు. ముభావంగా గంభీరంగా మెలిగాడు. దర్పంగా ప్రవర్తించాడు.

సుజాతకి మండిపోయింది. 'ఏవిటీతని గొప్ప!' అనుకుంది. 'తనని చాలా తక్కువగా అంచనావేశాడు. రేపోమాపో అసలు వ్యక్తి - ఆ పాపతల్లి వచ్చి తన బిడ్డని తను తీసికెళ్లినరోజున వీళ్లంతా తన ముఖం ఎలా చూడగలరు. సిగ్గుతో వాళ్ల తలలు నేలకి వాలిపోవూ?' అనుకుంది.

గర్వానికి ముందు ఉదాసీనత. సుజాత అదే చేయాలనుకుంది. టీపార్టీ

ఎరేంజ్ చేస్తున్నట్టుగా సర్క్యులర్ రాకముందే రామలింగయ్యగారి వద్దకి వెళ్లింది.

"నాకు వంట్లో బావుండలేదండీ! ఓ అరగంట ముందుగా వెళ్లిపోతున్నాను. నా సీట్లో యీ పూటకి అర్జంట్ ఫైల్స్ ఏవీ లేవు!" అంది.

"అలాగే వెళ్లిరామ్మా! నీలాగా సిన్సియర్‌గా పనిచేసేవాళ్లు ఓ గంట ముందు వెళ్లినా కొంప మునుకపోదు!" అన్నాడాయన.

"బ్రతికించారు!" అనుకొని కృతజ్ఞతలు చెప్పి వెళ్లిపోయింది. ఆఫీసుగేట్ దాటుతోండగా డాక్టర్ మృదుల ఎదురుపడింది.

"గుడీవినింగ్!" అంది నవ్వుతూ.

"గుడీవిని గ్ డాక్టర్!" అంది చిరునవ్వుతో!

"బావున్నారా!"

"ఫైన్! మీ జాబ్ ఎలా వుంది?"

"మా జాబ్‌కేమిటి? వార్డునిండా పేషెంట్లు. వాళ్లనిండా రోగాలు. రోజూ పుట్టే పుటుకలకి, చచ్చే చావులకి మేం సాక్షులం. అంతే!"

ఆ మాటలకి నవ్వేసింది సుజాత. "వస్తాను!" అంది.

"ఓకే! ఎప్పుడైనా మా యింటికి రారాదూ! విశ్వనాధనగర్‌లో వుంటున్నాను. నా పేరడిగితే ఏ రిక్షా అయినా తీసుకొస్తారు!"

"చెప్పారుగా ఆయన! మీ వద్దకి వచ్చేరోజు యింకా రాలేదులెండి!" నవ్వుతూ అంది.

ఫక్కున నవ్విందామె. "అది హాస్పిటల్‌లో! మా యింటికి రమ్మంటున్నాను నేను!"

"వస్తాలెండి! బై!" అంది కదులుతూ. ఆలస్యమైపోతే ఎక్కడ పట్టేస్తారో నని గాబరాగా వుంది లోలోపల. అతని దర్పాన్ని అణచాలంటే ఇదే మార్గం.

"ఓకే!" చెయ్యూపుతూ మెల్లెక్కింది మృదుల.

పార్టీలో డాక్టర్ మృదులతో అతని పెళ్లి త్వరలో నిశ్చయం కాబోతున్నట్టు ప్రకటించాడు ఆఫీసరుగారు. అంతా చప్పట్లు చరిచారు. నాగరాజుకి ఆశ్చర్యం వేసింది. అతనిపై అసహ్యం కలిగింది. ఎంత ఘటికుడు అనుకున్నా పైకి మాత్రం అందరిలాగే అభినందించేడు. సుధాకర్ అందరికీ కృతజ్ఞతలు చెప్పేడు.

పార్టీలో సుజాతలేని లోటు గుర్తించింది ముగ్గురే! సుధాకర్! ఆఫీసర్! నాగరాజు. ఆఫీసరుగారు రామలింగయ్యని అడిగారు. ఆమె ఎక్కడంటూ!

వంట్లో బావుండలేదని పర్మిషన్ తీసికెళ్ళిపోయిందన్నారాయన. పార్టీ విషయం తెలియదా అని అడిగితే తెలియదు అని రెండు రకాలుగా జవాబిచ్చాడు రామలింగయ్యగారు. ఆఫీసరుగారు రెట్టించలేదు.

నాగరాజుకి సుజాత అంతర్యం అర్థమైపోయింది. ఆమె దృఢ చిత్తానికి, వ్యక్తిత్వంపై దెబ్బతీయగల నేర్పుకి సంతోషించాడు. మనసులోనే అభినందలు చెప్పుకున్నాడు.

సుధాకర్‌కి లోలోపల మంటగా వుంది. తనని, తన హోదాని కాదని తన పార్టీని నిర్లక్ష్యంచేస్తూ వెళ్ళిపోయిన ఆమెని క్షమించలేకపోయాడు. దెబ్బ తీయాలని నిర్ణయించుకున్నాడు.

• • •

ఓ రోజు మధ్యాహ్నం జానికమ్మగారు యింట్లో ఒక్కతే వున్నసమయంలో కవిత వచ్చింది. ప్రతిరోజూలాగే ఆమె అందర్నీ అఫీసుకి పంపేసి మల్లీశ్వరిని పక్కలో పడుకోబెట్టుకుని వారపత్రికలో సీరియల్‌గా వచ్చిన ఓ నవలని పుస్తక రూపంలో చదువుతోంది. ఆమె ప్రక్కనే రేడియోలో సంగీతం మెల్లిగా వినిపిస్తోంది.

కాంపౌండ్ అంతా నిశ్శబ్దంగా వుంది. ఆఖరింటిలో లత నానమ్మగారు లోపల గదిలో లక్షవత్తులు చేసుకుంటూ పాడుకుంటున్న గోవిందనామాలు అప్పుడప్పుడూ వినిపిస్తోన్నాయి. ఈ చివరింటిలో లెక్చరర్ సునంద అత్తగారు వింటున్న టేప్‌రికార్డర్‌లోని సినిమా పాటలు లీలగా వినిపిస్తున్నాయి?

ఎండలో వెచ్చదనంలేదు. అలాగని చల్లదనమూ లేదు. గాలి ఉండుండి వీస్తోంది.

చదువుతోన్న నవలని పక్కనపెట్టి తల తిప్పిన జానికమ్మగారికి ఎవరో యిరవయ్యేళ్లు దాటిన యువతి తలనిండా పైటకొంగు కప్పుకుని కూర్చుని కనిపించింది.

దిగ్గున లేచి కూర్చుంది ఆమె. "ఎవరమ్మా నువ్వు!" అంది ఆశ్చర్యంగా. ఆ యువతి తలెత్తి చూసింది. కన్నీటి పొరలగుండా ఆమెని చప్పున పోల్చుకుందామె. "కవితా!" అంది. ఆ పిలుపులో ఆనందం, సంభ్రమం ఒడ్డులొరుసుకుని ప్రవహించేయి.

"అమ్మా!"

అ రెండుక్షరాలలోనూ ఇన్నేళ్ల వియోగమూ, ఇన్నేళ్ళ బోధ, దుఃఖం



అన్నీ తొంగిచూశాయి. గుండె లోతుల్లోంచి భక్తిభావనతో పరమేశ్వరుడి గురించి పిలిచిన పిలుపులా ధ్వనించింది.

చప్పున కూతుర్ని కౌగిల్లోకి తీసుకుందామె. ఎన్నేళ్ళ వియోగమయినా తల్లీ కూతుళ్ళని క్షణికంలో కలిపేసింది.

"లోపలికి వెళదాం పదమ్మా!"

"అమ్మా! నువ్వు నీ కూతుర్ని చూసుకున్నావు. అంతే చాలా?" అంది కవిత. ఆ మాటల్లో ఏదో ధ్వనించింది. కానీ జానకమ్మగారికి అది స్పష్టంకాలేదు.

"ఏమిటమ్మా! ఇన్నేళ్లూ ఎక్కడున్నావ్. ఎలా గడిపేవ్? ఏంచేస్తున్నావ్? ఎవరెవరున్నారు? పదమ్మా! చాలా చాలా తెలుసుకోవాలి. మొన్న మీ బావ కల్యాణ్ వచ్చి అన్నపుడే నాలో ఆశ మొలకెత్తింది. మళ్లీ ఈ జన్మలో నిన్ను చూస్తాననుకోలేదు. నా తల్లీ! ఎన్ని బాధలుపడ్డావో! ఎన్ని నిందలుమోశావో! ఎంత దుఃఖం అనుభవించావో! ఒక్కదానివి మాటతోడూ, మనిషి సాయం లేకుండా ఎలా నెగ్గుకొచ్చావమ్మా!" కన్నీళ్లతో అడిగింది

కవిత సమాధానం యివ్వలేదు. దీక్షగా చాపపై మెత్తని పొత్తిళ్లలో నిదుర పోతున్న పాపకేసి చూస్తోంది. ఆమె చెక్కిళ్ళపై సంతత ధారగా వర్షిస్తున్నాయ్ కన్నీళ్లు. తన జీవిత సర్వస్వఫలమన్నట్టుగా చూస్తోంది ఆ పాపవైపు.

"ఏమిటమ్మా? అలా చూస్తున్నావ్?"

తల్లి ప్రశ్నకి జవాబివ్వకుండా చప్పున ఆ పసిపాపని ఎత్తుకుంది, ఎన్నో నెలల వియోగం తర్వాత, తిరునాళ్లలో తప్పిపోయిన కూతురు దొరికిన తల్లిలా గుండెకు హత్తుకుంది

పాప కెవ్వుమంది. కళ్లు తెరిచి కవితవైపు చూసింది. ఏడ్పు మానేసి ఆమె ముఖంలోకి చూసి కేరింతలు కొడుతూ, చేతులు చాచింది పిడికిళ్లు విప్పి పిలిచినట్టుగా చెక్కిళ్లు తాకింది.

జానకమ్మగారు తెల్లబోయి చూస్తున్నారు.

కవిత ఎదబరువుని మోయలేకపోయింది పాపని పైటచాటుకి తీసుకుంది.

ఆ పాప ఎవరో విడమరిచి చెప్పనక్కరలేకపోయింది జానకమ్మగారికి. "భగవంతుడా! శ్రీనివాసా! ఎంత దయామయులు మీరు!' అనుకుని మనసారా మొక్కుకుంది.

కవిత చెక్కిళ్ళపై కన్నీరు ప్రవహిస్తోనేవుంది

# 11

పార్టీ జరిగిన మరునటి రోజు శుక్రవారం. బాగా తలంటి పోసుకుని, చక్కగా గుగ్గిలం పొగతో ఆరబెట్టుకుంది. వెన్నరాసుకుని పోసుకుందేమో ఆరిన తలకట్టు చమరీమృగ వాలంలాగా వుంది పిరుదులదాకే జడ పొడుగు తలకట్టు వీపునిండా పరచుకుని వుంది.

భుజాల చివర క్లిప్ పెట్టేసింది జడ అల్లుకోకుండా. తలకట్టు కుచ్చుగా కుదురుగా ఏంచక్కా వింజామరలాగా వుంది.

"నిన్న మీరు రాలేదు పార్టీకి!"

"అవునండీ! ఒంట్లో బాగాలేక రాలేదు!" క్లుప్తంగా అంది.

"ఇప్పుడెలా వున్నారు?"

"చూస్తున్నారుగా!"

"చెప్పమంటారా?"

"అడిగి చెబుతారా ఎవరయినా?"

"షికారుకి భూలోకానికి వచ్చిన లక్ష్మీదేవిలా వున్నారు!" ఆరాధనా భావం గొంతులో పరవళ్లుతొక్కి ఆ మాటలరూపంలో వచ్చింది.

సుజాత పెదాల చివర్లు కదిలేయి. "థాంక్స్ నాగరాజుగారూ!" అంది. తన సెక్షనువేపు నడవబోతూ వుంటే పిలిచాడు మళ్లీ.

"మీరు వినవలసిన న్యూస్ వుంది. మృదుల శ్రీమతి మృదులా సుధాకర్ కాబోతుంది. ఓ వారం రోజుల్లో తాంబూలాలు పుచ్చుకుంటారేమో!"

"నేను ఎప్పుడో అనుకున్నాను!" నిర్లిప్తంగా అంది. ఆ న్యూస్ ఆమెకేమీ వింతగా అనిపించలేదు, బాధా కల్పించలేదు.

"సుజాతగారూ! ఓ నిండు జీవితం శాశ్వతంగా అన్యాయం కాకుండా చూడా లంటే ఈ పెళ్లి జరక్కూడదు"

"అదేం?" అంది వింతగా.

"మీకో విషయం చెప్పాలి యిక్కడ. సుధాకర్‌కి ఓ అమ్మాయి ఇప్పటికే బలిఅయిపోయింది. అయితే ఆమె అన్యాయమై పోలేదు. ధైర్యంగా చదువు కుని ఉద్యోగంచేస్తూ వర్కింగ్ ఉమెన్ హాస్టల్లో వుంటుంది ఆమెకో పాప! వాళ్లిద్దరికీ అన్యాయం జరగకూడదంటే యీ పెళ్లి ఆగిపోవాలి. పీటలమీది పెళ్లి ఆపటం పాపమే కానీ పీకలమీది ఉరిని ఆపటం పుణ్యమే!"

ఆశ్చర్యంతో కళ్లు విశాలంచేసుకుని చూసింది. అతని మాటల్లో అణుమాత్ర మైనా అబద్ధం లేదనిపించింది. ఆమె అతన్ని విశ్వసించింది "ఏం చేద్దా మంటారు?" అని అడిగింది.

"మీరు రేపు డాక్టర్‌గారి యింటికి రాగలిగితే ఆవిడకి యీ విషయాలన్నీ చెబుదాం. ఆ తల్లినీ, పిల్లనీ కళ్లారా చూసైనా ఆమె విశ్వసిస్తుంది తన బావకి బుద్ధిచెబుతుంది. ఆ యిద్దర్నీ తప్పక ఏకం చేస్తుంది. ఆమె చదువుకున్నది, సంఘంలో బాధ్యతాయుతమైన మహోన్నతమైన డాక్టర్ వృత్తి చేపట్టి సమాజ సేవ చేస్తోంది. ఆమె ఈ అన్యాయాన్ని సహించదు అతన్ని దారికి తేగల సమర్ధురాలు ఆమె ఒక్కతే!"

అతను చెప్పింది నిజమే ననిపించింది. "మంచి ఊహ. అలాగే చేద్దాం!" అంది

"థాంక్స్! మీరు సరిగా అర్థంచేసుకున్నారు నన్ను." అన్నాడు కృతజ్ఞతా పూర్వకంగా.

బదులుగా నవ్వేస్తూ "నన్నెట్టే పొగిడేయకండి!" అంది సీటుకేసి నడుస్తూ.

ఆ రోజంతా సుధాకర్‌ని పరిహరించింది. అతను సంతకం చేయవలసిన పేపరుంటే శాస్త్రిద్వారా పంపింది ఫైలు. పళ్లు కొరుక్కున్నాడతను. అతన్ని గ్రీట్ చేయలేదు. ముఖం తప్పించింది ఆ రోజల్లా.

మరుసటి రోజు శనివారం ఉదయమే తయారైంది సుజాత.

"గుడికా ?" అడిగింది ఉత్తర। ఆ అమ్మాయి కాన్వెంట్ స్కూల్లో టీచరు. ప్రయివేట్‌గా ఎమ్మే చేస్తోంది. అందుకే ముందుగా వెళ్లి మదర్‌తో పాఠాలు చెప్పించుకుంటుంది. అదో తరహా మనిషి. ఎవరినీ విమర్శించదు. ఆమెకి ఫ్రెండ్స్ లేరు. అలాగే శత్రువులూ లేరు.

"అలాటి చోటుకే।"

"బడికా ?" మళ్లీ అడిగింది.

"ఊహూ( నీ ఊహ అంత మాత్రమేనా ? ఆలోచించు చూద్దాం ?" కొంటెగా అంది.

కళ్లద్దాల గుండా ఉత్తర కళ్లు టపటపలాడించటం కనిపించింది. పెదాలు బిగబట్టినా ఆమెకి స్ఫురించలేదు.

"ఎక్కడికి ?"

"హాస్పిటల్‌కి।"

"ఓహ్( డాక్టరు దగ్గరికా ? హాస్పిటల్ గుడిలాటి చోటే అయినా అక్కడ దేవుళ్లకంటే పూజార్లే ఎక్కువగా వున్నారు।"

నవ్వేసింది సుజాత బస్సు ఎక్కేస్తూ. ఆమె హాస్పిటల్ ముందు దిగేసరికి గేట్లో రెడీగా నుంచుని వున్నాడు నాగరాజు

"వెళదాం రండి।" అని నేరుగా డాక్టరు మృదులగారి గదికి తీసికెళ్లాడు.

వీళ్లని చూడగానే ఆమె పేషెంట్స్‌ని అసిస్టెంట్‌కి అప్పగించేసి "రండి।" అంది తన పర్సనల్ రూంకి దారితీస్తూ. ఇద్దరూ అనుసరించారు. గదిలోకి వెళ్లగానే కప్పుల్లోకి కాఫీ వంచి యిచ్చింది. ముగ్గురూ తాగేశారు.

"చెప్పండి" అంది నవ్వుతూ.

"ఇక్కడి కెవరూ రారా ?"

"ఊహూ( ఇది నా పర్సనల్ రూం। రిలాక్స్ అయ్యేందుకి మాకు ఎలాట్ చేస్తారు. తలుపేస్తే యింటర్‌కంలో అత్యవసరమైన కేసువస్తే తప్ప ఎవరూ డిస్టర్బ్ చేయరు. మీకేం అనుమానం అక్కర్లేదు చెప్పండి।" అంది నవ్వుతూ.

నాగరాజు తలుపులువేసి వచ్చాడు.

"డాక్టర్ మీరు సుధాకర్‌ని పెళ్లి చేసుకోబోతున్నారా?" సూటిగా ప్రశ్నించింది సుజాత. ఆ ప్రశ్నకి తెల్లబోయిందామె: వీళ్లేదో పర్సొనల్ ప్రాబ్లమ్ కోసం వచ్చారనుకుందే తప్ప తన పర్సనల్ విషయంగా వచ్చారనుకోలేదు.

"అవును! ఏం?" ఆ కంఠంలో కొద్దిగా చికాకు, కోపం ధ్వనించాయి.

"మమ్మల్ని అపార్థం చేసుకోనంటే ఓ విషయం చెబుతాం!" అన్నాడు నాగరాజు.

"అలాగే చెప్పండి! ఏమిటది?"

"సుధాకర్ యీవరకే ఓ అమ్మాయిని ప్రేమించాడు. ఆమెతో తిరిగాడు. ఆమెను అనుమానించి విడిచేశాడు!"

"అవును. నాతో చెప్పాడు!"

"మీతో చెప్పాడా?" డాక్టర్ మృదుల నింపాదిగా యిచ్చిన సమాధానానికి ఆశ్చర్యపోతూ ప్రశ్నించింది సుజాత.

"అవును! మిమ్మల్నే ప్రేమించాడట కదా! అహం మీరు ప్రేమించారట కదా! అయినా మీరు అతన్ని విశ్వసించి నిజం చెప్పలేదట! మీపై అనుమానం ఋజువుకావటంతో మీ నుంచి తప్పుకున్నాడట కదా!" నిశ్చలమైన గొంతుతో ఏమాత్రం ఉద్వేగం లేకుండా అడిగింది.

ఫక్కున నవ్వింది సుజాత.

"నవ్వుతారేం?"

"అవును. అతన్ని నేను అభిమానించి, ఆరాధించి అతన్ని పెళ్లి చేసుకోవాలని ఆశించింది నిజమే! అతనూ అందు కనుకూలంగానే ప్రవర్తించేడు. కానీ ఎప్పుడైతే నా శీలాన్ని శంకించి, నా మాటల్ని విశ్వసించలేదో అప్పుడే అతనెంత అల్పుడో గ్రహించుకుని నా మనస్సుని నిర్దాక్షిణ్యంగా చంపేసుకున్నాను. కానీ తర్వాత అతనెంత నీచుడో, నికృష్టుడో తెలిసివచ్చింది!"

"ఎలా తెలిసింది?" సుజాత అంత నిర్భయంగా చెప్పేసరికి ఆమెగొంతు వణికింది అడగటానికి.

"అతను కాలేజీలో చదివే రోజుల్లో ఓ అమ్మాయిని ప్రేమించాడు. రెండు సంవత్సరాలు కలిసిమెలిసి తిరిగేడు. ఓ రోజు ఆమె తన ఆత్మబంధువుతో మాటాడుతూ వుంటే అనుమానించాడు. నిజం చెప్పినా నమ్మలేదు ఆమె శీలాన్నే శంకించి దుష్ప్రచారం చేశాడు. ఆ అమ్మాయి అవమానాన్ని భరించలేక ఎటో పారిపోయింది. ఆమె తలిదండ్రులకి ముఖం చూపించలేకపోయింది!"

"ఇందులో నీచత్వం ఏముంది?"

"ఇంకా వుంది!" అంటూ చెప్పసాగింది సుజాత. గతదినం నాగరాజు చెప్పిన విషయాలన్నీ వివరంగా చెప్పింది. సాక్ష్యాధారాలతో సహా ఋజువు చేస్తానంది.

"సరే! రేపు మీతోపాటే నేనూ చూస్తాను! మీ మాటే నిజమయితే ఆ దగా పడిన చెల్లి కన్నీరు తుడిచి, ఆమె బ్రతుకు చక్కబరుస్తాను!"

"థాంక్స్!" అంటూ లేచారిద్దరూ!

* * *

ఆ రోజు ఆదివారం!

ఉదయంనించీ సుజాత మనస్సు మనస్సులో లేదు. ఎప్పుడెప్పుడు సాయంకాలం అవుతుందా అని ఎదురుచూడసాగింది. ప్రొద్దు గడిచేకొద్దీ ఆందోళన, ఆరాటం ఎక్కువ కాసాగాయి. 'ఆవిడ ఎవరు? ఇతనికీ ఆమెకీ సంబంధం ఏమిటి? తప్పకుండా తీసుకుని వస్తానన్నాడు. ఒకవేళ రాకపోతే! అతనెవరో! అడ్రసు కూడా తెలుసుకోలేదు. పేరయినా అడగలేదు. పోనీ జానికమ్మగారిని అడిగితే! అతనా యింటికి వచ్చినట్టున్నాడు. ఆవిడకయినా తెలుసో తెలియదో!

'ఊహూఁ అతను తప్పకుండా వస్తాడు. ఆ మాటల్లో సిన్సియారిటీ అలా వుంది. ఆమెని చూడాలి. మాటాడాలి. తర్వాత? తర్వాతే. వుంది! ఆ పిల్లని ఆవిడకి అప్పగించాలి. అంతే!'

ఆ ఊహ రాగానే ఉలికిపడింది. చప్పున అటు చూసింది. హాయిగా కేరింతలు కొడుతూ ఆడుకుంటూంది బెలూన్‌తో! మల్లీశ్వరిని అప్పగించెయ్యటమా! ఒక్కసారి గుండె బాధతో మూలిగింది.

తప్పదు! కొన్ని నెలలు పెంచిన తనకే యింత బాధగా వుందే! ఆ కన్న తల్లికి ఎంత గుండెకోతగా వుందో! ఎప్పటి ఋణమో యిది. తీరిపోతోంది!'

"సుజాతా!"

పిన్నిగారు వచ్చారు. సాయంకాలం అందరూ సినిమాకి బయలుదేరుతున్నారు. అంచేత యింటికి తాళం వేసుకుని వచ్చేసిందామె.

"ఎక్కడి కయినా వెళుతున్నావామ్మా!"

"అవును పిన్నీ - అయితే సినిమాకి కాదు. అలా బజార్లో కొంత పని ఉంది!"

"ఆదివారంనాడు బజార్లో పనేమిటమ్మా!"

నవ్వింది సుజాత. "నేనే మీవద్దకి వచ్చి పాపని ఇచ్చి వెళదామనుకున్నాను.




అంతలో మీరే వచ్చారు!" అంది. అంతలో ఆమె మనస్సులో ఏదో ఊహ తళుక్కుమంది. "పిన్నిగారూ! మీరు ప్రకాశం పార్కుదాకా వస్తారా?"

తెల్లబోయిందామె. "అదేంటమ్మా? పార్కుకి నేనెందుకు. యీ వూరొచ్చి యిన్నేళ్లయింది ఏనాడూ పార్కు ఎరగను!"

"లేదు పిన్నిగారూ! మీరు తప్పక రావాలి! పదండి వెళదాం! నా జీవితంలో ఈ సాయంకాలానికి చాలా ప్రాముఖ్యత వుంది. మీరు తప్పకుండా రావాలి!" బ్రతిమాలుతూ అంది.

"సరే పదమ్మా!" అందామె మల్లీశ్వరిని ఎత్తుకుంటూ. జానకమ్మగారిని అనుసరించింది సుజాత.

ఇద్దరూ పార్కు చేరేసరికి బాగా ఆరుగంటలైంది. ఇంకా చిరుచీకట్లయినా కమ్ముకోలేదు. "మీ రిక్కడ కూర్చోండి! ఒక్క క్షణంలో వస్తాను!" అని ఓ రాతిబల్లమీద కూర్చోపెట్టి మరో గేటువైపు నడిచింది.

అక్కడ ఆ వ్యక్తి నుంచుని వున్నాడు.

"హమ్మయ్య! వచ్చారా?" అన్నాడు. అతని ముఖంలో ఎంతో ఆనందం, ఎంతో తృప్తి కనిపించాయి.

తలూపింది సుజాత.

"ఒక్కరే వచ్చారా ?"

"ఆఁ." చిన్న అబద్ధం ఆడేసింది.

"అయితే పదండి! ఆవిడ అక్కడ పొద క్రింద కూర్చుంది. వెళదాం!" అన్నాడు. ఇద్దరూ మెల్లిగా నడుస్తూ దట్టంగా వున్న ఆ పొద దగ్గరికి వచ్చారు. ఆ పొగకి అటువైపున బల్లమీదే జానికమ్మగారు కూర్చుని వున్నారు. అక్కడ అంతదాకా జీవితకాలమంతా నిరీక్షణలో, దిగులుతో గడుపుతోన్న వ్యక్తిలా వున్న ఓ యువతి కూర్చొని వుంది.

ఇతన్ని చూడగానే, "వచ్చావా కల్యాణ్!" అంటూ లేచింది

"నమస్తే!" అంది సుజాత.

"వీరు సుజాతగారు! ఆరోజు చెప్పానే రైల్వేస్టేషన్లో రైల్లో కనిపించిన వారు వీరే!"

ఆ మాటలు వినగానే ఆమె కళ్లు మిలమిల మెరిపేయి. "పాప బావుందా ?" అని అడిగింది. ఆమె ముఖంలో పాపని గురించి ఒక్క మాటయినా వింటే చాలు అన్నంత ఆరాటం కనిపిస్తోంది.

"మీరెవరు ? పాపకి మీకూ ఏం సంబంధం ?"

సుజాత ప్రశ్నకి ఆశ్చర్యపోయి, "నువ్వు చెప్పలేదా కల్యాణ్! ఏమండీ పాప నా కన్నకూతురండీ! నా కన్నకూతురు! తొమ్మిది నెలలు మోసి మూడు నెలలు పెంచి విడిచేశానండీ!" అంది బాధగా.

"ఊఁ! నేను నమ్మను! మీరే పాప కన్నతల్లి అయితే అలా బిడ్డని వదిలేసుకుంటారా ? అలా నిర్దాక్షిణ్యంగా ముక్కూమొహం తెలియనివారి చేతిలో వదిలేస్తారా ?"

"కల్యాణ్! నీవు వీరికో నా కథంతా చెప్పలేదా ?"

లేదన్నట్టుగా తలూపేడతను అడ్డంగా.

"చాలా తప్పు చేశావు. ఆవిడకి యిప్పుడైనా చెప్పి వుండవలసింది. సుజాత గారూ! మీరు ఎక్కడ వుండేదీ నాకు తెలుసు. అతనికీ తెలుసు. జానికమ్మ గారు మా అమ్మ! మీరు అక్కడ అద్దెకుంటున్నారనీ తెలుసు. మీరు ఊరికి వెళ్లి తిరిగొచ్చే సమయంలో కల్యాణ్ కాచుకుని కాచుకుని పాపని అందజేశాడు. ఆరోజు నేనూ ఆ స్టేషన్‌లోనే వున్నాను. నా పాప భద్రంగా మీవద్ద పెరుగుతుందనే విశ్వాసంతోనే అలా విడిచేశాము!"

అంతా ఆశ్చర్యంగా వుందామెకు. అయినా తెలిసిచేసిన కుట్రలా అనిపించి

"కానీ మీరు చేసిన ఆ పనితో నేనేం కోల్పోయానో, నేను ఎంతగా అవమానాలకీ, అనుమానాలకీ గురయ్యానో మీకు తెలుసా? ఇప్పుడు మీ పాప మీకు క్షేమంగా దక్కుతుంది. కానీ - కానీ - నాకు మళ్లీ ఆ రోజులు వస్తాయా?" అంది కంపిస్తోన్న స్వరంతో.

"నిజమే! మీరు పరువు, మర్యాద కోల్పోయారు. నలుగుర్లో నవ్వుల పాలయ్యారు. కన్నతండ్రికి, ప్రేమించిన మనిషికి దూరమయ్యారు. మానసికంగా చిత్రహింస అనుభవించారు. కానీ అదంతా మీ మేలుకే జరిగింది! అందుకే ఆ మేలుకోసం- మీ మేలుకోసం- నా మేలుకోసం చేశాను!"

"హుఁ మేలు! ఏం మేలు జరిగింది. వాళ్లకి దూరం కావటం నాకు మంచి జరిగినట్టా? అసలెందుకు మీరా పని చేశారు. నా బ్రతుకుతో ఆడుకునే హక్కు మీకెవరిచ్చారు?" అసహనంగా అరిచింది.

"అలా ఎందుకు చేశానో చెబితే వింటారా శాంతంగా!"

"చెప్పండి!"

ఆమె చెప్పసాగింది.

## 12

"నేను జానకమ్మగారి పెద్దకూతురు కవితని. నన్ను బాగా చదివించాలని మా నాన్న గుంటూర్లో వదిలేశారు. అక్కడ చౌదిరిగారింట్లో వుంటూ చదువుకునేదాన్ని. పల్లె పట్టణమూ కాని మధ్యతరగతి టౌన్‌లో, మధ్యతరగతి యింట్లో పుట్టిన నాకు గుంటూరు వాతావరణం కొత్తగా వింతగా వుండేది చిన్న చేపపిల్ల కాలువనుంచి చెరువులో పడ్డట్టుగా వుంది నా పరిస్థితి.

"అయితేనేం ఆ సినిమాలు, ఆ షాపింగ్‌లు, ఆ మనుషులు, ఆ కాలేజీ వాతావరణం, అమ్మాయిలు అబ్బాయిలు కలసి చదువుకోవటం ఎంతో సందడిగా హాయిగా వింత సుఖంగా వుండేది.

నేను ఇంటర్ పూర్తిచేసి బి.ఏ లో చేరిన సంవత్సరమే మా కాలేజీలో చేరాడు ఓ కొత్త విద్యార్థి. ఎక్కడో ఇంటర్ చదివి అక్కడికి వచ్చాడు. అతని డ్రస్సు, బిహేవియర్, స్టైయిల్ ఆఫ్ వాకింగ్, హేర్‌స్టైయిల్, టాకింగ్ స్టైయిల్ అంతా వింతగా విస్మాతంగా వున్నాయి.

మా అందరి మధ్యా విశేషంగా విచ్చేసిన ~ వరాజులా వుండేవాడు. అతన్నంతా ప్రిన్స్ ఆఫ్ వేల్స్ అనేవారు. ఇన్ని మానరిజమ్స్‌తో పాటు భగవంతుడు అతనికి అందాన్నీ యిచ్చాడు. మనుషుల్ని యిట్టే ఆకర్షించే చూపులు—

స్ఫురద్రూపం అతని సొత్తు. అతనికి డబ్బుకొక్కొదవలేదు. భగవంతుడు అతనికి మంచి గొంతుకా యిచ్చేడు.

ఇంతెందుకు? అతను ఆకాశంలో చుక్కల మధ్య సుధాకరుడిలా వుండే వాడు మా మధ్య. సహజంగా అందరిలాగే నేనూ ఆకర్షితురాలయ్యాను. ముందు మాటా మాటా కలిసింది. ఆ పైన స్నేహం కలిసింది. మనసులూ కలిశాయి. సినిమాలు, షికార్లు మొదలయ్యాయి. అలా మొదటి సంవత్సరం మొలకెత్తిన స్నేహబీజం ఫైనలియరయ్యేసరికి మా ప్రేమవృక్షంగా ఎదిగింది.

ఫైనలియర్ ఎగ్జామ్స్ యిక నెల రోజులున్నాయనగా ఓ సంఘటన జరిగింది.

ఓ రోజు మేము విజయవాడ వెళ్లి దుర్గని చూసి, సినిమా చూసి లాడ్జిలో ఓ రోజు గడిపి గుంటూరు వచ్చేసరికి గుంటూర్లో ఏ కాలేజీగోడపై చూసినా నా పేరే కనిపించింది. సర్వ అసభ్యంగా హీనాతిహీనంగా రాశారు. నన్నో నీతిలేని దానిలాగ దుష్టురాలిలా విచ్చలవిడిగా తిరిగేదానిలా రాతలు రాశారు. ఇంతచేసి చిత్రంగా అతని పేరు ఎక్కడా లేదు. అతనికి భయపడ్డారో, రాజకీయంగా ఆర్థికంగా వాళ్ల నాన్నగారి పొజిషన్‌కి భయపడ్డారో, అతని రంగంలోకి లాగ లేదు, అంత దుఃఖంలోనూ అదే నాకు కలిగిన చిన్న తృప్తి!

ఆ రోజే కాదు ఆ వారమంతా నేను బజారు ముఖంకానీ, కాలేజీ ముఖం కానీ చూళ్లేదు. చౌదరిగారి భార్య వచ్చి కేకవేసింది. బుద్ధులు చెప్పింది. ఇల్లు కదలకుండా కట్టుదిట్టం చేసింది. ప్రిన్సిపాల్ యింటికి ఫోన్‌చేసి చెడామడా తిట్టేరు. పరీక్షలు మొదలయ్యేవరకూ కాలేజీకి రావద్దన్నారు. నాలో నేను సిగ్గుతో చచ్చిపోయాను.

నాన్నగారికి అమ్మకీ యీ విషయం తెలియకుండా జాగ్రత్తపడ్డాను. ఆ రెండు నెలలూ అతన్ని కలుసుకోవటానికి ఎంతో ప్రయత్నించాను. అతను ముఖం చాటేశాడో లేదో అప్పట్లో నాకు తెలియదు.

పరీక్షలు పూర్తయిన రోజున కాలేజీ గేట్లో అతనికోసం ఎదురుచూస్తూ నుంచు న్నాన. ఆఖరికి అతను దొరికాడు. నన్ను చూడగానే విప్పారిన ముఖంతో దగ్గ రిగా వచ్చాడు.

ఇతర్ల సూటిపోటి మాటలు లెక్కించకుండా ఇద్దరం ఓ చెట్టు క్రింద నుంచున్నాం.

"ఇన్నాళ్లూ రాణివాసం చేశావేం?" అన్నాడు.

చురుక్కుమనేట్టు చూశాను. "నేను దాక్కున్నానా? నువ్వు తప్పుకున్నావా?"

"ఏదయితేనేం రాణీసాహెబ్ దర్శనం లేదు!"

"ఇప్పుడేమిటి చేయటం!"

పెళ్లి చేసుకుందామా?"

"వేళాకోళంగా వుందా?"

"నీకలా అనిపిస్తుందేమో! నేను నిన్ను విడిచి వుండలేను. నువ్వు నాతో జీవితం పంచుకొంటేకానీ నేను సుఖపడ్లేను!"

ఆనందంతో నాట్యం చేయాలనిపించింది. ఇన్నాళ్లు సంశయంతో గడిపిన నాకు అతని మాటలు ఎంతో ఊరటనిచ్చాయి. నాకు డిగ్రీ వచ్చేస్తుంది త్వరలో ఒక వేళ అమ్మా నాన్నా ఒప్పుకోకపోయినా మా బ్రతుకులు మేం బ్రతకగలం.

"మీ నాన్నగారు చౌదరిగారు కాదట కదా?"

"అవును. ఆయన ఫ్రెండ్!"

"వాళ్లని ఒప్పిస్తావా పెళ్లికి!"

నేను సమాధానం యివ్వలేదు!

"మావాళ్లు ఒప్పుకోరు! మనం ఎక్కడైనా వెళ్లి పెళ్లిచేసుకోవాలి!"

"అది నాకిష్టమే!" సంతోషంగా అన్నాను నేను. అప్పట్లో నాలో ఆలోచనలు నశించాయి.

"మనం రేపు విజయవాడ వెళదాం! అక్కడ నా ఫ్రెండ్స్ ఉన్నారు. ఎలా పెళ్లి చేసుకోవాలో ఆలోచిద్దాం!"

"రేపు ఫస్టుబస్‌కే వెళదాం!"

అతను నవ్వి వెళ్లిపోయాడు. నాకు యిప్పటికీ ఆ సంఘటన, ఆ మాటలు అన్నీ బాగా గుర్తున్నాయి. మరునటిరోజు ఉదయం రేకలు విచ్చుకోకముందే అతను బస్‌స్టాపులో వున్నాడు. నేను మా వూరు వెళ్లొస్తానని చెప్పి లైట్ లగేజ్‌తో బయలుదేరాను ఒక్క సర్టిఫికెట్స్ తప్ప బుక్స్ ఏవీ తీసుకోలేదు.

విజయవాడలో ఒక నెల రోజులున్నాం. వెన్నెల ఆకాశం మాదే అన్నట్టుగా తిరిగాం. ఎంత సుఖించానో అప్పుడు నా బ్రతుక్కి అదే సుఖపడిన కాలం. మళ్లీ సుఖమంటూ ఎరుగను.

లాడ్జిలో అతనోరోజు బయటికి వెళ్లిన సమయంలో లాన్‌లో కూర్చుని చూస్తున్నాను. కల్యాణ్ కనిపించాడు. అతనింటినుంచి పారిపోయి వచ్చాడు. అతనిదో చరిత్ర - ఓ ప్రత్యేక కథ. పిలిచి మాటాడుతూ కూర్చున్నాను. అత్త కొడుకాయె! ఆత్మీయుడాయె! పుట్టింటి విషయాలు ఎన్నో రోజులుగా తెలియదాయె.

అతనివల్ల మా తలిదండ్రులు గుంటూరు వచ్చారనీ, చౌదరిగారు నేను వూరెళ్ళిపోయిన విషయం చెప్పగా మౌనంగా తిరిగిపోయారనీ వాళ్ళకి గుంటూర్లో నాకొచ్చిన కీర్తిప్రతిష్ఠలు బాగా తెలిసిపోయాయని ప్రస్తుతం నేను పేరయినా తెలియన్ని ఆ గ్రంథసాంగుడితో లేచివెళ్ళిపోయానన్ని అనుకుంటున్నారనీ విని నివ్వెరపోయాను. వలవలా ఏడిచేశాను. కన్నవారితో తగాదా తప్పదను కున్నానే కానీ యిలా బ్రతుకులో మళ్లీ ముఖంచూపించే అవకాశం వుండదను కున్నాను.

అంతలో వచ్చాడు అతను. మమ్మల్నిద్దర్నీ అనుమానంగా చూశాడు. నా కథంతా చెప్పి అతన్ని పరిచయం చేశాను. ఏమీ అనలేదు. ఆ రాత్రే కల్యాణ్ మద్రాసు వెళ్లిపోయాడు.

మరసటిరోజే నా బ్రతుకు తెల్లారిపోయింది. బజారుకు వెళ్లిన అతన్ని అతని తలిదండ్రులు వలపన్ని పట్టేసి తమ వూరు లాక్కెళ్లారు. కోటీశ్వరుడూ, సంఘంలో పరువుప్రతిష్టలూ వున్న ఓ యువకుడు కాలేజీలో చెడ్డపేరు తెచ్చు కున్న అమ్మాయిని పెళ్లి చేసుకోవటం వాళ్లకి నచ్చలేదు. అందుకే బలవంతంగా లాక్కెళ్లారు.

ఆ విషయం నాకు మూడోరోజున ఉత్తరంద్వారా తెలిసి హతాశురాలి నయ్యాను.

అటు గొయ్యి - ఇటు నుయ్యి! అది పాత సామెత! అప్పుడు నాకు అటు గోదావరి - ఇటు కృష్ణ కనిపించాయి. దేన్లో దూకినా నా అవశేషాలు కూడా కనిపించవు. అదే నిశ్చయించుకున్నాను.

అయితే మూడురోజుల తర్వాత ఓ నిర్ణయాని కొచ్చాను. చావకూడదు. నా బ్రతుకు బ్రతకాలి! నా గతచరిత్రతోపాటు ఆ బంధువుల దృష్టిలో చనిపోవాలి! ఆ నిర్ణయంతో కట్టుగుడ్డలు, వస్తువులు కొన్ని కృష్ణఒడ్డున పెట్టి, హైద్రాబాదు రైలెక్కేశాను.

* * *

నవల చదువుతున్నట్టుగాను, కథ వింటున్నట్టుగాను వుంది సుజాతకి. వినేకొద్దీ ఆమెకి కవితపై జాలి పెరగసాగింది.

"హైద్రాబాద్‌లో ఉద్యోగంలో చేరాక - వర్కింగ్ ఉమెన్ హాస్టల్లో సీటు సంపాదించుకున్నాక జీవితం గాడిలో పడిందనుకున్నాను. అయితే మళ్లీ ఎనిమిది సంవత్సరాల తర్వాత జీవితం యీ మలుపు తిరుగుతుందనుకోలేదు నేను!"

"ఏం జరిగింది?"

"మళ్లీ అతను కనిపించాడు ఓ రోజున!"

"అతనేనా?" ఆశ్చర్యంగా అడిగింది సుజాత.

"ఆఁ దురదృష్టం అతని రూపంలో కనిపించింది. కోఠిలో బస్సు దిగి, బస్సు మారి ఎక్కబోతున్నాను. అప్పుడు వినిపించింది అతని కరం—"

# 13

"కవితా!"

ఎన్నో రోజులు గంటలకొద్దీ పందలకొద్దీ అలా మధురంగా పిలిపించుకున్న పేరు - ఆ తీయని గొంతుక - చప్పున మెట్లెక్కేదాన్నల్లా వెనుదిరిగి చూసి బస్సుదిగేను.

అతను ఓ కారులో కూర్చుని పిలిచి, నేను బస్సు దిగగానే కారు దిగేడు. వడివడిగా వచ్చాడు. మనిషి కండపట్టేడు. అందంగా, హుందాగా పెరిగి పోయాడు. సన్‌గ్లాస్ కళ్లజోడు - సూట్ - దర్జాగా వున్నాడు.

"ఇన్నేళ్లూ ఎక్కడున్నావు!" అతని గొంతులో అప్పటి ఆత్మీయత, ఆతురతతోపాటు తొంగిచూసింది.

"ఆ లాడ్జి విడిచి - ఆ దేశం విడిచి - అందర్నీ విడిచి యిలా వచ్చాను!" నా గొంతు కఠినంగా నాకే కఠినంగా వినిపించింది.

"అయాం సారీ కవితా! ఉత్తరం రాశానుగా! నే నే పరిస్థితులలో లాక్కు పోబడ్డానో. పద! అన్నీ వివరంగా చెబుతాను. ఈ రోడ్డుమీద ఎందుకు?"

"మళ్లీ లాడ్జింగ్‌కేనా?"

"తప్పదు కదా! నే నిక్కడికి ఆఫీసు పనిమీద వచ్చాను. దయచేసి నాతో రా! అంతా వివరిస్తాను. నా తప్పు లేకపోతే క్షమించు- లేదా శిక్షించు. ఒకమాట చెపుతాను. నువ్వు నమ్మేట్టయితే- నేనింకా నీ స్మృతులు మరవలేక పెళ్లిచేసుకోలేదు —"

ఆ మాటలు నాకు ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఇప్పుడు నాపై నాకు విశ్వాసం వుంది. అతనితో వెళితేనేం? అనుకుని కారెక్కాను. అతని ప్రక్కన కార్లో కూర్చోగానే నా ఒళ్లు పులకరించింది. పాడుశరీరం సుజాతగారూ! ఇది ఒక్కో సారి మనస్సుని కాదని ప్రవర్తిస్తుంది. నా కనిపించింది. అంతరాంతరాల్లో అతనిపై నాకు విశ్వాసం, ప్రేమ పూర్తిగా నశించిపోకుండా ఎక్కడో లేశ మాత్రంగా మిగిలిందని. అందుకే అతన్ని మళ్లీ నమ్మేను. స్వర్గాన్ని అందుకుంటున్నాననుకుని ఆ లాడ్జింగ్‌లో అతనితో గడిపేను.

పదిరోజులు- అలా గడిపాము. అతను హైద్రాబాద్ వచ్చిన పని పూర్త యింది. తిరిగి ఊరికి- ఈ ఊరికే వెళ్లిపోవాలి. డ్యూటీకి రిపోర్టు చేయాలి-ట!

నాకు మళ్లీ బియంవేసింది. అయితేనేం ఇప్పుడు అడ్రసు దొరికింది. అతని వద్దకి వెళ్లగల ననిపించింది. అతన్ని పూర్తినమ్మకంతో సాగనంపేను.

తర్వాత అతనక్కడికి, నేనిక్కడికీ చాలాసార్లు వచ్చాము. కలుసుకుని భార్యాభర్తల్లాగా బ్రతికాము. ఈ ఊరికి ట్రాన్స్ఫర్‌కోసం కూడా అప్లికేషన్ పెట్టించాడు. ఇక్కడ మా బ్యాంక్ బ్రాంచీ వుంది.

అదేం చిత్రమో! కల్యాణ్ మా బ్రతుకులో కాకతాళీయంగా తారసిల్లేడు. ఆ రెండుసార్లూ మా విడిపోవటానికి కారణం అయ్యేడు. అందులో అతని తప్పు లేదు. విధి ఆడిన తమాషా నాటకం అది.

ఆయన ఆ రోజు మళ్లీ హైద్రాబాదు వచ్చేడు. నాకు నెల తప్పిందని చెప్పాను. ఆయన చాలా ఆనందించాడు. నాకు శారీ ప్రజంట్ చేయాలని షాపింగ్‌కి కదిలాడు.

అక్కడే కల్యాణ్ కనిపించాడు.

చాలా ఏళ్ల తర్వాత కలసిన ఆత్మబంధువు. అమ్మానాన్నల విషయం కనుక్కోవాలి. సవిత, చంద్రమణి, శశి ఎలా వున్నారో అడగాలి. తహ తహ లాడిపోయాను. అక్కడే గబగబా మాటాడేను.

ఆయనలో అనుమానం బీజంగా నాటుకుంది. అక్కడ ముభావంగా వున్నాడు. ఆ రాత్రే తిరిగి యీ వూరొచ్చాడు. మళ్లీ నెలకి వచ్చాడు. నేనూ కల్యాణ్ కూర్చొని మాటాడుకుంటున్నాము. మాకేం తెలుసు ఆయన కుళ్లు బుద్ధి.

చెడామడా తిట్టేశాడు. ఇద్దరికీ రంకు కట్టేడు. నన్ను మరిచిపొమ్మన్నాడు. మళ్లీ జన్మలో ముఖం చూపించవద్దన్నాడు. రాక్షసుడిలా ప్రవర్తించేడు. నన్ను నీతీజాతీ లేనిదాన్నిగా మాటాడేడు. డబ్బుకోసం అతన్ని వలలో వేసుకున్నట్టుగా మాటాడి వెళ్లిపోయాడు.

నా బ్రతుకు మళ్లీ పాడైంది. అయితే ఇప్పుడు నాకు కల్యాణ్ అండ వుంది. అతని గురించి విచారించాను. అతన్ని మీరు ఆరాధించటం తెలుసు. అతనూ లిల్లికి మొగ్గుగా వున్నట్టు తెలిసింది. అతను ఉత్త అనుమానాల పుట్ట. ఆ విషయం స్వానుభవం! అందుకే పాపని మీతో వదిలేశాము. తర్వాత ఏం జరిగిందో మీకే తెలుసు!"




కవిత నోటంట ఆమె కథ విన్న సుజాత కరిగిపోయింది. సుధాకర్ పేరు అయినా చెప్పకుండా తన ముందు అంతా చెప్పిందామె. అతనెలాటివాడో తనకి తెలియదా! తనని ఎంత ఘోరంగా అనుమానించి అవమానించిందీ తనకు స్వానుభవమే కదా!

"కవితగారూ!" సుజాత గొంతు అర్ద్రంగా వుంది.

కవిత కళ్ల వెంట నీరు జలజల రాలింది.

"కవితా!" చప్పున ఇటుగా వచ్చింది జానికమ్మ. ఆమెని చూసి తెల్లబోయింది కవిత.

"అమ్మా!" కవిత గొంతు వణికింది.

"అంతా విన్నానమ్మా! నువ్వు నాతో చెప్పిందానికీ, ఈమెతో చెప్పిందానికి ఎంత తేడా వుంది! ఎన్ని బాధలనుభవించావు. ఎంత దుఃఖం అనుభవించావు. నువ్వు ఎవడితోనో లేచిపోయావనుకున్నాం యిన్నేళ్లూ! నీవు మాకు పుట్టనేలేదు అనేంత కఠినత్వం వచ్చేసింది మాలో! నిదానంగా కాలం గడిచేకొద్దీ నువ్వంటే సానుభూతి కలిగింది!"

కన్నీళ్లు తుడిచింది కవితకి. కవిత కిప్పుడు చాలా సంతోషంగా వుంది తృప్తిగా వుంది.

"అతన్నే పెళ్లిచేసుకున్నాననీ, ఓ బిడ్డతల్లినైనావనీ చెప్పినప్పుడుత ది పె లేని ఆ పిల్లకి ఓ పూట తల్లిపాలు యిస్తాననటం, ఆ పిల్లని పదే పదే ముద్దా,

నప్పుడూ నీ మాటలు నిజమనే నమ్మాను. నువ్వు నీ భర్త యింటికి వస్తావంటే, మీ నాన్నగారు సంతోషించారు. నువ్వెక్కడ వున్నావో కనుక్కోనందుకు నన్ను చివాట్లేశారు!"

కవిత పేలవంగా నవ్వింది.

"మల్లీశ్వరి నీ కూతురా! ఎంత చిత్రంగా వుంది. అందుకే ఆ పిల్లపై నా కంత మమకారం పుట్టుకొచ్చింది!"

"అన్యాయం పిన్నిగారూ! మిమ్మల్ని మీరు అలా తక్కువ చేసుకోకండి. మీకు ఎవరి పిల్లలయినా ప్రేమే! నేను దగాపడిపోయాననీ, ఆ పిల్ల నా కూతురే ననీ, నేను పిరికిగా పాడుపనులు చేయకుండా, ధైర్యంగా పెంచుకొంటున్నాననీ మీరు నమ్మా, నా కూతురనుకొని మల్లీశ్వరనీ ప్రేమించారు. అంతేకానీ మీలో స్వార్థం లేదు!"

జానకమ్మగారు నవ్వేశారు.

అప్పుడు వచ్చింది డాక్టర్ మృదుల. ఆవిడకి అంతా మిస్టరీగా వుండి పోయింది. ఇప్పుడు చిక్కు విడిపోయింది. తన బావ సుధాకర్ ఎంత మూర్ఖుడో తెలిసిపోయిందామెకి.

"ఎన్ని సినిమాలు చూసినా, ఎన్ని పుస్తకాలు చదివినా ఆడది దగాపడ్డమే కనిపిస్తుంది. ఎన్ని జీవితాలు పరిశీలించినా స్త్రీకి అన్యాయం జరిగినట్టే కనిపి స్తుంది. ఇంత తెలిసీ మనం లొంగిపోతాం, వాళ్ళ పరిపాలిస్తారు. అనుమానిస్తారు. వదిలేస్తారు. ప్రపంచం ఎంత చిత్రమైంది! కవితగారూ! మీకు సుధాకర్‌ని నేను అప్పగిస్తాను!" అంది డాక్టర్ మృదుల.

కవిత నవ్వింది. అందులో అందం లేదు. ఆనందం లేదు. ఆత్మవిశ్వాసం ఉంది.

"సుజాతగారూ! మిమ్మల్ని అభినందిస్తున్నాను. మీరే ధైర్యంగా ప్రవర్తించి వుండకపోతే మల్లీశ్వరి చచ్చిపోయి వుండేది. కవిత కాలగర్భంలో కలసిపోయేది. లేదా మల్లీశ్వరి ఏ అనాధ శరణాలయంలోనో పడరాని పాట్లు పడేది!"

"డాక్టర్‌గారూ! అదేమిటో నాలో మొండి ధైర్యం వచ్చేసింది. ఆ పిల్లని విడిచేయలేకపోయాను. ఎప్పుడైతే సుధాకర్, మా నాన్న నన్ను పూర్తిగా శంకించి అనరాని మాటలన్నారో అప్పుడే నాకు ప్రపంచంపై నమ్మకం పోయింది. నా విశ్వాసమంతా ఆ పిల్లలో, ఆ పిల్ల భవిష్యత్తులో, ఏ పాపమూ ఎరగని ఆ పిల్లలో చూశాను!"

"సుజాతగారూ!" పిలిచాడు నాగరాజు. "సుధాకర్‌కి మీ గురించి చెడుగా చెప్పింది నేను! నన్ను మన్నించండి!"

"మీరా!" ఫక్కున నవ్వేసింది. "మంచిపనే చేశారు! కవిత జీవితం బాగు పడింది!"

"అదంతా మా ప్లాను ప్రకారం జరిగింది కవిత నాకు అక్కయ్య కూతురు. కల్యాణ్‌కి మరదలు. మే మిద్దరం కలిశాం! సుధాకర్ ఆట కట్టించాం!"

"హీరో అయ్యారన్నమాట!

నవ్వేశాడతను —

"కవితా బాగా పొద్దుపోయిందనుకుంటా! తొమ్మిదైందేమో! మీ నాన్నగారు ఎదురుచూస్తూ వుంటారు. ఆందోళనపడుతూ వుంటారు. పదమ్మా వెళదాం!"

"అమ్మా! నేను యింకా పూర్తిగా నిష్కళంకను కాలేదు. సుధాకర్‌తో అంతా చెప్పాలి. అతన్ని నమ్మించాలి. అప్పుడే యింటికి వస్తాను. వీలయితే అతనితోపాటే వస్తాను. లేదా ఒక్కత్తిని వస్తాను. ఇప్పుడు నాకేం భయంలేదు. నేను పాపం చేయలేదు!"

"కవితా! నీ కూతురి కోసమైనా రామ్మా!"

"అమ్మా! ఇప్పుడు మల్లీశ్వరి నాకు నింగిలోని సిరిమల్లి! అది నేలమీది జాబిలి అయి నా ఒడిలో తూగాడినప్పుడే నా కూతురు. అంతదాకా అది సుజాత బిడ్డే!" నిశ్చలమైన కంఠంతో అంది.

"సరేనమ్మా నీ యిష్టం!" అందామె ఇంకేమీ అనలేక.

డాక్టర్ మృదుల, సుజాత, జానకమ్మగారూ వెళ్లిపోయారు. నాగరాజూ, కవిత, కల్యాణ్ మిగిలిపోయారు.

## 14

"వెళదామా మనం కూడా!"

"రాజూ! సుధాకర్‌ని ఎలా దెబ్బకొట్టాలి!"

"అతన్ని నమ్మించాలి కల్యాణ్! మనం ఎంత చెప్పినా అతను వినడేమో! బుధవారం అతనికి మృదులతో నిశ్చితార్థం చేస్తున్నారు. మధిర ప్రసాద్‌గారు ఘనంగా ఏర్పాట్లుచేస్తున్నారు. ఆరోజు అతన్ని డౌన్ చేయాలి! నలుగురిలో తల వంచుకునేలా చేయాలి! ఫోటోలు, టేప్‌రికార్డర్‌లో అతను పలికిన ప్రేమ పలుకులు అందరిలో వినిపించాలి! అప్పుడు దిగివస్తాడేమో గురుడు!"

సాలోచనగా తల పంకించాడు కల్యాణ్.

"పదండి వెళదాం। వాచ్‌మన్ గేటు వేసేస్తాడు।" అంది కవిత. ముగ్గురూ లేచి గేటుదాటి రోడ్డుపైకి వచ్చారు. వాళ్ళిద్దరూ సెలవుతీసుకున్నారు. కవిత తన గదివైపుగా నాలుగడుగులు వేసింది.

కారు హారన్ విని పక్కకు తప్పుకుంది. కీచుమంటూ కారు ఆగింది. "కళ్ళు మూసుకుని నడవకపోతే కాస్త జాగ్రత్తగా నడవరాదూ। రోడ్డుమీద కలలు కంటూ నడుస్తున్నావా?" ఖంగున మ్రోగింది కంఠం.

విస్మయంతో విభ్రమంతో చూసింది ఆ పరిచితమైన కంఠం విని – సుధాకర్ అతను। అతనూ కవితని గుర్తించేడు.

"నువ్వా।"

"ఆఁ నేనే।"

"ఇప్పుడు – యిక్కడ – ఎందుకొచ్చావిక్కడికి?" కఠినంగా అడిగాడు.

"హుఁ నన్ను మా బ్యాంక్‌వాళ్ళు మీ పుణ్యమా అంటూ ట్రాన్స్‌ఫర్ చేశారు।" అంది.

అంతలో కారు ఆగడమూ, కవిత నించోవటమూ, ఆ బ్రేక్ వేసిన శబ్దమూ విని, అట్టే దూరంగా వెళ్ళని కల్యాణ్ ప్రమాదం జరిగిందనుకుని వచ్చాడక్కడికి పరుగు పరుగున. "కవితా।" అంటూ పిలిచాడు, ఆదుర్దాగా కార్లో ఎవరున్నదీ గమనించకుండా.

ఆ పిలుపుకి యిద్దరూ చూశారు అటు।

"ఓ హీరోగారా। మీరూ యిక్కడే వున్నారన్నమాట। దట్స్ గుడ్। అయితే యిద్దరూ యింతదాకా పార్కులో చెట్టాపట్టా లేసుకుని షికార్లు కొట్టేరన్నమాట।"

ఆ వ్యంగ్యం బాణంలా దూసుకెళ్ళింది. అయితే అది గాయం చేయలేదు. కోపాన్ని కలిగించింది. "సుధాకర్। గర్జించింది కవిత. "కాస్త నోరు సంబాళించుకో।"

"ఉన్నమాట అంటే అంత ఉలుకెందుకు. ఇప్పుడు ఇద్దరూ ఏకంగా కాపురం పెట్టొచ్చే। ఎందుకిలా విడివిడిగా వుంటున్నట్టున్నారు।" మనస్సులో ఈర్ష్య రగులుతున్నా ఆమెని బాధించాలని బాధతోనే అన్నాడతను.

"షటప్।" అరిచాడు కల్యాణ్.

"ఓఁ" పళ్ళు కొరికాడు. "కీచకుడిలా తయారయింది కాక యింకా నోరెత్తుతున్నావా? నేనిప్పుడు తలచుకుంటే యీ పళాన నిన్ను పాతెయ్యించగలను. టేక్ కేర్। అయాం సుధాకర్।"

కల్యాణ్ ఏదో అనబోయాడు. "బావా! నువ్వూరుకో!" అంది నింపాదిగా. ఆమెకి ఎక్కడలేని నెమ్మదితనం వచ్చింది. అతను నోరెత్తలేదు. ఇద్దర్నీ ఓ క్షణంపాటు చూసి "ఛీ!" అని అసహ్యంగా అనేసి కారు స్టార్టుచేసుకుని వెళ్లిపోయాడు సుధాకర్.

"ఇదీ ఒకందుకు మంచిదే!" అన్నాడు అంతదాకా కారు వెనకే నించునున్న నాగరాజు.

ఆ మాటకి ఇద్దరూ తెల్లబోయారు.

"రేపు జరగబోయే నాటకానికిది నాంది!"

"అంటే!"

"అతన్లో నీపై ప్రేమ యింకా చావలేదు. అందుకే ఆ వ్యంగ్యోక్తులు! నిజంగా అతను నిన్ను మరిచిపోయి — నిన్ను జీవితంనుంచి దూరంచేయాలనే అనుకుని వుంటే నిన్ను యిలా అవమానపరచడు. తనది కాదనుకున్న దానిపై ఎవరికీ అభిమానం వుండదు!"

కవిత మాట్లాడలేదు.

"కవితా! అతన్లో అనుమానం, అసూయ వుంది. పరిస్థితుల్నే విశ్వసించాడు. మనుషుల్ని నమ్మలేకపోయాడు. అందుకే అతను నిన్నూ - సుజాతనీ — మృదులనీ పెళ్లిచేసుకోవాలనుకున్నాడు!"

"ఇప్పుడింకెవరిని చేసుకుంటాడో!"

"అతనికి రిసార్ట్ యిచ్చే స్త్రీ కావాలిప్పుడు. నిజంగా ప్రేమించింది నిన్నొక్కత్తినే — సుజాత అతన్నిష్టపడితే - పెళ్లి చేసుకుందామనుకున్నాడు. ఆమె శీలాన్ని అనుమానించే పరిస్థితులు వచ్చేసరికి, తండ్రి చూసిన మృదుల మెళ్లో తాళికట్టేందుకి సిద్ధపడ్డాడు! అతను పసిపిల్లాడికంటే అన్యాయం. అతను మానసికంగా స్థిరచిత్తుడు కాడు!"

కవిత మాట్లాడలేదు. ముందుకి కదిలింది.

## 15

నిశ్చితార్థం ఏర్పాట్లు బ్రహ్మాండంగా చేశారు మధిరప్రసాద్. ఊళ్లో ప్రముఖులు, బంధువులు అంతా వచ్చారు. ఫలహారాలు ముగిశాయి. సుధాకర్ సోఫాలో తండ్రి ప్రక్కన కూర్చుని వున్నాడు. అతని ముఖంలో వెదికితే ఎక్కడో విషాదఛాయలు అంతరంగ తరంగాల్నించి ఎగిసి వస్తున్నట్టు కనిపిస్తాయి. ఎంత ఉత్సాహంగా వున్నా అది తెచ్చిపెట్టుకున్నట్టు ఎబ్బెట్టుగా అనిపిస్తోంది. సహజ నిసర్గసుందరమైన సంతోషం అక్కడ కనిపించటంలేదు.

డాక్టర్ మృదుల ఎదుటి సోఫాలో తల్లి ప్రక్కనే కూర్చుంది. ఆమెకి మరో వైపున వదినగారూ, ఆమె నానుకుని అన్నగారు, అటు పక్క తల్లి నానుకుని తండ్రీ కూర్చున్నారు నిశ్చితార్థానికి ముహూర్తం యింకా కొన్ని నిమిషాలు వుంది శాస్త్రిగారు పెళ్లికి తేదీ, ముహూర్తం నిశితంగా పరిశీలిస్తోన్నారు.

"మామయ్యా!"

మృదుల పేరూ, మనస్సూ, ప్రవర్తనే కాదు పలుకుకూడా మృదుమధురంగా వుంటుంది. ఎప్పటికీ మాయని చిరునవ్వు ఆమెకి పెట్టని అలంకారం.

"ఏమ్మా!" నవ్వుతూ అడిగారాయన.

"ఇప్పుడీ నిశ్చితార్థం యిలాగే ఆపేస్తే నష్టమేమిటి?" చిరునవ్వుతోనే అంది.

"ఇప్పుడేమిటమ్మా వేళాకోళం!"

"వేళాకోళం కాదు మామయ్యా! నన్ను ఇంతకు పూర్వమే పెళ్లైపోయిన వ్యక్తిని పెళ్లిచేసుకోమంటావా?" సూటిగా ఆయన కళ్లల్లోకి చూసి అడిగింది

ఆయన చప్పున మృదుల దగ్గరికి వచ్చాడు. చేయిపట్టుకుని, "అనారోగ్యంగా వుందా మృదులా!" అని ప్రశ్నించారు ఆందోళనగా.

"నాకేం కాలేదు మావయ్యా! మనస్సూ శరీరమూ రెండూ సరిగా వున్నాయి బుద్ధీ సక్రమంగానే పనిచేస్తోంది!"

"మరేమిటమ్మా ఈ మాటలు!" అసహనంగా అడిగారు. అందరూ కుతూహలంగా వింటూ వుండటంతో అది ఆయన స్టేటస్‌కి భంగకరంగా అనిపించింది.

"అవును మావయ్యా! సుధాకర్‌కి యింతకు పూర్వమే పెళ్లయిపోయింది. అతను మళ్లీ నన్ను పెళ్లిచేసుకుందుకి సిద్ధపడుతున్నాడంటే అది కేవలం మీ కోసం — మీ తృప్తికోసం!"

"మృదులా! ఆకాశంలో నిండు చందమామలాటివాడు నా సుధాకర్! అతని మీద అభాండాలు వేయటానికి ఎవరికి మనసొప్పింది? ఎన్ని గుండెలున్నాయ్ యిలా ప్రేలటానికి!" కోపంతో ఆయన కళ్లు, ముఖం అగ్నిశిఖలా వున్నాయి.

"బాగా చక్కగా పోల్చావు మామయ్యా! ఆ నింగిలోని జాబిల్లిలో మచ్చ వున్నట్టే యితని జీవితంలోనూ మచ్చ వుంది ఇతను కళంకితుడు—మామయ్యా నీ కొడుకు నువ్వనుకున్నంత అమాయకుడేం కాదు!"

"మృదులా!" గర్జించారు ఆయన ఆమె తలిదండ్రులు కూడా వారింప చూశారు.

"అవును! నిజం చెప్పాలంటే అతనికి పెళ్లికావటమే కాదు నిన్ను తాతయ్యని కూడా చేశాడు!"

"స్టాపిట్ !" గర్జించాడు సుధాకర్. "నాన్నా ? ఈ పెళ్లి నా కిష్టంలేదు. నిశ్చితార్థం కేన్సిల్ చేయండి. వన్నితంగా అవమానం పాలుచేసిన ఈమెకి తగిన సత్కారం చేద్దాం. దెబ్బకి దెబ్బ !"

"సుధాకర్ !" నింపాదిగా పిలిచాడాయన. అంతదాకా మృదుల మాటలు నమ్మీనమ్మనట్టుగా వున్న ఆయన కొడుకు కోపం చూడగానే, ఆ అర్థంలేని వాగుడు వినగానే ఇందులో ఏదో వుందనుకున్నాడు

"ఏమిటి నాన్నా !"

"నువ్వు నిజం చెప్పాలి !" అడిగాడు మధిర ప్రసాద్

"నిజమా !" ఆశ్చర్యంగా అడిగాడు.

"యస్ ! అయ్ వాంట్ ట్రూత్ !"

"ఏది నిజం నాన్నా ?"

"సుధాకర్ ! ఇది చిన్నపిల్లల వ్యవహారం కాదు. ఆషామాషీ కాదు. నువ్విప్పుడిక్కడే నిజం చెప్పెయ్యాలి. అదెంత భయంకరమైనదైనా సరే ! మృదుల చెప్పిందే నిజమయితే ఆ అమ్మాయి ఎక్కడ ? ఆ బేబీ ఎక్కడ ? లేదా అదంతా అబద్ధం అయితే చెప్పు - ఈ పెళ్లి కాన్సిల్ చేస్తాను. మరో సంబంధం చూస్తాను !" జడ్జిమెంటులాగా అన్నారాయన. ఆయన ముఖంనిండా స్వేదబిందువులు ఆణిముత్యాల్లా మెరుస్తోన్నాయి. బి. పి. పెరుగుతున్న మనిషిలా వున్నారు

"మావయ్యా ! మీరు ఎగ్జైట్ కాకండి. టేకిట్ యీజీ !" అంది మృదుల లేచి వెళ్లి ఆయన్ని సోఫాలో కూర్చోబెట్టి, చల్లని డ్రింక్ తాగించింది

"అంతా అబద్ధం !" మళ్లీ అరిచాడు సుధాకర్

"ఫోటోలు సాక్ష్యాధారాలు ! నువ్వు టేప్‌రికార్డులో చెప్పిన చిలకపలుకులు తూగని గుర్తులు !" నవ్వుతూ అంది.

"నాన్నగారూ ! ఇప్పుడు విజయవాడలో నాతో చదువుతున్న అమ్మాయిని కాదని తెచ్చారు కదా నన్ను. మళ్లీ ఆమెని ఎనిమిదేళ్లకి హైదరాబాద్‌లో చూశాను. నాలో ఆమెపై వున్న ప్రేమ మళ్లీ చిగుర్చింది ఆమె కూడా అన్నేళ్లుగా నాకోసం అలాగే వుందనుకున్నాను అలా నమ్మించింది. ఇద్దరం శాస్త్రోక్తంగా కాకున్నా, చట్టరీత్యా కాకున్నా వేంకటేశ్వరస్వామి ముందు - చిక్కడపల్లిలో దండలు మార్చుకున్నాం.

కొన్నేళ్లు కలసిమెలసి తిరిగేం —

"అయితే అప్పే మోసగత్తె - ఆమెకి నా డబ్బు మీద దృష్టే తప్ప - నాపై ప్రేమ లేదనిపించింది. నేనున్నప్పుడు నాతోపాటు తిరిగింది. నా కనుమరుగైతే ఆమె వరుసకి బావ అయిన అతనితో తిరిగేది. అతను అక్కడికి వచ్చేవాడట ఎప్పుడూ——

"ఆమెకి నెల తప్పింది నిజమే! కానీ ఆమెపై నాకు విశ్వాసంలేదు. దాదాపు సంవత్సరంగా నేను ఆమెని కలుసుకోలేదు. తలుచుకోలేదు. పూర్తిగా మరిచిపోయాను. నీతి, నిజాయితీ లేని ఆడదానికోసం నేనెందుకు బలికావాలి! నాకు ఆ అమ్మాయి అక్కర్లేదు ఆ అమ్మాయే కాదు - యిప్పుడిక ఎవరూ అక్కర్లేదు!"

అందరూ అతని మాటలు విని విభ్రాంతులై కూర్చుండిపోయారు. ఎవరికీ నోట మాట రాలేదు సుధాకర్ నిస్సత్తువగా తలవాల్చుక వుండిపోయాడు.

"మామయ్యా!"

తలెత్తి చూశారాయన.

"సుధాకర్ సగమే చెప్పాడు. అది పూర్తి నిజంకాదు!"

కనుబొమలు ముడివేశారాయన.

"నువ్వు చూస్తానంటే ఆమెని - యిప్పుడే పిలిపిస్తాను!"

"ఇక్కడే వుందా?"

"ఆఁ"

క్షణకాలం మౌనం వహించారాయన. తీర్పు చెప్పబోతున్న జడ్జిలా వుండిపోయారు. కొద్ది సేపయ్యాక "మృదులా! ఆ పనిచెయ్!" అన్నాడు నిశ్చల కంఠంతో.

మృదుల లేచివెళ్లి ఫోన్‌చేసింది.

అందరూ నిరీక్షిస్తూ కూర్చున్నారు.

మరో అరగంటకి సుజాత, మల్లీశ్వరి, జానికమ్మగారు, రాఘవయ్యగారు, కల్యాణ్, నాగరాజు వచ్చేశారు.

ముందు సుజాత తన కథ చెప్పింది. కల్యాణ్ తన విషయాలు వివరించాడు. నాగరాజు తను సుధాకర్‌కి ఏమేం చెప్పింది, ఎందుకోసం చెప్పింది వివరించాడు.

జానికమ్మా, రాఘవయ్యగారూ పదేళ్ల తమ మనోవ్యధ విన్నవించుకున్నారు.

క్షీరసాగర మధనం సమయంలో పరమశివుడిలా అంతా విన్నారు ఆయన.

కోడలివేపు చూశారు! అవును ఆ చూపులో ఆయన కవితని తన యింటి కోడలిని చూసినట్టుగా చూశారు. ఆ ఆప్యాయత, ఆ ఆత్మీయత, ఆ గౌరవం అన్నీ ఒక్క క్షణంలో గ్రహించుకుంది ఆమె.

"మామగారూ!"

ఆ పిలుపే ఆయన జీవననాడి స్పందింపచేసింది. ఆయన కళ్ళ వెలుగులని చిమ్మేయి. అది గమనించిన అక్కడివారందరికీ ఆయన నిర్ణయమేమిటో అర్థమైపోయింది.

దాదాపు పది సంవత్సరాల నిషిద్ధ ప్రదాయమూ, సంవత్సర కాలం అనుభవించిన వియోగమూ, పుత్రిక పుట్టేక తను పడిన క్షోభ, ఆ పిల్ల భవిష్యత్తు కోసం తను పడిన పాట్లు, ఈ మూడు నెలలుగా తను కన్నబిడ్డకై తపించిన తపనా అంతా కన్నీటిమయం చేసి చెప్పింది.

చివరికి ఆయన పాదాలపై వాలిపోయింది

కన్నీరు తుడుచుకుని, ఆమె కన్నీరు తుడిచాడు ప్రేమగా లేవనెత్తి.

"నువ్వు నమస్కరించవలసింది నాకు కాదమ్మా! ఇన్నాళ్లూ గ్రహణంపట్టిన ఆ సుధాకర్‌కి!"

వంగి నమస్కరించబోయిన ఆమెని మధ్యలోనే ఆపేడు సుధాకర్.



"కవితా! నన్ను మన్నించు!" అన్నాడు.

తల అడ్డంగా ఆడించింది కవిత.

అందరి కళ్లూ సంతోషాన్ని వర్షించాయి.

## 17

చంద్రసేనమ్మగారికి ఆ కాంపౌండ్‌లో అడుగెట్టటానికే ఎలాగో వుంది. ఆమెకి విషయాలన్నీ పూర్తిగా వివరంగా తెలిసాయి. ఆమె ముఖమాటపడుతూ

వస్తోంటే జానకమ్మగారు చూశారు. "రా! పిన్నీ!" అంటూ పిలిచారు. ఇక తప్పలేదు ఆమెకి.

నేరుగా సుజాత యింటికే వెళ్లిందామె' వెనగ్గా వెళ్లింది జానకమ్మ. ఆమె వాకిట నుంచుంది.

"సుజాతా! నేను తొందరపడ్డానమ్మా! నన్ను క్షమించు. సాటి ఆడదాన్నై కూడా నిన్ను అనరాని మాటలన్నాను."

తన మామూలు నవ్వుతో పలుకరించింది. "రండి! రండి! నే నప్పుడే చెప్పాను రాజు గారితో. నా మనసులో ఆ మాటలేం లేవు. మీరేం చింత పడకండి!" అంది.

"హమ్మయ్య! రక్షించావు. ఇప్పుడు చెప్పు. మా అబ్బాయిని చేసుకుందుకు నీ కేమయినా అభ్యంతరమా! వాడేమో నిన్ను తప్ప చేసుకోనన్నాడు. నాకూ సంపూర్ణంగా యిష్టమే!"

సుజాతకేం చెప్పాలో తోచలేదు.

"సుజాతా!" పిన్నిగారు వచ్చారు లోపలికి. "అసలు మా కవిత నివ్వాలను కున్నాను. అలా అయ్యాక సరిత నివ్వాలనుకున్నాను. అదేమో మామయ్యని చేసుకోనని భీష్మించుకుంది. ఇక కల్యాణికే ముడిపెట్టాలి. అంచేత నువ్వయినా నా తమ్ముడిని చేసుకోమ్మా!"

సుజాతకి ఎలాగో అనిపించింది. "కూర్చోండి! కాఫీ కలిపి తెస్తా"నంటూ లోపలికి వెళ్లి కాఫీ తెచ్చింది.

"బంగారంలాటి కాఫీ రోజూ నీ చేత్తో తాగే అదృష్టం కలిగించమ్మా!" అంది చంద్రసేనమ్మ.

"అప్పమ్మా! నువ్వు డైలాగులు తప్ప మామూలు మాటలు మాటాడవా? నీకేమో కాఫీ, మామయ్యకేమో గడ్డపెరుగు కావాలి. మీరూ యిక్కడికే మారి పొండి!" అంది ఇప్పుడే వచ్చిన సరిత.

"హోల్మయ్యవే రాస్కెల్!" అంటూ వచ్చాడు నాగరాజు. అతని వెంటే కల్యాణ్, గోపాలింగయ్యగారు వచ్చారు.

'అంతా కట్టకట్టుకుని వచ్చార'నుకుంది సుజాత.

"ఇదిగో సుజాతా! నాకు మొదటినుంచీ యితన్ని చూస్తే ప్రతినాయకుడిని చూసినట్టుగా వుండేది. కానీ యిప్పుడు హీరో అయిపోయాడు. సుధాకర్‌ని చూసినప్పుడల్లా హీరోగారిని దర్శించినట్టుగా వుండేది. సడన్‌గా ఆయన ఉప

నాయకుడై పోయాడు తన అనుమానాలతో ! నా మాట విని నువ్వు హీరోయిన్‌వి కావాల్సి !"

అందరూ ఫక్కున నవ్వేరు ఆ మాటలకి.

"నేనూ కొన్ని విలన్ పనులే చేశానండీ ! కల్యాణ్‌తో ప్లాన్ వేశాను. సుధాకర్‌కు యీమెని గురించి చాలా చెడుగా చెప్పాను. ఆయనేమో ఫైరై పోయాడు. చెడామడా తిట్టేసి, వీళ్ల నాన్నగారికి ఏకంగా ఉత్తరమే రాశాడు !"

"ఓహో !" అనుకుంది సుజాత.

"పదండి లోపలికి ! మన అమ్మాయి వద్దకి మనం వెళ్లటానికి సిగ్గుపడితే ఎలా ? తప్పయిపోయింది నిజమే ! ఇప్పుడు ఒప్పేసుకోడానికి పదండి !" అంతా ఆ మాటలకి వాకిలివైపు చూశారు.

సుజాత తండ్రిగారు ముఖమాటపడుతూ లోపలికి వచ్చారు. ఆయన వెనుకే సంప్రదాయంలో వున్న సౌందర్యలక్ష్మిలా వచ్చింది ఒకామె.

"పిన్నీ !" సంతోషంగా పిలిచింది సుజాత. ఆమె తండ్రిని చూడగానే "నాన్నా !" అని పిలిచింది ఆనందాతిరేకంతో.

"సుజాతా !"

"హమ్మయ్య! కన్యాదాత కూడా వచ్చేశారు. ఏమండీ నా పేరు రామలింగయ్య. మీ అమ్మాయి పనిచేసే ఆఫీసులో మేనేజర్ని. ఇతను నాగరాజు. మా ఆఫీసులోనే సెక్షనాఫీసరు. మీ అమ్మాయిని పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాడు. తెగ ప్రేమించేసి, యీమెని దక్కించుకునేందుకి నానా యాతనలు పడ్డాడు. జానకమ్మ గారికి వేలువిడిచిన తమ్ముడు !"

ఆయన ముఖం విప్పారింది. కూతురివేపు చూశాడు. సుజాత తలవంచుకుంది. ఆమె ముఖంలో యిష్టాన్ని చదవగలిగిన ఆయన నడిచివెళ్లి సుజాత చేయి అందుకుని నాగరాజు చేతిలో వుంచేడు.

అది చూసిన రామలింగయ్యగారు అందరి నవ్వులమధ్యా అన్నారు 'శుభమస్తు !'





# విలువ

'కవిత'

"రండి రండి మీ రిద్దరూ వొచ్చా రంటే ఏదో విశేషమున్నదన్న మాటే." ఆహ్వానించింది శకుంతల.

శ్యామలా నీరజా శకుంతల వేసిన చాపమీద కూర్చున్నారు. "మా విశేషం ఉంది కానీ_ నీ సంగతి చెప్పు "

"నా సంగతా ! ఏముందని ?" తెల్ల బోయింది శకుంతల.

"తలంటుకున్నావ్ పసుపు రాసు కుని "

శకుంతల సిగ్గుపడుతున్నట్లు తల వంచుకుంది.

"మా చెల్లి పెళ్ళి కుదిరింది పది హేను రోజుల్లో ముహూర్తం."

"ఎంత మంచి వార్త చెప్పావు !" అంటూ నీరజ ముఖంలోకి చూసింది.

నీరజ కన్నులలో కొత్త కలలు. ఆమెముఖంలో కొత్త కాంతులు. పెళ్లన గానే ఆడపిల్లలో ఎంత ఆశ ! ఎంత మార్పు !

"పెళ్లికొడుకేం చేస్తున్నాడు ?" శకుంతల నీరజనే అడిగింది.

సమాధానం_ శ్యామల చెప్పింది. "ప్రయివేటు కంపెనీలో గుమాస్తా. నెలకి అరువందరు జీతం."

"బాగుంది." అభినందిస్తున్నట్లంది.

కొంచెంసేపు కబుర్లు సాగాయి.

శకుంతల_ నీరజ ముఖాన్ని పట్టిపట్టి చూసింది, అవకాశం దొరికినప్పుడల్లా.

"వెళ్లొస్తా. బావగారు వచ్చే వేళ యింది." అంటూ లేచింది శ్యామల.

"బొట్టు పెడతా ఉండు." లోపలికి వెళ్లి కుంకుమ భరిణ తెచ్చింది. బొట్టు పెడుతూ_ అతి దగ్గరనుంచి_ మరీ పరి శీలనగా చూసింది నీరజ ముఖాన్ని. నీరజ కళ్లనిండా కమ్మని కలలు. ముఖంలో కొత్త కాంతులు.

ఆమె ఊహాలోకాల్లో తేలిపోతూంది. కాబోయే భర్తతో_గడపబోయే దాంపత్య

జీవితం గురించి ఏమేమి తీపికలలు కంటూందో!

వాళ్లిద్దరూ వెళ్లిపోయారు.

వాళ్లెందుకు వచ్చిందీ శకుంతల అర్థంచేసుకుందుకు ప్రయత్నించసాగింది. ఆడపిల్ల - ఏమీ దాచుకోలేని బేల. ముఖ్యంగా పెళ్లి గురించి. పెళ్లి కావడం ఆమె జీవితానికి పెద్ద పండుగ. ఏకైక గర్వ కారణం. ఆ సంగతి ఎవరికైనా చెప్పుకుంటే ఎంత ఆనందం కలుగుతుంది. శ్యామలా నీరజా వచ్చింది పెళ్లి కుదిరిందని చెప్పడానికే!

శకుంతల అప్రయత్నంగా ఒక్క నిట్టూర్పు విడిచింది.

ఆమె కన్నులలో హటాత్తుగా నీరు చిమ్మింది. చీరకొంగుతో తుడుచుకుంటూ లోపలకు నడిచింది. అద్దంముందు కూర్చుంది. ముఖానికి పౌడరు రాసుకుంది. బొట్టు తీర్చి దిద్దుకుంది. జడలో పూలదండ పెట్టుకోబోయి—అంతలోనే ఏదో జ్ఞాపకంవచ్చినట్లు ఆగిపోయింది.

శ్రీవారు రావాలి పూలదండ ముడవాలి. అప్పుడే అందమూ ఆనందమూ. ఇంకా రాలేదేం? భయంగా గడియారం వంక చూసింది.

ఆరుకి ఐదు నిముషాలు మాత్రమే ఉంది.

ఆఫీసు—ఐదుకి వదులుతాడు. బస్ కోసం మరో అరగంట అనుకున్నా యీపాటికి వచ్చెయ్యాలి. ఉదయం వారిని నిద్రలేపుతూ, పాదాలకు నమస్కరించింది.

"ఏమిటి విశేషం? ఓహ్? ఇవాళ ఫస్టు తారీకు జీతాల రోజనా!" కాఫీ కప్పు అందుకుంటూ నవ్వారు.

"ఇవాళ- మన మ్యారేజ్ డే" బాధపడుతూ గుర్తుచేసింది. ఇంతకంటె దురదృష్ట ఏం కావాలి? తను జ్ఞాపకం చేస్తే తప్ప 'మ్యారేజ్ డే' జ్ఞాపకం రాదు వారికి! ఈ రోజుకోసం వారం నుంచీ కలలు కంటూ ఎదురుచూస్తూ వచ్చింది తను. ఆయనకేమీ పట్టదు!

"ఓహో! నువు అదృష్టవంతురాలివి. పేదే నాచే మ్యారేజ్‌డే కనుక కొత్తచీర తేలిగ్గా వస్తుంది. సాయంత్రం వస్తూ తెచ్చేదా? నువ్వూ వస్తావా బజారుకి?"

"నేనూ వస్తాను."

ఆయన నవ్వుతూ- "ఆడవాళ్లకి సెలక్షన్ మీద నమ్మకం తక్కువ. కాని—శకుంతలా మీ చీరెలకు బ్లౌజులకూ డిజైన్లు వేసేదీ రంగుల కాంబినేషన్ నిర్ణయించేదీ మగవాళ్లే సుమా!" అన్నారు.

ఆయన మీద జాలివేసింది. కోపమూ వచ్చింది.

నమ్మకం లేనిది- మీ సెలక్షన్ మీద కాదు మీమీదే అని సూటిగా చెప్పేద్దామన్నంత ఆవేశం వచ్చింది. ఏలాగో నిగ్రహించుకుని—మౌనంగా ఊరుకుంది.

"సరే పావుతక్కువ ఆరుకి వచ్చేస్తాను." అన్నారాయన.

సందేహిస్తున్నట్లు చూస్తూ— "ఇవాళ పేడే." అంది తను.

సమాధానం చెబుతున్నట్లే—"మ్యారేజ్ డే—" అన్నారు వారు నవ్వుతూ. తను నమ్మలేకుండా ఉండలేకపోయిందిక. సాయంత్రం వారు ఆఫీసునుంచి వచ్చాక ఏం చెయ్యాలో ఎలా గడపాలో ఊహించుకోసాగింది. ఊహాలు ఎంత తియ్యగా ఉంటాయి కొన్ని కలలలాగ!

ఏదో గుర్తువచ్చినట్లు - వంటిట్లోకి పరుగెత్తింది శకుంతల. పొయ్యిమీద నీళ్లు మరిగిపోతున్నాయి. వారు వస్తే తలంటి స్నానం చేయిద్దామని వేన్నీళ్ల పెట్టింది. ఆరయింది కాని వారి జాడ లేదు. ఏం చెయ్యాలి?

వారు వస్తారు. తలంటి_టిఫిను పెట్టి_ బజారుకి బయలుదేరదీస్తుంది. వారు తన కొరక చీర కొంటారు. తను వారి కొరకజత రెడీమేడ్ బట్టలు కొనిపిస్తుంది. ఇంటికి వచ్చి కొత్త బట్టలు వేసుకొని_ ఏ హోటల్లోనో భోజనం చేసి_ సినిమాకి వెళ్తారు. తిరిగి వచ్చాక మధురంగా గడుపుతారు. ఇలా ఊహించుకుంది తను_ మ్యారేజ్ డే చక్కగా గడపాలని.

పురిట్లోనే సంధికొట్టినట్లు- వేళకు వారు రానేలేదు.

తను ఎప్పుడూ వారినేమీ అడగదు. ఇవాళ మ్యారేజ్ డే కనుక త్వరగా యింటికి రమ్మంది. ఈ చిన్న కోరిక తీర్చడం కూడా వారికి అసాధ్యమై పోతూంది!

శకుంతలకి దుఃఖం వచ్చింది. పెళ్లి రోజుపూటా కన్నీరు పెట్టడం యిష్టంలేక ఆపుకుంది. ఏం చేయాలో తోచక అటూ యిటూ తిరగసాగింది వీధిలోకి ఇంట్లోకి.

చీకటి పడుతుంది.

వారు రాలేదు.

ఆమె మనసులో ఏవేవో అనుమానాలు.

వారెక్కిన సిటీ బస్‌కి ప్రమాదం జరుగలేదు కద?

వద్దు భగవాన్ అలా జరుగకుండా చూడు. నేను నిన్ను కోరుకునేది వారి క్షేమమే. నా ప్రార్థన మన్నించు.

గదిలోకి వచ్చిందామె. మంచం దుప్పటిమీద మల్లెపూలు నీటుగా అందంగా తయారుచేసి ఉంచింది. దాన్ని చూసేసరికి మళ్లీ దుఃఖం వచ్చింది. తన ఆశలూ కలలూ ఊహాస్వర్గాలూ అన్నీ వ్యర్థమేనా?

గడియారం తన విధి తను నిర్వర్తించుకుంటూ పోతుంది.

కాలం — రాత్రి గడిచిపోతూంది. వారింకా రాలేదు.

ఈపాటికి వేడినీళ్ల చల్లారిపోయే ఉంటాయి తన ఆశలలాగ చప్పగా— అనుకుంది శకుంతల. ఇంక ఆమె ఏడుపు ఆపుకోలేకపోయింది.




గదిలో దీపమయినా వేసుకోలేదు. చీకటిలోనే కూర్చుందామె.

జీవితంమీద విరక్తీ అసహ్యమూ కలగసాగా యొక్కసారి ఆమెలో.

ఏం బ్రతుకిది? అతి చిన్న కోరిక కూడా తీరనంత- నిస్సార జీవితం!

ఎందుకిలా బ్రతకడం? సాధించాలని? శాపంలాటి ఎడారిలాటి యీ బ్రతుకు బ్రతకడం కంటె ఒక్కసారి ఉరి పోసుకు చావడం మేలు కాదూ? బ్రతకడానికీ - చావడానికీ తేడా ఏముందని తన విషయంలో?

తను బ్రతుకుతున్నదే జీవచ్ఛవంలా.

వివాహమయినా తను ఒంటరిది! ఎటువంటి శాపమిది!

దేముడికి తనంటే నిర్దయే కాబోలు. లేకపోతే తనకొక చిన్న పాపాయినిచ్చి ఒంటరితనం నుంచి నిష్కృతి కలిగించేవాడు కాదూ?

ఎనిమిది.

ఎటువంటి దుస్సహమూ దుర్భరమూ అన పరిస్థితి.

పెళ్లిరోజు సంతోషంగా సుఖంగా వారితో గడపడానికి బదులుగా- చీకటిలో ఒంటరితనంలో దుఃఖంలో మగ్గిపోవలసిరావడం.

కన్యగా ఎన్ని కలలు కంది!

వివాహమంటే - జీవితాని కత్యంత సుందరమయిన మలుపే అనుకుంది.

శ్రీవారితో కాపురం-స్వర్గలోకవాసమే అనుకుంది.

బ్రతుకంతా అద్భుతమయిన అనుభూతులూ అనుభవాలూ అనుకుంది.

ఏవీ ఆ కలలు?

ఏవీ ఆ ఆశలు?

తొమ్మిది.

గడియారం తనని చూసి వెక్కిరిస్తున్నట్లే అనిపించింది.

లేచివెళ్లి - తలుపులువేసి వచ్చింది.

ఏం చేయడానికి పాలుపోవడం లేదు.

అలంకరించిన మంచం తనని హాస్యం చేస్తున్నట్లే అనిపించింది. ఆమె మనసు జ్ఞాపకాలకు చోటివ్వసాగింది.

ఐదేళ్ల క్రితం

సరిగ్గా యిదే రోజు

కొన్ని గంటలలో ముహూర్తం.

హడావిడి

ఆనందం

ఆర్భాటం

పట్టుచీరలతో పసుపుపారాణిలతో

కోటి కలలతో శతకోటి ఆశలతో

మనసంతా కాబోయేవారిని నింపుకుని ఔను.

అప్పటికి_వారిగురించి ఉన్న ఊహలే. ఆశలే. కలలే.

వారి గురించి అసలేమయినా తెలిసి ఉంటేగా ?

పెళ్లి చూపులలో_ఒకే ఒక్క_సారి_ సిగ్గుతో కనులు వాలిపోతూంటే ఎలాగో క్రీగంట ఒకే ఒక్క_ చూపు కెమెరా క్లిక్ మన్నట్లు ఒక్క_చూపుకే వారు తన హృదయం మీద ప్రస్ఫుటంగానూ శాశ్వతంగానూ ముద్రించబడి

ఇక వారి సన్నిధి కెప్పుడు ఎంత త్వరగా చేరుతానా అని ఆరాటం. చదవ బోయే ఉత్తరంలా...వినబోయే పాటలా చూడబోయే దృశ్యంలా_ఎంత ఊరిం చారు వారు ?

అప్పుడు_వారిగురించి ఏమీ తెలియదు. కలలూ ఆశలూ ఊహలూ తప్ప. ఇప్పుడు_ వారి గురించి ఆశలు లేవు . కలలు లేవు ఊహలు లేవు. ఇంత కంటె దౌర్భాగ్యమూ దురదృష్టమూ ఏమిటి ? కలలూ ఆశలూ లేని జీవితం కంటె తీరని శాపమేముంటుంది మనిషికి? స్త్రీకి.

ఈ చిన్న నిజం_వారెందుకు గ్రహిం చరు ?

గ్రహించి_తనకీ కొంచెం జీవితం ఎందుకు ప్రసాదించరు ?

తనకీ ఓ మనసుందని ఆ మనసుకీ కోరికలూ సరదాలూ ఉంటాయని నిజంగా వారికి తెలియదా ? తెలిసినా నిర్లక్ష్యమా ?

తన జీవితంలో ఆలోచనలలో కొంచెమయినా చోటివ్వడానికి సిద్ధపడని మగవాడు అసలు పెళ్లెందుకు చేసుకో వాలి ?

పంచుకోకుండా_ జీవితమంతా తనకే ఉంచుకుందా మనుకునే స్వార్థపరుడికి వివాహం చేసుకునే అర్హత ఎక్క_డుంది?

స్త్రీ స్వేచ్ఛ నంతటినీ హరించి తను మాత్రం విశృంఖలంగా విహరించ గలిగే అధికారం మగవాడి కెక్క_డిది ? ఎలా సంక్రమించింది ?

భార్యను బానిస చేసి_ తను మాలిక్

కావడం సిగ్గుమాలినతనంగా తోచదా మగవాడికి? వివాహంలో —ఎన్ని వాగ్దానాలు చేస్తాడు! ఒక్కటి నిలుపుకోడే తరువాత! సిగ్గు వెయ్యదూ?

తనని నమ్ముకుని—స్వజనాన్నీ సర్వస్వాన్నీ వదులుకు వచ్చిన స్త్రీ— తన మూలంగా సుఖపడలేక దుఃఖభాజనురాలౌతుందంటే— ఆ భర్త అహం దెబ్బ తినదూ? అతని పౌరుషానికి లోటు కాదూ?

పది.

ఇంక పూర్తిగా అలిసిపోయింది శకుంతల ఆలోచించి ఆలోచించి. కన్నులవెంట నీరు కారుతున్నా తుడుచుకోకుండా కటిక నేల మీద వాలిపోయింది.

ఆమెకు నిద్ర మాత్రం రావడంలేదు. జీవితంలో పూర్తిగా దగాపడిపోయినట్లు భావన కలుగుతూ హృదయం నలిగిపోతూంది. ఏమిటీ జీవితం అనిపిస్తుంది. చీకట్లోనే— పైకి చూస్తూ ఉండిపోయింది. ఎంత వద్దనుకున్నా ఆమెలో ఆలోచనలు రావడం మానలేదు. బ్రతుకు భారంగానూ నిష్ఫలంగానూ తోచసాగింది.

రాత్రి గడిచిపోతూంది.

పదకొండు

పన్నెండు

శకుంతలకి— కోపం వస్తూంది చిరాకు వేస్తూంది. దుఃఖం వొస్తూంది.

నిద్ర మాత్రం రావడం లేదు. ఎలా వస్తుంది

ఆశాభంగం— నిద్రపట్టనివ్వదు. మనిషిని నిలువ నివ్వదు. మనసును కుదురుగా ఉండనివ్వదు.

"షకున్‌త లా "

పిలుపు వినిపించక పోలేదు.

ఐనా ఆమెకు లేచివెళ్ళి తలుపు తీయ బుద్ధి కాలేదు. ఒక విధమైన వైరాగ్యమూ నిర్లిప్తతా అనాసక్తతా ఆమె నావరించాయి. ఈ జీవిత మింతే అన్న విరక్తి నిండిందామెలో.

"షకుంతలా!" పిలుపుతో పాటు తలుపు మీద బాదాడు. విసుక్కుంటూ వెళ్ళి తలుపు తీసింది.

"నిద్దరపోతున్నావా?"

ఆమె సమాధానం చెప్పలేదు.

అతని నుంచి వచ్చిన విస్కీ వాసనకి ముఖం చిట్లించుకుంది.

"కోపమా?"

నా బ్రతుక్కొక్కటే తక్కువ. పేదవాని కోపమూ ఆడదాని కోపమూ పెదవికి చేటు. అంతే.

"చీర తేలేదనా? "

ఇంక శకుంతల నిగ్రహించుకోలేకపోయింది. అతని దృష్టిలో తానేమిటి? ఎంత అల్పమైన అభిప్రాయం తనంటే! ఈయనేకాదు చాలామంది మగవాళ్ళంతే. స్త్రీ అంటే చీరలూ నగలూ అని. కాని— నిజం వారికి తెలియదు. వారి ఆలోచనలు అంతకంటె లోతుగా సాగవు. వారి అజ్ఞానానికి జాలిపడి ఊరుకోవలసిందే.

స్త్రీని అంతకంటె అధికంగా అర్థం చేసుకోగలిగే మెదడూ హృదయమూ వారి కుండవు. దాసుని తప్పులు దండంతో సరి అన్నట్లు- చేసిన పొర పాట్లని ఓ చీరతో సరిపెట్టబోతారు.

కాని- తనకి కావలసింది కొత్త చీర కంటె అధికమైన విలువగల అనుభవం. వాళ వేళకి యింటికి వస్తే- సరదాగా కబుర్లు చెప్తే- తనకెంత సంతోషం కలి గేది ! ఆ ఆనందం విలువెంత ? అది- ఆయన కర్థంకాదు. అదేమి దురదృష్టమో ఫ్రండ్స్‌తో గంటలకి గంటలు బాతాకానీ వేసేవారికి తనతో చెప్పడానికి కబుర్లే ఉండవు ! ఎక్కడయినా పూటలకి పూటలు తేలిగ్గా గడిపేయగలిగేవారికి - యింట్లో అరగంట తోచదు !

"సారీ షకూ ! మరచిపోయాను... ఇవాళ మ్యారేజ్ డే కదూ ?"

"పన్నెండు దాటింది. తేదీ మారింది. . మ్యారేజ్ డే ముగిసింది" కసిగా అంది.

"రియల్లీ సారీ ! ఏమీ చేసేది ? ఫ్రండ్స్ బలవంతం చేశారు. మందు పార్టీ చేసుకున్నాం. శాటర్‌డే కదా ? ఖుషీ చేశాం. అఫ్‌కోర్స్ పేకాట ఆడు కున్నాం టైం తెలియలేను "

శకుంతల కోపం తారస్థాయినందు కుంది.

భర్తను చూస్తున్నకొద్దీ వొళ్లు మండి పోతూంది. అతని వివరణ వింటూంటే వొంటికి కారం రాసుకుంటున్నట్లే ఉంది.

"చాలా వేళయింది పడుకోండి-"

"థ్యాంక్స్ క్షమించావు కదూ నిద్దరొస్తూంది గుడ్‌నైట్ "

శకుంతల దీనంగా చూసింది ఔను. నిద్రపోతూ గడిపే రాత్రులే నయం. మేలుకునే పగలు ఏమాత్రమూ ఆనంద దాయకంగా ఉండదు. ఉండాలని విష్ చేసుకోము. మనకి గుడ్‌నైట్‌లే కాని గుడ్‌డేలు లేవు.

"షకూ ! ఫ్రండ్స్ అడిగారు కనుక కానీ లేకపోతే " నిషాలో ఏదో అంటూనే ఉన్నాడు అతను.

అతని మాటలు కుంటిసాకులు ఆమెకు వినిపించడం లేదు.

ఆమె హృదయం విషాదభరితమై ఉంది.

అతి తీవ్రంగా అవమానించబడినట్లు ఆమె మౌనంగా మిగిలిపోయింది.

ఆమె గుండెలు దహించుకు పోతు న్నాయి.

ఆమె ఆశలు సమూలంగా నశించి పోయాయి.

ఒక్కసారి —

శకుంతలకు-నీరజ జ్ఞాపకంవచ్చింది. పెళ్లి కాబోతూందన్న ఆనందంలో తేలి పోతున్న నీరజ

జాలిగా సానుభూతిగా అను కుంది శకుంతల.

పిచ్చి నీరజా ! అమాయకంగా పెళ్లంటే ఆనందిస్తున్నావు కానీ రేపు ఎదురవబోయే జీవితం యిలాగే




ఉంటుంది. వేలకొద్దీ కట్నం యిచ్చి నీ జీవితాన్నే అర్పిస్తావు మగవాడికి. అతని దృష్టిలో నీ విలువ అత్యల్పం. మిత్రులు కోరితే పార్టీ కుండిపోతాడు. భార్య వేడుకున్నా ఆమె మొర వినుపించుకోడు. నువ్వతని కోసమే ఆలోచిస్తూ పరితపిస్తూ ఎదురు చూస్తూ క్షణక్షణమూ భారంగా గడుపుతావు. అతను నీ ధ్యాసేలేకుండా గంటలూ రోజులూ స్నేహితులతో కాలక్షేపం చేస్తాడు. నీ సర్వస్వమూ అతని కర్పించుకుంటావు. అందుకు ప్రతిఫలంగా అతను కొంచెమయినా తనని నీకు అందనివ్వడు. అతనే నీకు సర్వసం. నువ్వతని కేమీ కావు. లోకంలో చాలా దాంపత్యా లింతే పెళ్లి- మగవాడికే అన్ని లాభాలనూ, ఆడదాని కన్నీ కష్టాలనూ కలిగిస్తుంది. తీపిపూతని చూసి లొట్టలు వేసుకుంటున్నావు.కాని అతికొొందరలోనే సంసారపు తీపిపూత కరిగిపోయి చేదు మిగులుతుంది. అది మింగుతూ బాధపడవలసిందే జీవితాంతమూ. వివాహం- స్త్రీని పురుషుడి వెంట పరుగెత్తిస్తుందే తప్ప పురుషుణ్ని స్త్రీతో సుందరంగా బంధించడంలేదు. అదే వ్యవస్థలో లోటు వివాహంతో-నీ కలలూ-ఆశలూ అన్నీ స్టాప్ సారీ నీరజా! ఆడపిల్లగా నీ భవిష్యజ్జీవితం ఇలాగే సాగుతుందేమో. అందుకే సాటి ఆడదానిగా నీమీద జాలిపడకుండా ఉండలేకపోతున్నాను. ఈ బంగారుపంజరంలోకి మరో బందీగా రాబోతున్న నిన్ను చూసి జాలిచెందకుండా ఉండలేకపోతున్నాను. ఐనా- నీకు శుభాకాంక్ష లందివాలని ఉంది. నీ అదృష్టం ఎలా ఉందో? నీరజా విష్ యు బెస్టాఫ్ లక్ నాలాగ కాక నువ్వయినా సుఖసంసారానికి నీకు విలువున్న దాంపత్యానికీ నోచుకో.

———

# నాకు నచ్చిన నా కథ



చదివింది తక్కువే అయినా, అతి చిన్న వయస్సులోనే కథారచన చేయడం ప్రారంభించాను. చిన్న వయస్సులో రాసిన కథలు : ఇంగితశూన్యులు, గాయపడిన మది, నిరీక్షణ, పగ, 'డబ్బు! డబ్బు!' ఈ కథలన్నింటిలో నాకు బాగా నచ్చినది "పగ." తర్వాత చదువులో మునిగిపోయాను. కథారచనకి కొంత అంతరాయం ఏర్పడింది. చదువు ముగించాక మళ్ళీ కథారచన ప్రారంభించాను. ఫలితంగా డెబ్భై కథలు, పాతిక వ్యాసాలు, ఆరు కవితలు, ఆరు నవలలు, మూడు నాటికలు రాశాను. నా కథలు, వివిధ పత్రికలలో ప్రచురింపబడ్డాయి. చిన్న వయస్సులో అతిస్వల్ప వ్యవధిలో రాసిన ఈ "పగ" నాకు నచ్చింది.

మరి ఇక పాఠకుల అభిప్రాయం కూడా తెలిపితే సంతోషిస్తాను.

ఇట్లు
బద్దెపూడి సుధారాణి
చీరాల

# పగ

"సత్తిరాజు నోట్లో చుట్టతీసి తుపుక్కున ఊసి కండువా తీసి గట్టిగా దులిపి భుజంమీద విసురుగా వేసుకుని, ఇదే ఆఖరిసారి అన్నట్లుగా వెంకట్రామయ్య ముఖంలోకి చూస్తూ అడిగాడు. సత్తిరాజు కళ్ళల్లో ఎర్రజీరలు చూచి వులిక్కి పడ్డాడు వెంకట్రామయ్య.

"ఏం బావా! ఇంక కాదన్నమాటేగా నీవు అనబోయేది?" కటువుగా వుంది సత్తిరాజు మాట్లాడిన తీరు.

"నా చేతుల్లో ఏముంది సత్తిరాజూ? అంతా వాడి యిష్టం. నేనేం చేసేది?" వెంకట్రామయ్య అమాయకత్వం పులుముకుని ముఖంలో తన తప్పు ఏమీలేదు

యింరదులో అన్నట్లు దీనంగా మాట్లాడాడు. వెంకట్రామయ్య నక్క-వినయానికి, సత్తిరాజుకి వళ్లు భగ్గుమని మండింది. రోషంతో వుడికిపోయాడు.

"ఇదిగో. ఆఖరిసారిగా చెబుతున్నాను. ఎంత అయినా, తెలిసినవాడివి, కావల్సినవాడివి.

"పదివేలు ఇస్తాను. కాదనకు. ఆలోచించుకో. కాదు, కూడదు అనుకున్నావంటే బంధుత్వాలు దూరమయినాయని బాధపడితే మాత్రం ప్రయోజనం లేదు. చివరికిగాని తెలిసిరాదు." అంటూ, సత్తిరాజు నోట్లో చుట్టతీసి దూరంగా విసిరికొట్టి, గాండ్రుమని కేకరించి, వుమ్మేసి బయలుదేరాడు, వెనక్కి తిరిగి చూడకుండా.

వెంకట్రామయ్య రెండు చేతులతో నుదురు రుద్దుకుంటూ ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"ఏమిటండీ, ఒంట్లో బాగుండలేదా? అట్లా కూర్చున్నారు." అంటూ వచ్చింది భార్య లక్ష్మమ్మ.

"ఒంట్లో బాగుండక పోవటమేం కర్మ. నిక్షేపంగా వున్నాను."

"సత్తిరాజు వచ్చి వెళ్ళాడు చూచావా?"

"ఏమిటీ? సత్తిరాజు అన్నయ్య వచ్చి వెళ్ళాడా? నా మతి మండిపోనూ. నేను ఇందాకటి నుండి పక్కింట్లో కూర్చున్నానులెండి. ఏమిటి విశేషం. పిల్లదానికి పెళ్ళిగాని ఏమన్నా కుదిరిందటనా?" అమాయకంగా అడిగింది. లక్ష్మమ్మ భర్తముఖంలోకి చూస్తూ.

"నీ తెలివి తెల్లారినట్లే వుంది. దానికి కుదిరితే మనకీ బాధ ఎందుకే? అందుకే వచ్చాడు. మన హరికి తన కూతుర్ని ఇస్తాడుట. పదివేలు యిస్తానంటున్నాడు." ఎగతాళిగా అన్నాడు వెంకట్రామయ్య.

"అదేమిటండి అట్లా అంటారు? ఇంతదానికే అంత విచారమెందుకు? సంతోషించాల్సింది పోయి. పది వేలంటే మాటలా? పైగా సత్తిరాజు, మీరూ చిన్ననాటి నుండి ప్రాణస్నేహితులు కూడాను. ఎందుకు అనవసరంగా మీ మధ్య స్నేహం పోగొట్టుకోవటం? సత్తిరాజు భార్య సుశీలమ్మకూడ మంచి ఇల్లాలే. పిల్ల నలుపేగాని బుద్ధిమంతురాలు. చదువు అంటే అబ్బలేదు. పోనీలెండి ఒక్కగా నొక్క కూతురు. సత్తిరాజు, సుశీలమ్మ పోయాక, ఆ వున్న కాస్త ఆస్తి దానికే కదా? ఏమంటారు?" లక్ష్మమ్మ నెమ్మదిగా అన్నది. వెంకట్రామయ్య ఏం చెబుతాడో అని ఆశగా చూస్తూ.

"చాల్లె నీ ఉపన్యాసం యింక అపు...." వెంకట్రామయ్య అరుపులకి అదిరి పడింది భార్య లక్ష్మమ్మ.

"చదువు చట్టుబంతలు లేవు. పైగా నలుపు. ఛీ....ఛీ.... ఆ పిల్లని బోడి పదివేలకి ఒప్పుకుని చేసుకోవటమా?

"మనవాడి ధర యాభై వేలు పలకవల్సిందే. యివ్వవలసిందే. సత్తిరాజు సంబంధం నా కెందుకు, ఈ వెంకట్రామయ్య అంత తేలిగ్గా ఒప్పుకునే రకం కాదని తెలియాలి. స్నేహమంటే స్నేహమే, డబ్బు దగ్గర మాత్రం ఈ స్నేహాలు కుదరవని తెలియదేమో." వెంకట్రామయ్య హేళనగా అంటున్న మాటలకి లక్ష్మమ్మ బిత్తరపోయి చూసింది.

ఇరుపక్షాలవాళ్ళు ఇంత పట్టుదలలుగా వుంటే మధ్య తను కల్పించు కోవటం బాగుండదేమో అనుకుంటూ చిన్నగా లేచి వంటగదిలోకి పోయి అన్నం వుడుకుతుంటే, పొయ్యి మంట సరిచేస్తూ కూర్చుంది. ఏమిటో ఆలోచ నలు మనస్సుని గందరగోళ పెడుతున్నాయి. ఎటువంటి ప్రాణస్నేహితులు ఎట్లా అయినారోనని లక్ష్మమ్మ తెగ బాధపడిపోయింది.

ఉన్నవాళ్ళలో ఆ ఊరి పెద్దలుగా చెలామణి అవుతున్నారు.

వెంకట్రామయ్య, సత్తిరాజులు, ఒకరికొకరు ప్రాణంగా వుంటారు. ఆ ఊళ్ళో వాళ్ళ చేతులమీదుగా జరగాలి ముందు ఏ పనైనా, మంచిగాని,చెడుగాని.

సత్తిరాజుకి ఏదో కొద్దిపాటి పొలం, ఒక ఇల్లు, రెండు గేదెలు వున్నాయి. మాట మంచితనంతో నెట్టుకొస్తున్నాడు పెద్దమనిషిగా.

వెంకట్రామయ్యకి తన ఆస్తికొక భార్య తరపున పది ఎకరాల పొలం వచ్చింది. మొత్తం డెబ్బై ఎనభై వేలదాక క్యాష్ వుంది. ఒక్కగానొక్క కొడుకు హరిని పట్నంలో మెడిసిన్ చదివిస్తున్నాడు. హరి అందమైనవాడే, తండ్రి అజ్ఞలేనిదే అడుగు అయినా వేయడని పేరు.

సత్తిరాజు కూతురు విశాలి నలుపు. అయినా, సన్నగా నాజూగ్గా వుంటుంది. వినయంగా వుంటుంది. ఆడపిల్లకి ఏం చదువుల్లే, చదివించినా ప్రయోజనం ఏమిటి? వంట చేయకుండా తప్పదుకదా? అన్నట్లు సత్తిరాజు కూతుర్ని చదివించలేదు. భార్య పోరగా, పోరగా ఐదు క్లాసులవరకు చదివి ఆపేసింది. సత్తిరాజు-వెంకట్రామయ్య మంచి స్నేహితులే కాకుండా ఒకర్ని ఒకరు, బావా, బావా అని పిల్చుకోవటంతో, ఇద్దరూ దగ్గరవాళ్ళే అనుకునేవాళ్ళు అంతా. హరి విశాలకూడా ఎంతో చనువుగా ఉండేవాళ్ళు. హరికి విశాలినిచ్చి పెళ్ళిచేస్తారనే

వదంతులుకూడా వున్నాయి. ఆ నోట ఈ నోటా విశాలి తరువాత పిల్లలు లేక పోవటం, హరి తరువాత కూడా లక్ష్మమ్మకి పిల్లలు లేకపోవటంతో ఇద్దరూ గారాబంతో అపురూపంగా పెరిగారు.

సంబంధాల కోసం చెప్పులు అరిగేలా తిరిగే పని తప్పినందుకు ఎంతగానో సంతోషించాడు సత్తిరాజు. తన అల్లుడుగా హరినే మనస్సులో వుంచుకున్నాడు సత్తిరాజు.

"బావా! నీవు తెల్లగా చక్కగా వుంటావు. నల్లగావున్న నన్ను చేసు కుంటావా? చదువుకున్నవాడివి. చదువులేనిదాన్ని నన్ను చేసుకుంటానికి నీ మనస్సు ఒప్పుతుందా?" అని చిన్నగా అడిగేది విశాలి.

"ఛ....అలాంటి ఆలోచనలేమీ పెట్టుకోకు. బాహ్య సౌందర్యం ఎవరికీ అక్కర్లేదు. ఆత్మసౌందర్యం కావాలి విశాలా! చదువు లేకపోయినా సంస్కారం వుంటే చాలు. అనవసరమైన ఆలోచనలతో మనస్సు పాడుచేసుకోకు," అని ఓదార్చేవాడు హరి. ఆ మాటలకి పొంగిపోయేది విశాలి, బావ ఎంత మంచి వాడు అనుకుంటూ.

విశాల పెద్దది అవుతున్నకొద్దీ, సత్తిరాజుకి విశాలి పెళ్ళిగురించి ఆలోచనలు ముసురుకునేవి. హరిని ఎప్పటికప్పుడు అడగాలనుకునేవాడు సత్తిరాజు. కానీ అంతలోనే అనుకునేవాడు, మన చేతిలోవాడు భయమేమిటిలే, నామాట కాదంటాడా! అని.

ఒకరోజు హఠాత్తుగా అడిగాడు హరిని సత్తిరాజు పిలేసి, విశాలితో అప్పటి దాకా చెస్ ఆడి ఇంటికిపోతున్న హరిని.

"హరీ! ఒకసారి ఇటురా! నీతో మాట్లాడాలి."

"ఏవిటి మావయ్యా! నాతోనా మాట్లాడటం?"

"అవునురా! నీతోనే, నీ గురించే!"

"నా గురించా?" బిత్తరపోయాడు హరి, ఈ హఠాత్తు పరిణామానికి.

"అవును నీగురించే. యం.బి.బి.యస్.లో చేరావు. ఇది మొదటి సంవత్సరమే అనుకుంటాను. యింకా నాలుగైదేళ్లు చదవాలి కదా? విశాలికి అప్పుడే పందొమ్మిది ఏళ్లు వచ్చాయి. ఇంకా వుంచటం భావ్యం కాదు, పెళ్ళి చేయ కుండా. విశాలికి ఆ మూడు ముళ్లు వేయిస్తే నాకు బాధ వుండదు. నాకు కొంత బరువు తీరినట్టూ వుంటుంది ఏమంటావు?" అంటూ జవాబుకోసం హరి ముఖం లోకి ఆత్రంగా చూస్తూ కూర్చున్నాడు సత్తిరాజు.

హరి చిత్రంగా నవ్వాడు.

"నాదేముంది మావయ్యా! అంతా నాన్న ఇష్టం. నాన్న మాట కాదనేందుకు లేదు, నాన్న ఇష్టమే నా ఇష్టం." హరి చిరునవ్వుతో చెప్పినదానికి, "అంతేనా? నీ ఇష్టాఇష్టాలతో ప్రమేయం లేదా?" అని బాధగా చూచాడు సత్తిరాజు.

చెప్పవలసింది ఇంకేమి లేదన్నట్లు వెళ్ళటానికి ఉద్యుక్తుడైనాడు హరి.

మౌనంగా కూర్చున్నాడు సత్తిరాజు, హరి వెళ్ళటం చూచి

హరి ఇల్లు చేరేసరికి బాగా పొద్దుపోయింది.

తండ్రి వెంకట్రామయ్య వాకిట్లోనే ఎదురైనాడు.

హరి కొంచం గాబరాపడ్డాడు తండ్రి ముఖం అదోలా వుండటం చూచి.

"హరీ! సత్తిరాజు ఇంటినుండేనా రావటం?"

"అవును నాన్నా!"

"రేపటినుండి నీవు వాళ్ళయింటికి వెళ్ళటం తగ్గించాలి."

"ఏం నాన్నా?"

"నీకు తెలియదు. ఆ సత్తిరాజు తన కూతురికి నిన్ను కట్టబెట్టాలని చూస్తున్నాడు. నాకు ఆ సంబంధం యిష్టంలేదు. నీవా కాబోయే డాక్టరువి ఈ క్షణాన నీకు యాభైవేలు యిస్తారు. అటువంటి అవకాశాలు పోగొట్టుకోవద్దు. సత్తిరాజు యిచ్చే ముష్టి పదివేలకి లొంగటమా? ఏమంటావు?" అన్నట్లు చూచాడు కొడుకు ముఖంలోకి వెంకట్రామయ్య.

హరికి తండ్రిని ఎదిరించే ధైర్యం లేదు, సర్దిచెప్పే శక్తిలేదు.

"నీ యిష్టం నాన్నా!" అంటూ తలొంచుకుని వెళ్ళిపోయాడు.

"కొడుకు అంటే వీడే. తండ్రికి తగ్గ కొడుకు." మీసం మీదకి చెయ్యి పోనిచ్చి, అప్రయత్నంగా విషపునవ్వు ఒకటి విసిరాడు.

అనాటినుండి సత్తిరాజు ఇంటికి రాకపోకలు తగ్గినాయి. హరి యం.బి. బి.యస్.లో చేరాడు విశాఖపట్నం వెళ్ళి. హరి డాక్టరు కాబోతున్నందుకు, విశాలి సంతోషంతో పొంగిపోయేది. విశాలి హరికోసం ఎన్నో పూజలు చేసేది. హరి తన భర్త కావాలని, తన మనస్సులో వేరొకనికి చోటు యివ్వవద్దు అని భగవంతుడ్ని మనసారా కోరుకుంది. హరి అశక్తత విశాలి గ్రహించి తెలుసుకోలేకపోయింది.

సత్తిరాజు మాత్రం ఆశ చావక అడపాదడప రాకపోకలు సాగించాడు వెంకట్రామయ్య ఇంటికి. వెంకట్రామయ్య ముభావంగా వుండటం నేర్చుకున్నాడు.

వెంకట్రామయ్యకి పాతికేళ్ళు దాటిన కొడుకు వున్నాడని తెలిసిన బంధువులు, స్నేహితులు, పెళ్ళి బేరానికి రావటం ప్రారంభించారు. సరైన పాట వచ్చేవరకు వేచివుండాలనుకున్నాడు వెంకట్రామయ్య.

ఆశ చావని సత్తిరాజు, ఆఖరిసారిగా ఆరోజు గట్టిగా అడిగాడు వెంకట్రామయ్యని, పదివేలు పోస్తాను, మన స్నేహం పోగొట్టుకోవద్దు, పిల్లలు ఇద్దరూ మన కళ్ళముందే వుంటారు, కాదనవద్దని.

"అవతల ముప్పైవేలు కాలదన్నుకున్నాను నీ పదివేలు ఎంత ?" అన్నారు గర్వంగా వెంకట్రామయ్య.

సత్తిరాజులో కోపం బుసలుకొట్టింది. చిన్నప్పటినుండి ఇంత స్నేహంగా వున్నందుకు ఫలితం ఇదా ?

వెంకట్రామయ్య సానబెట్టిన కత్తిలా తయారైనాడు. చూద్దాం. నా కూతురికి పెళ్ళి కాకపోతుందా ? అనుకున్నాడు సత్తిరాజు ఆవేశంగా.

"భర్తకు వున్న డబ్బు వ్యామోహంలో, స్నేహాన్ని కూడా కాలదన్నుకున్నందుకు, భార్య లక్ష్మమ్మ అసహ్యించుకుంది వెంకట్రామయ్యని మనస్సులోనే.

అంతా విన్న విశాలి ముఖం చిన్నబోయింది. సుశీలమ్మ బాధపడింది సత్తిరాజు భార్య పోరుపడలేక మళ్ళీ హరిపేర ఉత్తరము వ్రాశాడు విశాఖపట్నంకి.

హరీ ! విశాల నీమీద ఎన్నో ఆశలు పెట్టుకుంది. వెంకట్రామయ్యకి నాకు వున్న స్నేహం ఈనాటిది కాదు. నీకు తెలియనిది కాదు. మన మధ్య ఆత్మీయత పెంచుకోవాలని వుందేగాని, తెంచుకోవాలని లేదు. చదువుకున్నవాడివి. అన్నీ తెలిసినవాడివి, డబ్బు శాశ్వతం కాదు. మాట శాశ్వతం నాయనా ! ఈ మావయ్య మాట కాదనకు. విశాలి దిగులుపడిపోయింది హరీ. నీ సమ్మతం కోసం ఎదురు చూస్తున్నాను అంటూ వ్రాశాడు.

తిరుగు జాబు రానే వచ్చింది. విశాలి హృదయం సంతోషంతో పొంగిపోయింది. "నా బంగారు తండ్రి హరి ఏమి వ్రాశాడో చదవండి" అంటూ తొందరచేసింది సుశీలమ్మ.

పిల్లాడు దోవలోకి వచ్చాడు. ఫరవాలేదు అనుకున్నాడు సత్తిరాజు ఉత్తరం చదవకుండానే.

ఉత్తరం చదివిన మరుక్షణంలోనే పళ్ళు పటపటలాడించాడు, రోషంగా సత్తిరాజు.

అర్థంకాని సుశీలమ్మ అయోమయంగా చూస్తూ కూర్చుంది.

విశాలి తండ్రి చేతిలోనుండి విసిరివేయబడ్డ ఉత్తరం వణకుతున్న చేతులతో తీసి చదివింది.

"సత్తిరాజు మావయ్యకి,

చిన్నప్పటినుండి విశాలి, నేను కలసిమెలిసి వున్నంత మాత్రాన, నేను విశాలిని చేసుకుంటా ననుకోవటం పొరపాటు. నాకు బాగా నాతో సమానంగా చదువుకున్న పిల్ల కావాలని, విదేశాలు వెళ్ళాలని కోరికగా ఉంది. నా తోటి వాళ్ళంతా అందమైనవాళ్ళని, గ్రాడ్యుయేట్స్‌ని చేసుకున్నారు. వాళ్ళకన్నా అధికుడ్ని కావాలని కోరికగా వుంది. క్షమించు మావయ్యా. శెలవ్,

హరి.

అంటూ వ్రాశాడు. ఉత్తరం చదువుకున్న విశాలి తనలో తనే కుమిలిపోయింది.

ఉత్తరం చదివిన సత్తిరాజు చిందులు త్రొక్కాడు. ఆవేశంతో, ఈ సత్తి రాజు అంటే ఏమిటో తెలుపుతాను అంటూ హుంకరించాడు. మనిషిని మంచి తనంతోనే ముంచాలి. లేకపోతే లాభం లేదనుకున్నాడు సత్తిరాజు వెంక ట్రామయ్యతో మామూలుగానే వుంటున్నాడు, సత్తిరాజు అసమర్థతకి నవ్వు తున్నాడు వెంకట్రామయ్య.

విశాలికి మంచి సంబంధమే చూచాడు సత్తిరాజు. వరుడు చదువుకున్నవాడే. చక్కనివాడు కూడా. అన్ని విధాలా తగినసంబంధమే అనిపించింది సత్తిరాజుకి. పెళ్ళి వారం రోజులు వుందనగా లక్ష్మమ్మని, వెంకట్రామయ్యని దగ్గర వుండి తీసుకువచ్చాడు, పెళ్ళి పనులకి సాయంగా. పెళ్ళి వున్నంతలో ఘనంగానే జరిపించాడు.

పెళ్ళికి హరి వచ్చాడు. ఆరోజు అంతా వుండి వెళ్ళిపోయాడు. ఈ పెళ్ళి ఎవరికి తృప్తినిచ్చినా, సత్తిరాజుకి, సుశీలమ్మకి అదోలా వుంది. లక్ష్మమ్మ చాటుగా కన్నీళ్ళు తుడుచుకుంది.

విశాలి పెళ్ళిఅయిన తరువాత, మళ్ళీ వెంకట్రామయ్య, సత్తిరాజు పూర్వ స్నేహితులలాగే వుంటున్నారు.

ఊళ్లో అందరికీ ఇది మరీ విడ్డూరమనిపించింది.

ఆ వూళ్ళో, వెంకట్రామయ్యని మించినవాడు రాఘవయ్య. రాఘవయ్యకు విషనాగు అని పేరు. బాగా వున్నవాడు. మదగజంలాంటి మనిషి. ఎవర్ని ఎట్లా నమ్మించాలో, వంచించాలో రాఘవయ్యకి ఉగ్గుపాలతో నేర్పిన విద్య. సత్తిరాజు చాటుగా రాఘవయ్యతో చేతులు కలిపాడు జరిగినదంతా చెప్పి.

సత్తిరాజుకి తోచని ఉపాయాలు రాఘవయ్య [అందించాడు. రాఘవయ్యకి అరడజను సోడాలు కొట్టించి యిచ్చాడు సంతోషంతో.

మర్నాడు వెంకట్రామయ్య వాకిట్లో రాఘవయ్య ప్రత్యక్షమైనాడు.

"ఓహో బావా! ఆశ్చర్యంగా వుందే. ఎన్నాళ్ళకి, ఎన్నాళ్ళకి వచ్చావు! రా... రా" అంటూ ఎదురేగి ఆహ్వానించాడు వెంకట్రామయ్య రాఘవయ్యని.

"ఏందోలే బావా! ఎప్పటికి అప్పుడు రావాలనుకోవటం తీరడంలేదనుకో. ఇవాళ తప్పనిసరిగా రావాలనుకుని వచ్చాననుకో" రాఘవయ్య నవ్వుతూ అన్నాడు.

"ఊరక రారు మహాత్ములు! ఏమిటో విశేషం?" వెంకట్రామయ్య తమాషాగా అన్నాడు.

"ఏముంది బావా! మన హరికి ఫస్టుక్లాసు సంబంధం తెచ్చాను. పిల్లని చూస్తావుగా, పిల్లని గురించి చెప్పే పనే లేదనుకో. చదువుకి లోటులేదు, కట్నం నీవెంత అడిగితే అంతే. కాదనేందుకు లేదు మరి. ఏమంటావు? నీదే ఆలస్యం. పిల్లని చూడటానికి ఎప్పుడు పోదామంటావు?"

"నాదేముంది బావా! పెద్దవాడివి, నీమాట కాదనేంతటివాడినా!" వెంకట్రామయ్య సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయిపోతూ అన్నాడు.

"ఇంకేం శుభస్య శీఘ్రం."

"అయితే బావా! ఇంతకీ పిల్ల ఎవరు?"

"ఓరినీ అసాధ్యం కూల. అసలు సంగతి నీకు చెప్పనే లేదా?" అంటూ గారపట్టిన పళ్ళు బయటపెట్టి, భళ్ళున నవ్వాడు. వెంకట్రామయ్య సంతోషంతో శృతికలిపాడు.

"మా దూరపు బంధువులే! పిల్లకి తల్లి తప్ప తండ్రీ, తోబుట్టువులు ఎవరూ లేరు.

"వాళ్ళది నెల్లూరు. యింకేమన్నా వివరాలు కావాలా?"

"అబ్బే, అదేం లేదు. అన్నీ తెలిసినవాడివి నీవు వుండగా భయం ఎందుకులే బావా!" వెంకట్రామయ్య గలగల నవ్వుతూ అన్నాడు.

"సరే వస్తా. ఎల్లుండి బాగుంది వెళదాము. పిల్లని చూడటానికి సిద్ధంగా వుండు. పిల్లవాడ్ని పిలిపించు." తన గుబురు మీసాల వెనుక నవ్వు దాచుకుంటూ గడప దాటాడు రాఘవయ్య.. ఆ రోజు సాయంత్రమే సత్తిరాజుకి గర్వంగా చెప్పుకున్నాడు వెంకట్రామయ్య.

సత్తిరాజు వెంకట్రామయ్యకి పట్టబోతున్న అదృష్టాన్ని ఎంతగానో పొగిడాడు ఇంత అదృష్టం ఎవరికీ పట్టదంటూ.

మూడోనాటికల్లా హరితోసహా, రాఘవయ్య, వెంకట్రామయ్య నెల్లూరు ప్రయాణమవుతూ, తమతో రావాలి తప్పదు అంటూ సత్తిరాజును కూడా బల వంతంగా బయలుదేరదీశారు.

పెళ్ళికూతురు ఇల్లు పెద్ద మేడ. బాగానే వుంది. పెళ్ళికూతురు ఇంట్లో పిల్ల తల్లి తప్ప వేరెవ్వరూ లేరు. ఇది మరీ బాగుంది అనిపించింది వెంకట్రామయ్యకి.

పరిచయాలు, క్షేమ సమాచారం, లోకాభిరామాయణం అంతా క్షణంలో ముగిసింది. "పిల్లని పిలిపించండి" అని రాఘవయ్య ఆజ్ఞకి తీసుకురావటానికి తల్లి లోపలికి వెళ్ళింది. రాబోయే ఆ అమ్మాయికోసం ఆత్రంగా చూస్తూ కూర్చున్నాడు హరి.

వున్నట్టుండి మెరుపు మెరిసినట్లయింది.

హరికి, వెంకట్రామయ్యకి కళ్ళు జిగేల్ మన్నాయి. పెళ్ళికూతురి అందం సామాన్యమైనదికాదు. బంగారు శిలకలాగా వుంది. నవ్వితే ముత్యాలు రాలుతాయా అనిపిస్తుంది. నడుస్తుంటే ఆ నడకలోని వయ్యారాలు సగం ఆ అమ్మాయికి అందం తెప్పించినాయేమో అనిపిస్తున్నది. అందమైన ఆ కాటుక కళ్ళతో అనేక కావ్యాలు వ్రాయవచ్చు అనిపించింది హరికి.

ముగ్ధ మనోహరమైన ఆ రూపాన్ని తనివితీరటం లేదు హరికి ఎంతసేపు చూచినా.

"నీ పేరేమిటమ్మా ?" వెంకట్రామయ్య మెల్లిగా అడిగాడు.

పెళ్ళికూతురు తల మరింత దించుకుంది ఆ ప్రశ్నతో.

"పిల్లకి మహా సిగ్గు." అంటూ రాఘవయ్య సమర్థించాడు.

"వీణాధరి" అంటూ పిల్ల పేరు తల్లి చెప్పింది.

వెయ్యి వీణలు ఒక్కసారిగా మ్రోగినట్లనిపించింది హరి హృదయంలో. పిల్ల రూపం, వాళ్ళు యివ్వబోయే కట్నం, చేసిన మర్యాదలు తప్ప హరికి, వెంకట్రామయ్యకి మరో ప్రపంచం తెలియటం లేదు. అక్కడికక్కడే, రాఘవయ్య బలవంతంతో తాంబూలాలు తీసుకోవటం జరిగిపోయింది. అంతా తృప్తిగా యిళ్ళకి చేరారు.

హరికి, వెంకట్రామయ్యకి భూమ్మీద కాళ్ళు నిలవటం లేదు.

సత్తిరాజు, రాఘవయ్యలు మధ్యలో ఎటువంటి ఆటంకాలు లేకుండా, పెళ్ళి

స్వేచ్ఛ అంటే మీకు తెలుసా అన్నా..అంతే




కాస్తా జరిగిపోతే తొందరగా చాలని ఆలోచిస్తున్నారు. అనుకున్నదే తడవుగా లగ్నాలు పెట్టుకున్నారు.

పెళ్ళికి విశాలి, విశాలి భర్త ప్రసాద్ పదిరోజులు ముందుగానే వచ్చారు.

పెత్తనమంతా సుశీలమ్మ, సత్తిరాజులకే ఒప్పచెప్పాడు వెంకట్రామయ్య.

కల్యాణ ఘడియలు రానే వచ్చాయి.

అత్యంత వైభవంగా బంధు మిత్రులతో బయలుదేరి వెళ్ళి ఆ పెళ్ళికాస్తా జరిపించుకు వచ్చారు. హరి సంతోషానికి పట్టపగ్గాలు లేవు.

మనస్సంతా వీణాధరిని గురించి ఆలోచించటంతో సరిపోతున్నది.

వీణాధరి తిరిగి నాలుగవనాడు తల్లితో వెళ్ళిపోతుంటే హరికి ఏదోలా అనిపించింది, పన్నెత్తి ఒక్కసారి కూడా పలకరించలేకపోయానే అని.

నెల రోజులు గడిచాక వీణాధరి తల్లి ఉత్తరం వ్రాసింది, అల్లుడుగార్ని పంపవలసింది అంటూ.

వెళ్ళి వీణాధరిని తనతో తీసుకురావచ్చు అనుకుంటూ ఉత్సాహంగా నెల్లూరు బయలుదేరాడు హరి. ఏవేవో ఊహలతో ఉక్కిరిబిక్కిరి అవుతూ, కోటి కోరికలతో రైలు ఎక్కాడు.

హరి వాకిట్లోకి అడుగుపెట్టగానే, ఆప్యాయంగా పలుకరించింది పిల్ల తల్లి రంగమ్మగారు.

వీణకోసం హరికళ్ళు చుట్టూ వెతికాయి. ఇది గమనించి రంగమ్మగారు నవ్వుకుంటూ వెళ్ళి వీణచేత కాఫీ పంపించింది.

వీణ కాఫీ తెచ్చి టేబిల్‌మీద పెట్టీపెట్టకముందే హరి వీణ చెయ్యి అందుకున్నాడు అప్యాయంగా. వీణ బిత్తరపోయి తడబాటుగా చూచింది. వీణ కళ్ళల్లో సంతోష చిహ్నాలు బదులు, విచారం అలుముకుంది. కళ్ళల్లో నీరు నిలిచింది. ఇది గమనించి, నుదురు రుద్దుకుంటూ, క్షణకాలం ఆలోచించాడు హరి. ఈ పెళ్ళి వీణకి యిష్టంలేదా? అనుకుంటూ, వుండబట్టలేక అడిగేశాడు.

"వీణా! ఈ పెళ్ళి నీకు యిష్టంలేదా? ఎందుకు అంత దిగులుగా వున్నావు?" అని లాలనగా చిన్నగా అడిగాడు.

ఆ మాటలకి ఆశ్చర్యంగా హరి కళ్ళల్లోకి చూచి వేగంగా వెళ్ళిపోయింది. వెళుతూ, వెళుతూ తన చేతిలోని కాగితం టేబిల్‌మీద పెట్టి వెళ్ళిపోయింది.

హరి ఆత్రంగా ఆ కాగితం తీసి చూచాడు.

"మీకు... నమస్కారాలు. మీరు చాలా దురదృష్టవంతులు. డబ్బుకు దాసోహం అని నన్ను కట్టుకున్నారు. ముందు వెనుకలు ఆలోచించలేకపోయినారు. మీ తండ్రికివున్న డబ్బు దాహానికి మీరు బలి అయినారు. చిన్ననాటినుండి మీ మీద ఆశలు పెంచుకున్న "విశాలి"ని కాదన్నారని మీమీద కసితో సత్తిరాజు, రాఘవయ్య మీ గొంతు కోశారు. నోరులేనిదాన్ని కావటంతో జవాబు చెప్ప లేకపోయాను. క్షమించండి... వీణ."

హరి ఆ ఉత్తరం చదువుతూనే కుప్పలా కూలిపోయాడు. చేతులారా చేసు కున్న కర్మకి ఎవర్నని ఏం లాభం. గుండెలు అవిసిపోయేలా ఏడ్చాడు. డబ్బు తోనే ప్రేమలు, ద్వేషాలు పుడ్తాయని తెలుసుకుని కుమిలిపోయాడు.

రోదిస్తూ అలా ఎంతసేపు కూర్చుండిపోయాడో.

వున్నట్లుండి గావుకేకలు వినిపించాయి దొడ్లోనుండి.

హరి గబగబా పరిగెత్తాడు. వీణ బావిలో దూకాలని ప్రయత్నిస్తుంటే తల్లి

కేకలు వేస్తూ గట్టిగా పట్టుకొని ఆపే ప్రయత్నంలో వుంది. హరి వచ్చి గఖాల్ని ఆపేశాడు.

"ఇదంతా నా కర్మ ...నీదేముంది తప్పు ఇందులో" అంటూ, వెక్కివెక్కి పెట్టి ఏడుస్తున్న వీణ ముఖం చూడలేకపోయాడు.

హరి ఇంక ఒక్క క్షణం కూడా వుండలేకపోయాడు అ ఇంట్లో తన ఇల్లు చేరుకున్నాడు హరి.

ముగ్గురి జీవితాలతో చెలగాటమాడిన తండ్రి ముఖం చూడబుద్ధి కాక, తల్లి ఎదురువచ్చి పలకరించబోయినా తప్పుకొని వెళ్ళాడు.

హరికి అయోమయంగా వుంది అంతా. విదేశాలు వెళ్ళాలని, యింక తిరిగి రానని ఉత్తరం వ్రాసి, టేబిల్ మీద పెట్టి, గబగబా సూట్ కేస్ సర్దుకొని ప్రయాణమైనాడు. ఎందుకో విశాలికి క్షమాపణలు చెప్పుకోవాలనిపించింది. తన తండ్రి వాళ్ళని అన్యాయం చేసినందుకు–తనూ విశాలికి ఆశలు కల్పించి, మోసం చేసినందుకు.

సత్తిరాజు ఇంటికి వెళ్ళగానే, ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. ఇంట్లో ఎవరూ లేనట్లు.

విశాలి కోసం చుట్టూ చూస్తూ లోపలికి వెళ్ళాడు. వంటగదిలో ఏదో పని చేస్తున్న విశాలి, అలికిడి అయి, వెనక్కి తిరిగింది. విశాలి రూపం చూడగానే కెవ్వున కేక వేసి, కళ్లు మూసుకున్నాడు హరి.

"ఏమైంది విశాలి? ఎందుకు అట్లా అయిపోయినావు" అంటూ బాధగా అడిగాడు.

"ఏమవుతుంది బావా! కల్మషం లేని మనస్సులతో జరిగిన పెళ్ళిళ్లు కావు ఇవి. అన్యాయం అక్రమాలతో, పగతో చేసిన పెళ్ళిళ్ళు ఇవి. భగవంతుడు అందరికీ తగిన ప్రాయశ్చిత్తమే చేశాడు. నెలరోజుల క్రితం, తన కంపెనీ పనిమీద ఢిల్లీ వెళ్ళి వస్తుండగా, విమానం కూలి ఆయన మరణించారు."

"అపు... ఇంక చెప్పకు విశాలీ....ఇంక చెప్పకు వినలేను," అంటూ హరి గబగబా అడుగులు వేసుకుంటూ వెనక్కి తిరిగి వెళ్ళిపోతూంటే ఎటుపోతాడో, ఏమైపోతాడో తెలియని విశాలి కన్నీళ్ళమధ్య దీనంగా చూస్తూ నిల్చుండి పోయింది.

———

# ఆవేదన క్షణాలు



యర్రంశెట్టి శాయి

మధ్యాహ్నం రెండుగంటలకు ఫోన్ వచ్చింది రామచంద్రరావుకి.

ప్యూన్‌వచ్చి చెప్పాడా విషయం.

తనకు ఫోన్ చేసేవారెవరున్నారో అర్థం కాలేదతనికి. గత ముప్ఫయ్ ఏళ్ళ సర్వీస్‌లోనూ ఇదే ప్రథమం తనకిలా ఫోన్‌కాల్ రావడం.

లేచి ఆత్రుతగా ఆఫీసర్ గదిలోకి నడిచి ఫోన్ అందుకున్నాడతను.

"హలో !" అన్నాడు నెమ్మదిగా.

"రామచంద్రరావ్‌గారేనా మాట్లాడేది ?" అడిగిందో స్త్రీ గొంతు.

"అవునండీ ! మీరెవరు ?"

"నేను చర్చి హాస్పిటల్ నుంచి మాట్లాడుతున్నానండి ! మీ భార్య కొద్ది సేపటిక్రితం ఇక్కడ ఎడ్మిట్ అయారు. ఫిమేల్ వార్డ్ బెడ్ నెంబరు వన్‌వన్‌త్రీ. ఆవిడ కండిషన్ సీరియస్‌గా ఉంది."

రామచంద్రరావ్ ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

కాళ్ళూ చేతులూ వణికిపోసాగినయ్.

అతని నుంచి మాట రాకపోయేసరికి ఆమె ఫోన్ పెట్టేసింది.

అతని పరిస్థితి గమనించిన ఆఫీసర్ విశ్వనాథం "ఏమిటి సంగతి ?" అని అడిగాడు.

"మా మిసెస్‌కి సీరియస్‌గా ఉందిట సార్ ! హాస్పిటల్లో చేర్చారని చెప్తున్నారు ..."

"అరె ! పాపం ! అదివరకే జబ్బుతో ఉన్నారా ?"

"ఉహూ ! ఉదయం నేను ఆఫీస్ కొచ్చేవరకుకూడా బాగానే ఉంది...."

"త్వరగా వెళ్ళండి మరి హాస్పిటల్‌కి .. "

రామచంద్రరావ్ తడబడుతున్న అడుగులతో బయటకు నడిచి హెడ్‌క్లర్కుతో విషయమంతా చెప్పి ఆఫీస్ బయటికొచ్చేడు.

రిక్షా ఒకటి ఖాళీగా కనిపించింది అక్కడ. బస్ కోసం వేచిఉండటం కంటె అందులో వెళ్ళడం నయం !

"అర్జంటుగా చర్చి హాస్పిటల్ కెళ్ళాలోయ్.. "

"కూర్చోండి !"

రిక్షా వేగంగానే తొక్కుతున్నా డతను.

రామచంద్రరావుకు ఇంకా వణుకు తగ్గలేదు.

గుండెల్లో బాధ! అంతకు ముందెన్నడూ అనుభవించని పరితాపం. కళ్ళ వెంబడి నీళ్ళు రాలేందుకు సిద్ధంగా ఉన్నాయ్.

జయకు ఏమయింది? అంత ప్రమాదకర పరిస్థితి ఇంత హఠాత్తుగా ఎలా ముంచుకొచ్చింది? ఏనాడూ ఆమె మంచం పట్టగా చూడనేలేదు తను. అలాంటిది. జయ ఈ గండం నుంచి బయటపడుతుందా?

'భగవంతుడా! నా సర్వస్వం జయే! నా జయకు హాని చేయకు!' గద్గదిక స్వరంతో గొణుకున్నా డతను.

అతని కళ్ళముందు జయ మొఖం కనబడుతోంది దీనంగా, విషాదంగా ఆనాటి అందాలు చిందించిన ఆ ముఖానికీ విషాదం మూర్తీభవించిన ఈ ఆకృతికీ ఎంత తేడా? మధ్యలో ముప్పయ్ సంవత్సరాల జీవితం గడిచింది. అంతా సుఖ దుఃఖాల సమ్మేళనం.

మొట్టమొదటిసారి ఆమెను చూచిన దగ్గరనుంచే తను ఆమె అందానికి దాసుడయిపోయాడు.

ఎదురింటి డాబామీద రెండుజెడలతో-మెరిసిపోతున్న అందంతో.. మబ్బు రంగు బట్టల్తో తన చూపు మరల్చుకోలేకపోయాడు. తన చూపులను గమనించి జయ సిగ్గుపడింది. డాబా దిగి ఇంట్లోకి వెళ్ళిపోయింది. ఆ రాత్రి తను నిద్రపోలేదు, ఆ మర్నాడు, ఆ తర్వాతా... ఆమెను పలుకరించే అవకాశం లభించేవరకు నిద్దే లేదు.

ఆ అవకాశం అంత తేలికగా లభించలేదు.

ఎన్నాళ్ళకో ఎంతో తపస్సు చేశాక చివరకు తనే ఇంటికొచ్చి పలుకరించింది.

"మీ అమ్మగారు లేరా?"

"లేరు! ఏం కావాలి?"

"మా పిన్ని పిలుచుకు రమ్మంది.."

"కూర్చొండి! వస్తుందిప్పుడే!"

జయ కూర్చోలేదు. తలుపు దగ్గరే నిలబడిపోయింది ఇబ్బందిగా.

"మీ రేం చదువుకుంటున్నారు?" అడిగాడు తను.

"యస్సస్సీ పోయింది. ప్రైవేటుగా ఎగ్జామినేషన్ ఇస్తున్నాను..." ఆమె వెళ్ళిపోబోయింది.

"మీ పేరు?"

"జయ!" చెప్పేసి వెళ్ళిపోయింది చిరునవ్వుతో.

ఆ తరువాత పరిచయాన్ని పెంచుకోవడం ఏమంత కష్టం కాలేదు, సాయంత్రం రోజూ ఆమె డాబామీదికి రావడం, తను తన గది కిటికీలో నుంచి చూడడం, ఇద్దరి చూపులు పదేపదే కలుసుకోవడం, నవ్వుకోవడం-సైగలు

చేసుకోవడం— దూరంగా ఉన్నా తన్మయత్వం కలిగించేది ఆ అనుభవం !

తను జయకు రాసిన మొదటి ప్రేమ లేఖే నానా రభసా సృష్టించింది.

ఆ ఉత్తరం ఆమె చదువుకుని తన పుస్తకంలో దాచుకోవడం, ఆ పుస్తకం ఆమె పిన్ని చూడడం ఎందుకో జరిగింది.

దాంతో అప్పటికప్పుడే ఆమెనువాళ్ళ ఊరు పంపించేశారు. అలా జరగడం వల్ల తామిద్దరూ మరింత సన్నిహితులయారు ఉత్తరాల ద్వారా!

చివరకు పెద్దల ఆశీర్వాదంతోనే వివాహం జరిగిందిద్దరికి.

రిక్షా ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర ఆగింది.

రామచంద్రరావ్ ఆలోచనల్లోంచి తేరుకున్నాడు.

రిక్షా ఎక్కి— ఎంతోసేపయినట్లుంది. తీరా చూస్తే అయిదు నిమిషాలేనా కాలేదు.

ఇంతకూ జయ కెలాంటి ప్రమాదం జరిగింది? స్టౌమంట అంటుకుని శరీరం కాలిందా? లేక మరేదయినా అవాంతరంగా జబ్బు చేసిందా?

జయకేమీ ప్రాణాపాయం కలుగదు కదా!

ఒకవేళ అలా జరుగితే తను బ్రతగ్గలడా?

ఊహ సాధ్యంకాని విషయం అది.

తన జీవితంలో అనుక్షణం జయకు చెందిందే!

వివాహమయిన కొత్తలో తా మనుభవించిన మధురమైన రోజుల్ని ఇద్దరూ ఎంత జాగ్రత్తగా గుండెల్లో దాచుకున్నారు? ఆ తరువాత ఎన్నో ఒడిదుడుకులకు లోనయినా కలవరపడక చిరునవ్వు పెదాలమీద నుంచి చెరగనీయకుండా జయ అడుగడుగునా తనకు ధైర్యం చెప్పడం తనెలా మర్చిపోగలడు....

ఉదయం నిద్ర లేచినదగ్గర్నుంచీ రాత్రి పడుకోబోయే వరకు, పిల్లలకూ తనకూ కావలసినవన్నీ వేళకు సమకూర్చడం ఇంటి బాధ్యతలన్నీ ఆమే భుజాలమీద వేసుకోవడం — అనుక్షణం ఆమెకు మనసులో కృతజ్ఞతలు తెలుపకుండా ఎలా ఉండగలడు తను?

తను పనిచేస్తున్న ఫ్యాక్టరీ లాకౌట్లో ఉన్నప్పుడు, ఆర్థికమయిన ఇబ్బందులు చుట్టుముట్టి అందరినీ పస్తులుంచే సమయంలో కూడా తనకూ పిల్లలకూ ఎలాంటి లోటూ రాకుండా చూసి, ఆమె మాత్రం పస్తులున్న విషయం తెలుసుకుని తనెంతగా క్షోభించిపోయాడు? మరోసారి అలా చేయనని ఆమె తన చేతిలో చేయివేసి చెప్పిన రోజుని తను ఎప్పటికయినా మరచిపోగలడా?

తనకూ, పిల్లలకూ ఎప్పుడయినా కొంచెం అస్వస్థతగా ఉంటే చాలు విలవిలలాడుతూ తమనే అనుక్షణం కనిపెట్టి స్వస్థత చేకూరేవరకూ సేవలు చేయడం



తనకెందుకో ఉండుండి గుర్తుకొచ్చి మన సంతా ద్రవించిపోతుంది.

తన ప్రాణంకన్నా మిన్న జయకు మరి తనేం చేయగలిగాడు ?

బ్లాంక్; ఆమెకున్న కోరికలలో ఒక్కటయినా తను తీర్చగలిగేడా ?

వివాహమయిన కొత్తలో ఆమెకున్న కోరికల గురించి తను ఎప్పుడయినా జ్ఞాపకంచేసుకుని బాధపడితే ఆమె తేలిగ్గా నవ్వేసి తనను సముదాయించేది.

"నేనంటే మీకున్న అనురాగం చాలు నాకు ; ఇంకేమీ వద్దు" అనేది.

రిక్షా హాస్పిటల్ చేరుకుంది.

రిక్షా దిగి రిక్షాఅతనికి డబ్బిచ్చి ఆదుర్దాగా లోపలకు నడిచాడు రామచంద్రరావ్.

బెడ్‌మీద బాండేజ్ కట్లతో పడుకుని ఉంది జయ.

రామచంద్రరావ్‌కి భయం వేసింది.

ఆమె తనకు దక్కుతుందా ?

డాక్టర్లు, నర్సులు ఆమె బెడ్‌చుట్టూ గుమికూడి ఉన్నారు.

ఒకవేళ జయకేమయినా జరిగుతే...

అంతవరకూ తనకు గుర్తులేని ఎన్నో విషయాలు గుర్తుకొచ్చినయ్ అతనికి.

"అమ్మా! ఆకలేస్తూందే."

"అమ్మా ! నా హోమ్‌వర్క్ ఎలా చేయాలో కొంచెం చెప్పవే."

"అమ్మా, నా చొక్కా చిరిగింది, కొంచెం కుట్టవే."

అంటూ ఇంటిదగ్గరున్నంత సేపూ అమ్మ కోసం అలమటించిపోయే పిల్లల గతేమిటి ?

"కాఫీ తాగండి, చల్లారిపోతున్నాయ్, గడ్డం చేసుకోండి—

స్నానం చేయండి, నీళ్ళు తోడాను. ఇవాళ ఈ బట్టలు వేసుకోండి.

భోజనం వడ్డించాను లేవండి,
మీ ఆఫీసుకు టైమయింది,
ఇదిగో వాచీ మర్చిపోయేరు—"

అంటూ అనుక్షణం తననెవరు కని పెట్టి ఉంటా...? ఇవన్నీ తనేనాడూ తలుచుకొనయినా లేదే!

"నాన్నా అమ్మేదీ?" అనడిగే పిల్లలకు తనేమని సమాధానం చెప్ప గలడు?

ఆమె లేని లోటు ఎలా తీరుతుంది?

ఇల్లు దేవుడులేని పాడుబడిన గుడిలా తయారవుతుంది.

రామచంద్రరావ్‌కి కళ్ళు వెంబడి నీళ్ళు జారిపోసాగినాయ్.

డాక్టర్ దగ్గరకు నడిచి అతికష్టంమీద గొంతు పెగల్చుకుని అడిగాడు.

"ఆమె నా భార్య! ఆమెకేం జరిగిందో, ఇప్పుడామె పరిస్థితి ఎలావుందో కొంచెం చెప్పండి...."

డాక్టర్ అతని ఆందోళన చూసి ధైర్యం చెప్పాడు.

"మోటార్ సైకిల్ డాష్ ఇచ్చిందట మార్కెట్ రోడ్‌మీద. ఆమె కూరగాయలు కొనుక్కుని కూరగాయలసంచీతో వస్తుందట అప్పుడు. ఇందాక ఆమె పరిస్థితి మాకే ఆందోళన కలిగించింది గానీ ఇప్పుడింక ఏమీ ఫరవాలేదు. షి ఈజ్ అవుటాఫ్ డేంజర్."

రామచంద్రరావుకి ఆ మాటలు పోయిన ప్రాణాన్ని తిరిగివచ్చేలా చేసినయ్. అప్పుడే జయ కళ్ళు విప్పింది.

రామచంద్రరావ్ ఆమెకి సమీపంగా నడిచి వంగి ఆమె మొఖంలోకి చూచాడు.

"నాకేం ఫరవాలేదు! మీరెందుకంత గాబరాపడుతున్నారు?" నెమ్మదిగా అందామె.

"మీ రేమీ మాట్లాడకండిప్పుడు" ఆమెను మందలించింది నర్స్. డాక్టర్లు వెళ్ళిపోయారు.

నర్సు అక్కడే నిలబడి వుంది.

రామచంద్రరావ్ పక్కనే కూర్చున్నాడు. ఆమెను చూస్తున్నకొద్దీ అతనికి ధైర్యం వస్తోంది.

దేవుడు తన ప్రార్థన విని జయను బ్రతికించేడు.

కొద్దిసేపు గడిచిపోయింది.

జయ చేతికున్న గడియారం వేపు చూసింది.

"పిల్లలు స్కూలునుంచి వచ్చే వేళ అయింది. ఇంటి కెళ్ళరూ?"

"సరే! వెళ్ళి- మళ్ళీ వస్తాను...."

లేచి నిలబడ్డాడు రామచంద్రరావ్.

మరోసారి డాక్టరుతో మాట్లాడి హాస్పిటల్ బయటి కొచ్చేడతను. ఇప్పుడతనికి ఆనందంగా ఉంది. సంపూర్ణమయిన జయను ఇప్పుడు చూశేడు తను.

"నాన్నా అమ్మేది?" అని పిల్లలడిగితే "యాక్సిడెంట్ అయింది. రెండ్రోజుల్లో ఇంటికి వచ్చేస్తుంది హాస్పిటల్ నుంచి" అని జవాబిస్తాడు తను.

అంతే!

---

# గాజుకళ్ళ

ముప్పాళ్ళ జగన్నాథరావు



"మీ రెన్నయినా చెప్పండి, నసేవిఁరా నేనీ పెళ్లి చేసుకోను - అంతే" అప్పుడే పెళ్లివార్ని వీధిగుమ్మం వరకు సాగనంపి వచ్చిన వెంకట్రామయ్యగారి చెవినబడ్డాయి. సుశీల అయిష్టంగా అన్న మాటలు!

"ఇంకే వుంది హతోస్మి. దీనికి ఈ సంబంధం కూడా నచ్చలేదన్నమాట" వెంకట్రామయ్య ముఖంలో ఈసారి కూడా ముడుతలేర్పడ్డాయి.

"అయితే మళ్లీ ఇంకో చెప్పులజత అరగటం ఖాయం" అంటూనే చిరాగ్గా ఇంట్లోకి నడిచాడు.

"ఒసేవ్ సుశీ ఎందుకు చేసుకోవేఁ? ఆ అబ్బాయికి ఏం లోటని? కన్నొంకరా కాలొంకరా చెప్పు! తెచ్చిన ప్రతి సంబంధాన్ని ఇలా ఏదో ఒక సాకుజెప్పి వద్దంటే ఎలా నేతల్లీ!" కత్తిపీట ముందుకూర్చుని ఏదో తరుగుతూ అంది సుభద్రమ్మ-

"నీకు తెలియదే అమ్మా! నిజం చెప్పాలంటే, నాకు తెలిసినంతలో శేఖరం బుద్ధిమంతుడు - ఇద్దరం కలిసి చదువుకునే రోజుల్లో అతని విషయం నాకు బాగా తెలుసు! ఇది సుఖపడాలనే ఆఖరు ప్రయత్నం చేశాను!"

తల దువ్వుకుంటున్న వాడల్లా ఆగి అన్నాడు రఘు :

"అవున్లే మీ కళ్లకు అందరూ బాగుంటారు. ఎందుకో చెప్పనా. ఏదో విధంగా నన్ను వదిలించుకోవాలని మీ తపన, అంతేకదూ ?"– సురసుర మంటూ అనేసింది సుశీల :

"సుశీ – పొరబడుతున్నావు చెల్లాయి! నిన్ను వదిలించుకోవాలని తపనే మాకుంటే – ఇంత నిరీక్షణ ఎందుకు చెప్పు. నువ్వు సుఖపడాలనేకదామ్మ : అయినా ఆ శేఖరానికి ఏం లోటు చెప్పు. బి. ఏ. చదువుకున్నాడు. వెనక ఆస్తి కూడా బాగానే వుంది, ఇంటిపెత్తనం అంతా అతన్దే! కాకపోతే మనిషి కాస్త నలుపు అంతేగా ?"–

"అన్నయ్యా ! అసలు పెళ్లి చేసుకునేది నువ్వా నేనా ?" అంది సుశీల.

"ఏవిటే ఆ తలబిరుసు చిన్నా పెద్దా లేకుండా ?" అని మందలించబోతున్న సుభద్రమ్మ కంఠాన్ని వెంటనే ఆపింది సుశీల.

"అవున్లే అతగాడు మీ కళ్లకు మన్మధుడిలా కనిపిస్తున్నాడు. అబ్బ తల్చుకుంటేనే కంపరం పుడుతోంది. ఆ కారునలుపు, స్ఫోటకం మచ్చలు, ఎంత భయంకరంగా వుంటాడో – ఆ అవతారాన్ని కట్టుకుని జీవితాంతం నరకం అనుభవించాలా ? నావల్లకాదు, ఛస్తే ఆ మొద్దును చేసుకోను."

—అంతవరకు గుమ్మం ముందు నిల్చుని, వీళ్ల సంభాషణంతా వింటున్న తండ్రి ముఖంలోకి కొరకొరా చూసి ప్రక్కగదిలోకి వెళ్లింది సుశీల.

"అయినా దాన్నేం లాభంలెండి, ఇంతింత చదువులు వద్దుమొర్రో అంటే విన్నారు ? పట్టుపట్టి మరీ చదివించారు. ఇప్పుడు చూడండి ఇది ఎలా తయారయిందో" అంది భర్తను దెప్పుతూ సుభద్రమ్మ.

"అయితే ఏవిటమ్మా–చదువుకుంటె మాత్రం, అంతా దీనిమాదిరిగానే వున్నారా ? ఆ సుబ్బరామయ్యగారి కూతురు కూడా బియ్యే చదివింది. అయితే మాత్రం తండ్రి మాట కాదందా? ఏవంత గొప్ప సంబంధం అది. పెళ్లి చేసుకుని నిక్షేపంలా కాపురం చెయ్యటం లేదూ ?" అన్నాడు రఘు.

"అవున్రా అబ్బాయ్ ! పెద్దవాళ్ల పరిస్థితి అకళింపు చేసుకుంది కనుకనే సుఖంగా బ్రతుకుతోంది !" సుభద్రమ్మ మాట పూర్తికాకుండానే,

"అవునమ్మా నువ్వన్నట్టు ఎంతో సుఖంగా బ్రతుకుతుంది. ముష్టి మూడొందల రూపాయిల జీతంతో, కోరిన బట్ట కట్టలేక, నచ్చిన నగలు చేయించుకోలేక, చచ్చీ చెడి ఎలాగో ధర్మసూత్రానికి కట్టుబడి బ్రతుకుతుంది. అదీ ఒక బ్రతుకేనా? అట్లాంటి మిడి మిడి బ్రతుకులు నాకు నచ్చవ్ !" గది

లోంచి వస్తూనే ఉ|క్రోషం పట్టలేక ఆశిసించి సుశీల! వెంటనే సమయం చూసి అందుకున్నాడు రఘు!

"అయితే నువ్వన్నట్టు ఈ సంబంధం ఆర్థికలోపం లేనేట్టగా? చేసుకో నువ్వనుకున్న కోరికలన్నీ తీరతాయి!"

"అన్నయ్యా!- కేవలం డబ్బుతోటే అన్ని సమస్యలు తీరిపోవు. ముఖ్యంగా అతను నాకు నచ్చలేదు. ఇప్పుడు చెబుతున్నాను విను! అందంగావున్న ఆస్తిపరుడైతే నేను తప్పకుండా చేసుకుంటాను." సుశీల నిర్ణయానికి రఘు ఏదో అనబోయాడు!

"పోన్లెండి తనకు నచ్చనప్పుడు బలవంతపెట్టడం ఎందుకు?"

పెరట్లోనుండి నీళ్ళబిందెతో వస్తూ అంది రఘు భార్య గిరిజ, భర్తని ఉద్దేశించి

"అంటే నువ్వు ఆడపడుచని వెనకేసుకొస్తున్నావన్నమాట!"

"బావుందండీ, ఇందులో వెనకేసుకురావటమేం ముంది! ఉన్నమాటే అంటున్నాను!" అంటూనే వంటగదిలోకి నడిచింది గిరిజ!

"ఏవోఁ ఏం చేసుకుంటారో — మీ ఇష్టం. నేను చెప్పదల్చుకుంది చెప్పేను" —చరచరా బయిటికి నడిచేడు రఘు!

"ఛీ ఛీ దీనికసలు కల్యాణరేఖ ఉందో లేదోగాని ఇంటిల్లిపాదినీ వేధించుకు తింటోంది- ఏమండోయ్ మిమ్మల్నే వింటున్నారా? మీ ముద్దుల కూతురి నిర్ణయం!"- అంతవరకు గోడవార్న పడక్కుర్చీలో సేద దీర్చుకుంటున్న భర్త వెంకట్రామయ్యను ఉద్దేశించి అంది సుభద్రమ్మ.

"పోనీలేవే నువ్ నోరుచేసుకుంటా వెందుకు? దానికి ఇష్టం లేనప్పుడు మనం బలవంతం చెయ్యటం కూడా అంత మంచిది కాదు!- ఏమ్మా సుశీ! చూడు తల్లీ, నీ ఇష్టానికి వ్యతిరేకంగా ఏ పనీ జరగదు. అయినా ఒక తూరి ఆలోచించడం మంచిదేమోనని! అహఁ ఎందుకంటె, కుర్రవాడు కాస్త నలుపే అనుకో - అయినా మంచివాడు, తెలివైన వాడు అని విన్నాను."

-ఆశగా నసిగేడు వెంకట్రామయ్య!

"ఇంక — ఆలోచించేదేవుంది నాన్నా. ఈ సంబంధం నాకిష్టంలేదని చెప్పేనుగా" ఖచ్చితంగా తన నిర్ణయం చెప్పేసి అక్కడ్నుంచి వెళ్ళిపోయింది సుశీల.

* * *

వెంకట్రామయ్యగారి శ్రమ ఫలితంగా విశాఖపట్నంనుండి మరో సంబంధం వచ్చింది - అబ్బాయి, సుశీల ఊహించినట్టే అందంగా ఉన్నాడు పెద్దగా చదువులేకపోయినా. పెద్ద వ్యాపారమే చేస్తున్నాడు. అతను అన్ని విధాల సుశీలకు బాగా నచ్చాడు - పేరుకు తగ్గట్టే అందంగా ఉన్నాడు, చదువు లేకపోతేనేం! అందం వుంది ఆస్థి వుంది.

నేను సుఖపడ్డానికి ఇంతకన్నా ఇంకేం కావాలి! తనకు కాబోయే భర్తను మన స్సులో ఊహించుకుంటూ ఆనందంతో పొంగిపోయింది సుశీల!

* * *

సుశీల ఎన్నో ఆశయాలు హృదయంలో రంగరించుకుంటూ అత్త వారింట్లో అడుగుపెట్టింది. కాని తను ఊహించుకున్నంతగా అక్కడి పరిస్థితులు అనుకూలించలేదు. ఆ ఇల్లు ఓ సత్రంలా అనిపించింది. వచ్చిన వారంరోజుల్లోనే ఆ ఇంటి పరిస్థితిని, అక్కడి మనుష్యుల మనస్తత్వాల్ని యింతగా తెలుసుకుంది. పెద్ద ఆడపడుచు భర్తతో తగాదాపెట్టుకుని రెండు సంవత్సరాల క్రితంనుండే, తన ముగ్గురు పిల్లల్తో వచ్చి అక్కడే వుంటోంది- ఇహ రెండో ఆడపడుచు, భర్తను పోగొట్టుకుని, అత్తవారింటికి శాశ్వతంగా దూరమై, తన ఇద్దరు పిల్లల్తో సంవత్సరం నుండి అక్కడే వుంటోంది. మూడో ఆడపడుచు కింకా పెళ్ళికాలేదు! చదువు పూర్తయితేనేగాని పెళ్ళి చేసుకోదట !- ఇంకా ఇద్దరు మరుదులున్నారు! అదేదో కాలేజీలో చదువుతున్నారన్న మాటేగాని, ఒక్క క్షణం ఇంటిపట్టు నుండరు. ఇహపోతే తన భర్త రాజా. అతనుచేసే వ్యాపారం ఏమిటో ఎవ్వరికీ తెలియదు. తరచు ఇంటికి రావటంకూడా అతనికి అలవాటు లేదు. అసలు ఆ యింట్లో ఉన్నవాళ్ళందరూ ఎవరు ఎందుకు బ్రతుకుతున్నారో తలబాదు కున్నా సుశీలకి ఎంతకీ అర్థంకాలేదు! పోనీ అత్తగారి విషయం చూస్తే - అంత వయసొచ్చిందన్న మాటేగాని, ఇంకా చెత్త పుస్తకాలు చదువుతూ - సినిమాల గురించి పిల్లల్తో సమానంగా వాదించడం ఆమెకు పరిపాటి. వాళ్ళంతా ఎంతో నాగరికులైనట్టు సుశీలను ఏహ్యంగా చూడసాగేరు. పెళ్ళిచూపులకని వచ్చినప్పుడు మెడతిరక్కుండా నగలు పెట్టుకొచ్చారు. ఇప్పుడు వంటిపేట గొలుసులు మాత్రమే కనబడుతున్నాయి! అవి కూడా అసిలీవో నకిలీవో-సుశీలకి ఇంకా అర్థంకాలేదు. పైగా ఇప్పుడుంటున్న మేడ కూడా, ఇరవై వేల వరకు అప్పులో వుందట. ఇన్ని లోటుపాట్లు పైకి తెలియకుండా వీళ్ళు ఎలా బ్రతుకుతున్నారని సుశీల ఆందోళన!

కాలం దొర్లిపోతున్నకొద్దీ సుశీల పరిస్థితి మరీ నీచంగా తయారైంది! అత్తగారి సాధింపులు, ఆడపడుచుల అదిరింపులు, మరుదుల వెటకారాలు రాను రాను మరీ ఎక్కువైనాయి!

ఆ ఇంట్లో అందరూ సుశీలను పని మనిషికంటే హీనంగా చూస్తున్నారు. భర్త రాజా ఏ రాత్రి పన్నెండుగంటలకో తప్పతాగి రావటం సుశీలను బాదటం అతనికి అదో సరదా. సుశీల పుట్టింటి నుండి తెచ్చుకున్న నగలన్నీ ఒకొక్కక్క-




టిగా అన్ని హరించేశాడు. ఈ జరిగిన కొన్నేళ్లలో ఆమె బాధలు ఎక్కువైనయ్‌గాని తగ్గలేదు.

పగలు జరిగిన ప్రతి ఒక్క విషయం గురించీ భర్త రాగానే ఎవరో ఒకళ్లు చిలవలుపలవలు అల్లి చెప్పడం, అతను అదే విధంగా భావించి సుశీలను హింసించడం - పువ్వులాంటి సుశీల శరీరం అతని మొండితనానికి ఏనాడో మొద్దుబారిపోయింది. నెమ్మదిగా అలవాటు కూడా చేసుకుంది, స్వయంకృతాపరాధంగా భావించి!

ఈ పెళ్లి ఐన ఏడేళ్లలో పుట్టింటికి ఏ రెండుమూడుసార్లో వెళ్లింటుంది. అదైనా భర్త పెట్టిన గడువు మించకుండా! ఈ మధ్య రెండేళ్ల నుంచి ఆ అదృష్టానిక్కూడా నోచుకోలేదు? చేసేది లేక బ్రతుకుమీద ఆశ వదులుకుని శ్శవంలా బ్రతుకుతూ గంటలకొద్దీ ఒంటరిగా కూర్చుని ఏడవడం - తన పాత జీవితం గుర్తురాగానే తన తెలివి తక్కువతనానికి నవ్వుకోడం, ఎక్కువ ఫలితం ఆశించుకున్న తన్ని తానే తనివితీర తిట్టుకోడం, తనపట్టుదల కారణంగా తన జీవితం ధ్వంసం అయినందుకు - నిష్కృతి లేదు - అని కుళ్లిపోవడం :- తన బాధ ఆ ఇంట్లో ఎవరితో చెప్పుకున్నా అరణ్యరోదనే అయింది.

* * *

ఈసారైనా సుశీలను పుట్టింటికి తీసుకు వెళదావని వచ్చారు వెంకట్రామయ్య గారు. మొదట రాజా ఒప్పుకోకపోయినా, మోటర్‌సైకిల్ నిమిత్తం ఆరువేలు ఇస్తాననడంతో తప్పనిసరై ఒప్పుకున్నాడు....

పుట్టింటి కొచ్చిందన్న మాటగాని ఆమెలో ఆనందాన్ని మచ్చుకైనా చూడ

లేకపోయారు– ఆ ఇంట్లోవాళ్ళందరూ. బంగారు బొమ్మలా వుండే సుశీల చిక్కి పాలిపోవడంలో సుభద్రమ్మ గుండె నీరైపోయింది. సుశీల అత్తవారింట్లో పడుతున్న బాధలన్నీ క్షణంలో ఊహించ గలిగింది.

పెంకితనంగా, మొండి పట్టుదలతో ఉండే సుశీల అత్తవారింటి కెళ్లేక, ఇంత సాధువుగా మారిపోవటం గిరిజకు ఆశ్చర్యాన్ని కలిగించింది

గడుస్తున్న ప్రతి ఒక్కరోజు సుశీల ఆరోగ్యం క్షీణిస్తూనే వుంది.

"ఏ వ్యాధీలేదు కేవలం మనోవేదన తప్ప" అంటున్నారు డాక్టర్లు. ఈ పరిస్థితిలో సుశీలను అత్తవారింటికి పంపించటం సుభద్రమ్మకు ఎంత మాత్రం ఇష్టంలేదు – ఇక్కడి పరిస్థితి అర్థమయ్యేలా రాజాకు కబురు పెట్టేడు రఘు.

సుశీల పరిస్థితి అర్థంచేసుకున్న గిరిజ – సుశీలను అలా బజారుదాకా వెళ్దాం రమ్మని వెంట పెట్టుకెళ్లింది. సుశీల ఏదో ధ్యాసలో పరాగ్గా గిరిజ ననుసరించి నడుస్తోంది. "హల్లో సుశీ" అంటూ ఎదురుగా వచ్చి ఆపింది రమ. సుశీల ఆశ్చర్యంగా చూస్తూ అలానే వుండి పోయింది!

"అదేవిటే సుశీ రాయిలా వుండి పోయావ్? నేనే రమని."

"నువ్వా రమా" అంది ఆశ్చర్యం నుంచి తేరుకుని సుశీల.

"అవును నేనే! ఏవిటే ఇది. బంతి పువ్వులా వుండేదానివి ఇలా కురూపిలా తయారయ్యావే?"

"ఏం ఎలా తయారయ్యాను? బాగానే వున్నానుగా!"

"నీ ముఖం– బి. ఏ. చదివే రోజుల్లో ఇలానే వుండేదానివా? నేనే మొగాడ్ని యితే ఈ లోకంలో నిన్ను తప్ప మరె వర్నీ చేసుకోను– అనేదాన్ని గుర్తుందా?" –రమ అంటున్న మాటలు వింటూ, పాత విషయాలు గుర్తు తెచ్చుకుని పరాగ్గా ఉండిపోయింది సుశీల.

"ఏయ్! ఏవిటా పరాకు? అఁ, మనం చదువుకొనే రోజుల్లో ఎంత స్నేహంగా వుండేవాళ్ళం! ఊఁ, మళ్లీ ఇన్నాళ్లకు కలుసుకున్నాం! ఏయ్ నిన్నే మాట్లాడవేఁ!" రెట్టించింది రమ.

"ఊఁ చెప్పు–"

"అన్నట్టు నీ సంగతి అడగడం మర్చిపోయేను."

"ఏముంది నాకు పెళ్లి అయింది. అత్తవారిది విశాఖపట్నం. పండక్కి నాన్నగారు తీసుకొచ్చారు?" అంది, తన ముఖంలో ఏలోటు కనిగడుతుందో నని భయపడుతూ ముక్తసరిగా సుశీల.

"అవునే సుశీ రేపు మా ఇంటికి రాకూడదూ. అన్ని విషయాలు తీరుబాటుగా మాటాడుకుందాం. అన్నట్టు రేపు

అదివారం కదూ, మా వారు కూడా ఇంట్లోనే వుంటారు. నీకు పరిచయం చేస్తాను!" అంది రమ.

"అలాగే."

"తప్పకుండా రావాలి మరి" అంటూ తన అడ్రస్ చిన్న స్లిప్‌మీద రాసి, సుశీలకిచ్చి వెళ్ళిపోయింది రమ. అంతవరకు ఫ్యాన్సీషాపులో ఏవో కొని గిరిజ తిరిగొచ్చేంతవరకు సుశీల ఒంటరిగా ఫుట్‌పాత్‌మీద నిల్చుంది.

"ఏవమ్మా మరదలా మీ స్నేహితురాలు వెళ్ళిపోయిందా?" అన్న వదినగారి పిలుపుతో, ఆలోచనల నుండి తేరుకుని ఆమెతో ఇంటిదారి పట్టింది సుశీల!

* * *

రమ ఇచ్చిన అడ్రస్ ప్రకారం రిక్షా దిగి ప్రహరీ గేటు దాటి లోనికి నడిచింది సుశీల. అబ్బ చిన్న పూలతోట ఎంత ముచ్చటగా వుంది! చిన్న డాబా ఇల్లయినా ఎంత అందంగా వుంది! మనసులో ఊహించుకుంటూ మరో రెండడుగులు ముందుకు నడిచింది. ప్రక్క కటకటాల గదిలో ఎవరో ఓ ముసలతను చంటిదానికి ప్రయివేటు చెబుతున్నాడు. మరో అతను వరండాలో వాలుకుర్చీలో కూర్చుని పేపరు చదువుతున్నాడు. తన రాకను ఎవరూ గమనించలేదు. ఆ శబ్దానికి పేపర్ చదువుతున్న వ్యక్తి ఉలిక్కిపడి, గబగబా వరండా మెట్లుదిగి సుశీల నిల్చున్న స్థలంవరకు వచ్చి ఆగిపోయాడు. ఆమెను చూస్తే అతని నోటివెంట మాటలు పెగలేదు. సుశీల పరిస్థితి కూడా అలానే వుంది! ఆశ్చర్యపోయి ఆయన ముఖంలోకే చూస్తూ అలానే నిల్చుండిపోయింది. ఎన్నో రకాల ఆలోచన్లు ఆమెను చుట్టుముట్టాయి. ఆయనే కదూ- ఆయనే. సందేహం లేదు. ఈయనే శేఖర్! ఆనాడు నేను తిరస్కరించింది ఈయన్నే కదూ, అయితే ఈయన్ని రమ పెళ్లి చేసుకుందా?"

మనస్సంతా ఆందోళనతో నిండిపోయింది. ఒక్క నిమిషం కూడా అక్కడ ఉండాలనిపించలేదు! తను వెంటనే తిరుగుముఖం పట్టేంతలో ఆయన తేరుకున్నాడు!

"రండి- లోపలికి రండి! ఇంతవరదాక రమ మీకోసమే ఎదురుచూస్తోంది" అంటూ లోనికి దారితీశాడు. వేరే గత్యంతరంలేక అనుసరించింది సుశీల! "రమా-రమా-నీ ఫ్రెండ్ వచ్చిందోయ్" పెద్దగా కేకపెట్టాడు శేఖర్! రమ చేతులు తుడుచుకుంటూ వచ్చి సుశీలను లోనికి తీసుకుపోయింది!- చిన్నాడు కర్ర గుర్రంమీద పృథ్విరాజులా ఫోజు పెట్టి ఊగుతున్నాడు. "ఓసేవ్ సుశీ వాడు మా చిన్నాడు, పెద్దది అమ్మాయి. బయట ప్రయివేటు చదువుకుంటోంది! దాని తరువాత వీడు- అంతే,

కుటుంబ నియంత్రణ అసలు

జరిపేశాం !" పెద్దగా నవ్వింది రమ ! సుశీల తను తెచ్చిన స్వీట్ పేకెట్ కుర్రాడికి అందించింది ! వాడు ఎర్రగా బొద్దుగా ముద్దుగా వున్నాడు ! కాస్సేపు ఎత్తుకుని ముద్దాడి దించింది.

"రమా నేనలా బజారువేపు వెళ్ళొస్తానోయ్ ?" అన్నాడు ఇంతలో శేఖర్.

"త్వరగా వచ్చేసేయండి.సుశీలకూడా ఈపూటకు ఇక్కడే వుంటుంది" అన్నది రమ !

"అబ్బె ఎందుకు ? వద్దు, అమ్మ నా కోసం ఎదురుచూస్తూ వుంటుంది" మొహమాటపడుతూ అన్నది సుశీల !

"అదేంవిటి ! మరేం ఫరవాలేదు ! అంతగా అయితే మీ ఇంటికి నేను కబురు పెడతాలెండి !" అన్నాడు శేఖర్ !

ఇహ తప్పదన్నట్టు ఊరుకుంది సుశీల. తన ఇంటి అడ్రస్ చెప్పబోగా

"నాకు తెలుసులెండి"_ అంటూ వెళ్లిపోయాడు శేఖర్. సుశీల ముఖం చిన్నబోయింది. అంతలోనే తేరుకుని ఇల్లంతా ఒకసారి కలియజూసింది. ఆధునిక పరికరాలతో ఆ ఇల్లు ఎంతో అందంగా వుంది !

"ఇల్లు చాలా నీటుగా సర్దావు రమా."

"ఈ ఇల్లు ఈ మధ్యనే కొన్నాం. అయినా నా బొంద నా ంత ఓపికెక్కడానా ? అన్నీ ఆయనే సర్దుకుంటారు ! ఆయనకి పూలతోటలు పెంచటవన్నా ఇల్లు నీటుగా సర్దటమన్నా ఎంత సరదా అనుకున్నావ్ ! చూడు ఎక్కడి దక్కడ అమిరినట్టు ఎంత చక్కగా సర్దారో" భర్త గొప్పతన్నాన్ని వాటిచెబుతూ గర్వంగా అంది రమ !

"అయితే అదృష్టవంతురాలవే."

"నిజంగానే_ నేను అదృష్టవంతురాల్ని కనకనే ఇంత మంచివారికి భార్యను కాగలిగాను. ఎప్పుడూ మా ఇద్దరిలో ఏ విధమైన భేదాభిప్రాయాలు రావంటే నమ్ము.ఏదైనా సమస్య వచ్చిందే అనుకో, ఇద్దరం కలిసి ఆలోచించి మంచి చెడ్డలు నిర్ణయించి ఆచరిస్తాం. ఒక్కొక్కప్పుడు నా సలహాలే ఆయ నెక్కువ పాటిస్తూ వుంటారు. అవునే అన్నట్టు అంతా నా గురించే చెప్పుకుపోతున్నాను. నీ గురించి ఒక్క మాటకూడ అడగ లేదు. ఇంతకీ మీవారేం చేస్తుంటారే_ మంచివారేనా ?" డైనింగ్ టేబిల్ మీద అన్నీ సర్దుతూ యాంత్రికంగా చెప్పుకు పోతోంది రమ.

సుశీల ముఖం కరుడుగట్టింది. ఆమె ముఖంలో విషాదచ్ఛాయలు కొట్టొచ్చి నట్టు కనబడుతున్నాయి రమకి !

"పోనీలేవే_ నీ మనసు కలతపెట్టి నట్టున్నాను! వద్దులే చెప్పొద్దు. నీగురించి ఏవీ చెప్పొద్దు ! ఈ రోజు మనం సంతోషంగా గడపాలి."

_అంటూనే వంటగదివేపు నడిచింది రమ !

రమ కాపురంచేస్తున్న తీరు, ఆమె భర్త మంచితనం, ఆ ఇంటి వాతావరణం అన్నీ ఆకళింపుచేసుకున్నాక సుశీలకు అసూయ చెలరేగింది !

నేనే ఆనాడు మాట వినివుంటే ఈ స్థానంలో వుండవలసింది రమ కాదు— నేను! సుశీల మనసులో అనేక రకాల ఆలోచన్లు ముసురుతున్నాయి.

వంటగదిలో నుండి వస్తూనే తన వాగ్దాటి మళ్ళీ సుశీలమీద ప్రయోగించింది రమ. "ఏదిఏమైనా మొత్తం మీద మా సంసారం ఎటువంటి అవరోధాలు రాకుండా హాయిగా సాగిపోతోంది. మా వారి ఉద్యోగం చిన్నదే అయినా వచ్చిందాంతో హాయిగా గడుపుకుంటున్నాం" ఇంకా ఏదో చెప్పుకుపోతూనే వుంది రమ. రమ అంటున్న మాటలన్నీ సుశీల హృదయంలో సూదుల్లా నాటుకుంటున్నాయి.

'ఎన్నో బంగారు కలలు కన్నాను! విలువైన జీవితం గడపాలనుకున్నాను! గోరువంక కూడా అందంగా వుంటేనే, చిలకాగోరింకా అని నలుగురూ అంటారని భ్రమపడి రాజాని పెళ్ళిచేసుకున్నాను! కానీ ఇప్పుడేమైంది.ఎన్నో ఆశలతోనింపుకున్న నా అద్దాలమేడ చితికిపోయింది.'

తన హృదయంలో ఏదో ఆరాటం అగ్నిగుండంలా మండుతోంది. కళ్ళ వెంట కారుతున్న కన్నీరు చెక్కిళ్ళను తడుపుతున్నాయి. మనస్సు అధీనం తప్పిపోయింది. ఎంత ప్రయత్నించినా అక్కడ వుండటం తనకు చేతకాలేదు. రమ పిలుస్తున్నా వినిపించుకోకుండా ఇంటికి బయల్దేరింది సుశీల!

* * *

ఇంట్లో అడుగుపెడుతూనే అందరి ముఖాల్లోకి ఆశ్చర్యంగా చూసింది సుశీల.

ఇంటి వాతావరణం మౌనాన్ని పాటిస్తూ అందరి ముఖాలు కళావిహీనంగా వున్నాయి. ఎవ్వరిలోనూ చలనం లేదు. 'బాలీ' వేసిన సెంటిమెటల్ చిత్రంలా వుంది. ఆ దృశ్యం. సుశీలకు ఆ పరిస్థితి అర్థంకాలేదు. ఎవర్ని పిల్చినా, ఎవరూ పలికే స్థితిలో లేరు. సుశీల అయోమయంగా రఘు కూర్చున్న సోఫా వద్దకు నడిచింది!

"అన్నయ్యా ఏం జరిగింది" అంది ఆత్రంగా.

రఘు కళ్ళు తనముందున్న టీపాయ్ మీదికి తిరిగేయి. సుశీల మౌనంగా ఆ వేపు చూసింది. కళ్ళు చీకట్లు క్రమ్మాయ్. రక్తనాళాల్లో ప్రవాహం స్థంభించిపోయింది. ఒణుకుతున్న చేతుల్తో టీపాయ్‌మీద వున్న పేపర్ అందుకుంది.

ఈ ఫోటో ఆయన్దే. ఆయనే— పేరు మోసిన స్మగ్లర్‌గా ఇంతకాలం చలామణీ అవుతూ, నిన్న రాత్రి ఐదులక్షల విలువ చేసే బంగారంతో పారిపోతుండగా పోలీసులు పట్టుకున్నారు

సుశీల శరీరం బిగుసుకుపోయింది. అమ్మా అని గావుకేక పెట్టి మొదలు నరికిన తాడిలా నేలకు ఒరిగింది. హఠాత్ పరిణామానికి పెట్టిన కేకతో అందరిలోనూ చలనం ఏర్పడింది.




(గత సంచిక తరువాయి)

## 3

ఏటీ ! సీతమ్మోరికి రావణాసురిడి మీద మనసైందన్నట్టు– నాతో ఆ బాబుకి సావాస వేటంటారా ? అక్కడే వుంది తిరకాసు.

మందుకాడ సావాసం, ముండకాడ యిరోధం వొస్తాయంటారండి తెలీనోళ్లు.

కాని మనకీ ఆ బాబుకీ కలిసింది ముండకాడే.

ఆ బాబుది అసలు సీతంపురం అగ్గ

రారం. మనకా ఊళ్లో దూరపు సుట్టాలు న్నారండి. ఆసుట్టాఁగుంట "సీతమ్మ"ని ఒక త్తె వుండీదండి. నలుపైనా నిగ నిగ లాడు తూ- ఇలా- సింతపిక్కలా గుండేదండి.

మూరిడు ముక్కు-ముంతంత కొప్పు- రూపాయంత బొట్టు- చారడేసి కళ్లు- యింతకో జెబ్బ-అంతకో చెమించాల- బూతు లొచ్చేస్తున్నాయి- తొడలు అగ పడుతూ కోక ఎగ్గట్టి ఒంగొని పొలంలో నాట్లేస్తూవుంటే- దానితల్లి సిగ్గోసిరి- మా ఏపు ఆడోళ్లకి రైకలుండవేమో- ఆడోళ్లకూ్కడా మనసొద్ది దానిమీద.

మనకి తగిలోళ్లళ్లలో మూడోదో, నాలుగోదో అది. మనకంటే వొయసులో కుసింత పెద్దే ననుకోండి- కాని యిలాఁటివిషయాల్లో పెద్దా, సిన్నా అని సూసీవోవో- సూస్తూ వూరికుండి పోవల్సిందే మరి.

దాన్ని పిటాపురం యిచ్చినారండి. అయితేనేం, కన్నెరికం బేరవేఁమో- మనమీద మోజుపోనాదికాదు దానికి.

పాపం, ముందఁటేడు లారీ కుమ్మేసి నాదండి దాన్ని. ఆ లారీ కూడా ఎల్లకి తలా పడిపోనా దనుకోండి.

ఎంతవొరకూ పెప్పినామూ ఏటో మళ్లీ- కనుప్యూజు అయిపోతన్నానండి. ఓపాలి సంకురేత్తిరికి కన్నోరింటికొచ్చి నాదండి ఆ గుంట. ఒచ్చింది పోనీ ఒల్ల కుండొచ్చా? మనకి కబురెట్టినాదండి. పాత కాతా కబురెడితే- ఎల్లకపోతే అగుమానం అయిపోద్దిగాదండి? మరం చేత బయలెల్లినానండి.

అప్పటికింకా అగ్గురోరానికి బస్సులు పడనేదండి. కొత్తరోడ్డుకాడ బస్సు దిగేసి నడిసెత్తున్నానండి.

సిన్న సీకటండి.

ఊరంతా మసక, మసగ్గా అగపడు తున్నాదండి.

నాను ఊరసెరువుకాడ కొచ్చినానో నేదో- బుగతగోరి పశవుల పాకలోంచి ఓ ఆడదాని యేడుపూ, కేకలు, తిట్లూ యినపడినాయండి. అసలా కేకలూ ఎంత గట్టిగున్నాయంటే. మాటలొచ్చిన పశువు తిడుతుందేమో అనిపించినాదండి.

మనిషైనా- గొడ్డైనా అంత అరు స్తుంటే ఒల్లకోలేంకదండీ? మరంచేత పాకలోకి పరిగెత్తినానండి. అప్పుడు నాను జూసింది నిజవేఁనా అనిపిస్తాదండి నా మట్టుకు నాకే-అప్పుడప్పుడు.

పాకలో పశువులు బెదిరిపోయి తోక లెత్తేసి, గెంతుతూ అరుస్తున్నాయండి.

ఏటా అవి సూద్దునూ! గుండెలమీద పైట నేదండి. కాళ్లమద్దెన కోక ఎగ డుతూ "ఓ గుద్దు గుద్దినానంటే- యేరే గొయ్యి తియక్కర్నేదు. బూఁవిఁలోకి దిగడిపోతావు. నా ఊసు తెల్దేటో! రా- రా- నంజికొడకా- రా- నీ బతుక్కి- ముంత కావాలా?" అంటూ తిడుతున్నా దండి. యెవరూ? సీతమ్మ.

దాని వాలకం జూస్తే అప్పటికే ఎవుడోన్ని ఒకడ్ని-సంపేసినట్టున్నాదండి. శవం ఏమైందా అని సూద్దునూ- శవం నేదు గానండి-

శవంలా తొంగునున్నాడండి అచారి బాబు పేడకుప్పలో. "ఈ గండం గనక తప్పిపోనాదంటే మరింక- యీ జనమలో పెళ్లామ్మీద కూడా సెయ్యేస్తే ఒట్టు" అన్నట్టుందండి ఆ బాబు సూపు.

ఆ బాబు మనకంటె పదేళ్ల పెద్దేనను కోండి. అప్పట్లో ఆ బాబు వాకీలుగా అప్పుడప్పుడే పైకొస్తున్నాడండి. మన బుఱ్ఱ పాదరసంలా పరిగెత్తినాదండి. మనం జేసే పనికి యెలాగా ఒక వాకీలు కావాల. ఓపక్క పోలీసోళ్లని మేపనేక చస్తుంటే మరో పక్క వాకీళ్లు చీకుక్కి తినేస్తున్నారు.

మరంచేత పెంచితే యిలాటోడ్నే పెంచాలనిపించినాదండి. ఎంటనే సీతమ్మని రెక్కట్టుకొని పాకవతలకి లాకెళ్లినానండి; అదే గనక పతివ్రాతైతే దాని తిట్లకి - అచారిబాబు - పెళ్లాం పిల్లల్తో యేరే కఱ్ఱల దండగ నేకుండానే బుగ్గైపోయీవోడండి.

మరింక సెప్పడానికేటుందండి? అచారిబాబుని నెగదీసినానండి. సెర్లో గేదెని కడిగేసినట్టు నూతికాడ- కడిగీసి నానండి. అసలే సంకురేత్తిరి సలేమో- యిలాగ యీకత్తీసిన కోడిలా అయిపో నాడండి సలికి.

ఊర్లో పంచాయతీ సెయ్యకుండా పది రూపాయలుపారించీసినానండి సీతమ్మకి- ఆ బాబుచేత.

మరంతేనండి. ఆ యేళకాడినుంచీ ఆ బాబు మనవంటే కుక్కే.

## 4

ఏటి బాబూ? నా పనేటని అడుగు తున్నారా?

యిందాకే సెప్పినాను గదండీ? అసలు అన్ని పనల్లోకీ పడుపువృత్తి పాతదంటారండి తెలినోళ్లు-కాని దొంగ తనవేఁ అన్నిటికంటె పాతదండి. నా నెప్పుడూ అబద్దం ఆడనండి.

మనకిందో గేంగుందండి. అళ్లు కుఱ్ఱోళ్లగారండి. పిల్లి పిల్లలకంటె మెత్తగుంటారండి. అయితేనేం? అవ సరమైతే- పులి పిల్లల్లేం కర్మ- పెద్ద పుల్లే అయిపోతారండి.

ముందపేడండి- ఈఁవఁరు గోరికి తెల్దో- ఏటో- గాని- లచ్చింపేటని ఒక వూరుందండి. ఆ ఊరి సాలోడొకడు పట్నం సినీమా కొచ్చినాడండి. ఒక్కడూ కాదండి. పెళ్లాన్ని కూడా ఎంటేసుకొని మరీ ఒచ్చినాడండి మలాట జూసినా రండి ఇద్దరూ. బయట కొచ్చినాక ఆ జనంలో పెళ్లాం అగుపళ్లేదండి అడికి. ఎతికి- ఎతికి అఁకరికి తెల్లారి పోలీసో ళ్లకి రిపోరటు యిచ్చినాడండి. అళ్లకి సదివింపులు కూడా సదివించినాడండి. అకరికి ఏటితేల్నాదీ అంటే-అడి పెళ్లాన్ని

జెకరయ్యగోడు ఎత్తుకెళ్లి కమలమ్మ కంపెనీకి అమ్మేసినాడటండి. యీ సాలోడు పోలీసుల సుట్టూ తిరిగి తిరిగి అడి సెప్పులే గాదు కాళ్లు కూడా అరిగి పోనాయండి. యింక యీళ్లు నా పెళ్లాన్ని నాపక్కలో తొంగోపెట్టరనుకున్నాడో— ఏటో—ఆడు తిన్నగా ఎళ్లి—ఆ కమలమ్మ కాళ్లట్టుకున్నాట్టండి.

అన్నట్టు కమలమ్మని తమరెరుగో రెర గరు కదూ! అదండీ—యీసిఫారం ఏస్తే ముసలహేడ్డునాగుంటాదండి. తీసేస్తే అది మొగుడి నాగుంటాదండి. మందెయ్యనప్పుడు రాచ్చసిలాగా, ఏసి నప్పుడు బెమ్మరాచ్చసిలాగా ఉంటాదండి. దానికి రౌడీల సపోర్టుందండి. పోలీసోళ్ల కు మక్కువుందడి. దాని నెత్తిమీద పండెంట్రుక ముక్క మిలిట్రీవోడు కూడా తెంపనేడండి. దానికి సూపరెంటు బాబే ఓ దణ్ణమెట్టేసినాడండి. యీ సాలె సంజికొడుకు ఒక నెక్కా? దాని తెలివి ఏటనుకున్నారు?

ఆఫీసర్లలో— ఎవుడికి పారీవాలిసింది ఆడికి పారేస్తాదండి. డబ్బు గావలిసి నోడికి డబ్బు— మందు కావలిసినోడికి మందు— గుంట కావలిసినోడికి గుంట— మూడూ గావలిస్తే మూడూ పారేస్తా దండి. ఇక దాని కంపెనీలో గుంట లంటారా? యెట్టినదాన్ని యెట్టకుండా యెనకై సినీమాలు తీసేవాళ్ళండి దాజుగోరికాస్నించీ— రిచావోడి వారకూ, ఎలాటోడికి అలాటిదాన్ని అంటించేస్తాదండి. కాని ఒక్క యిసయం ఒప్పుకోవాలండి. ఎవుడో— ఐక్లాసు ఆఫీసరులాటోడు తప్పిస్తే, ఎవుడన్నాసరే గుంట కావాలంటే— దానింటికి పోవల్సిందేనండి — అలాటి కమలమ్మ యీ సాలోడు అడగ్గానే "యిందరా నీ పెళ్ళం — తీసుకుపోరా" అన్జెప్పి యిచ్చేస్తాదాండి యీడి ఎర్రిగాని!

ఆఁ. యీడెళ్లి దాని కాళ్లట్టుకున్నాడని జెప్పినాను గదండీ? అది ఈడి ఏపు సచ్చిన సాలెపుడుగుని జూసినట్టు సూసి "చెడినదాన్తో కాపురం ఏటి సేస్తావు?" అందటండి — కాళ్లు యిడిపించుకోకుండా—

"నేకపోతే దానిమీద నాను పదు పెట్టిన నూడువేలూ యిచ్చి—వొడ్డీ ఒగ్గిసుకుంటాను. ముదనష్టం బేరంలోకి దిగేననుకొని" అందటండి.

"యింకా దాన్నొగ్గనేకపోతే— నాకాడ జీతానికుండు. పాసింజర్లకి— పకోడీలూ— గట్రా తెద్దువుగాని" అనికూడా అందటండి.

యీడు ఏటంటాడండి? సెవులూ, నోరూ మూసుకొని నాకాడకొచ్చి నా కాళ్లు సుట్టేసినాడండి. నాకాడ కెలాగొచ్చినా డంటారా? మా దద్దగారిది అడి ఊరేనండి. మన గొప్ప మా దద్దకి తెలుసుగదండీ? అంచేత మా దద్దగోరి మనిషంట్ని ఆ సాలోడు ఎంటబెట్టు కొచ్చినాడండి

మిరండి– ఆ సాలోడు ఎలాగున్నాడను కుంటారండి?

అడ్ని సూస్తే పోలీసోడికూడా వొణ్ణం సయించదండి

మడిసి బెగిలిపోనాడండి

తల్లిని చూసినా జడుసుకునేటట్టున్నాడండి

ఓపాలి పిలిస్తే పలకడండి

మరోపాలి పిలిస్తే తుల్లిపడ్తాడండి.

అదండి సంగతి.

అదు నా కాళ్ళ పాఁవుఁలా సుట్టేసినాడు కదండీ. అడుమామూలుపాఁవైఁతే, ఆ కమలమ్మ ముండ కొండసిలువండి. దాన్తో యవ్వారవంటే డబుల్ డేంజరండి పోనీ మన అసిస్టెంటుగోళ్లని పిలిసి "పోయి దాని కంపెనీలో జొరబడి ఆ సాల్దాన్ని ఎత్తుకొచ్చీయండ్రా" అంవావంటే దాని రౌడీలు యీళ్లని పెరట్లో పేనాల్తోనే పాతేస్తారండి.

మరింక ఏటి దారి? అని ఆలోచించినానండి. దారి దొరకనేదు కానండి– సిన్న ఉపాయం దొరికినాదండి. మన అసిస్టెంట్లలో అకురాయిల్లాటోళ్లని అర డజను మందిర్ని ఏర్నానండి. ఆ పూట సారా తాగవఁని అమ్మమీద ఒట్టు ఏయించుకున్నానండి అళ్ల సేత. అళ్ళందర్నీ కమలమ్మ కంపెనీకెళ్లి ఆ గుంటనే అడగమని సెప్పినానండి. ఏటలా జూస్తున్నారు? ఒక్క గుంటకి ఒక్క రేతిరి యింత మందిరా అనా? తఁవఁరుగోరి కిలాటి యిసయాలు తెలవ్వంది మరి– ఒక్కో గుంటున్నాదంటే– ఒక రిజర్వు ప్లేటూనుకి సరిపోద్దండి అదలా ఒగ్గేయండి

సరే మనోళ్లు ఎళ్లినారండి. అందులో మొదటోడు ఆ గుంటతో "ఒలే–అమ్మీ– మాఁవుఁ నిన్ను ముట్టుకోడానికీ, ముద్దెట్టుకోడానికి రానేదు నా ఎనకునోళ్లు– కాపలావోళ్లని మంచిచేసుకొని మందు పట్టిస్తారు. నువ్వు మా త్తరం సెట్టుకింద సీతమ్మోరిలా ఏడుస్తూ కూకోక కుసింత ఉషారుజెయ్యి. ఒకడ్ని బైటకంపించి మరోడ్ని పిలిసేటప్పుడు యీలుజూసుకొని ఒకడితో వొచ్చీ. మలుపుకాడ మన "ఆటో" వుంది. నీ మొగుడికాడికి నిన్ను జేర్చడాని కొచ్చినాం గాని నిన్ను సెరస డానిక్కాదు!" అని అన్నీ యివరంగా సెప్పినాడండి. అడితో బైటకొచ్చినప్పుడు ఆ గుంట వుషారుజూసి కమలమ్మ కళ్లు నులుముకుందటండి. "ఏటీ నాను కల గంటున్నానా?" అనుకొని.

మనం ప్లాను ఏసీసాఁవూఁ అంటే– మూడుకళ్లోడు–అదొచ్చీవొరకూ దానికి తిరుగుండదండి. అయిదోవోడితో ఆటో ఎక్కీసినాదండి ఆ గుంట.

నాను సీరావఁ సెంద్రుడ్ని గాను గానండి యిలాటి కంపెనీ యవ్వారాలంటే నాకు గిట్టదండి. నా నీతి నాకున్నాదండీ.

మనకో "తీరీ" "ఫిలాసఫీ" ఉన్నాయని ముందరే మనివిజేసినాను గదండీ. నాను దొంగతనం జేస్తానండి.




కాదన్నండి. దొంగతనం – నేరవోఁ కాదో తవఁరి గోరికి తెలుసనుకోండి– గాని నా పెకారం అది పాపం కాదండి.

## 5

ఏటీ! నాకు పెళ్లైందా అనడుగుతున్నారా? అయింది బాబూ అయింది మాలాటోళ్ల పెళ్ళిళ్ళకిమంత్రాలూవుండవు బేమ్మడూ వుండడండి. పెళ్లికాక ముందర నాను బెమ్మచార్నిగాను నా పెళ్లాం పతివ్రౌతా గాదండి.

ఒక తెప్పుకేసు – అవుస్ బ్రేకింగైనా కాదు – సిన్న పిక్పాకిటింగు – అంతే – మూ దేళ్లేసీసినాడు మేస్టీటు బాబు. అదంతే – అ బాబు, మద్దరు కేసులో ముద్దాయిగోడిని ముద్దెట్టుకోమన్నా ఎట్టేసుకుంటాదేమోగాని, తెప్పు కేసంటే మాత్తరం తెగ మండిపడతాడటండి. అదేటంటారా? దానికో సిన్న కతవుంది లెండి. ఆ బాబు సదూకునీ రోజుల్లో ఓపాలి అయిదరాబాదెత్తే ఎవుడో పరుసు కొట్టేసినాట్టండి. సేతిలో కాన్లేక పస్తులుండి తిరిగొచ్చినాడటండి. మరోపాలి ఆ బాబు పెళ్లాం సుట్టాలింటికి పెళ్లికెళ్లి వస్తుంటే ఒంటిమీదున్న జవ్వరీ నిద్దర్లే చేసరికి నేదటండి.

మరంతే – ఆ బాబు మేస్ట్రీటు అయినకాడ నుంచీ – "ఏపీపీ." ఒగ్గేమన్నా ఒగ్గడటండి. ముష్టి మూడ్రూపాయల పరుసు కేసండి నాది– మూడేళ్లన్నాడండి. నాను జైల్లో–ఇక ఆరువోరాలకి వొగ్గేస్తారనగా – కొలిసుట్టు జూసినానండి బీగాన్ని –బీగం అంటే మా ఆడదిలెండి.

బ్రోతల్ ఏక్టు కేసులో – బూతు పాటలు పాడిందని ఆరువోరాలు ఏసీసినా

రటండి. నాకు తెలకడుగుతా కావండి-బాబూ ఆ యాపారంలో బూతు పాటలు పాడక- బక్తి పాటలు పాడితే సాగుద్దేటండి యాపారం? మళ్ళా బంగళాల్లో బూతులు మాత్తరం నీతులు గానే సూస్తారండి. నా నోటి సెప్తానండి జెనమలో మరో ఆడదాని రెక్కట్టుకోవి మొగోడికి అడి పెళ్లావేఁ వొల్లదండి. ఏ పురాణం యిన్నా బూతుకతే కదండి.

నన్నడుగుతే- మొగోదెవడన్నా సరే- అడు

ప్లీడరైనా - పారిటీ అయినా
ముద్దాయైనా - మేస్ట్రీరైనా
యస్పీ అయినా - అర్దర్లీ అయినా
తెల్లోడైనా - నల్లోడైనా
పొడుగోడైనా - పొట్టోడైనా
అకరికి

పాకీవోడైనా - ప్రైమ్మినిష్టరైనా - సరే-మీసవుఁన్న మొగోడ్నెవడన్నా సెప్ప మనండి - గుండెల మీద సెయ్యేసుకుని సెప్పమనండి - అలాంటి పన్జెయ్యనేదని సెప్పమనండి.

సెప్పడు. సెప్పనేడు. అంతే.

ఒకేళ - అలా నిజెంగానే - గుండెల మీద సెయ్యేసుకుని-ఎవుడన్నా సెప్పినా డంటే - అడు గుండెల్లేనివోడైనా అవ్వాలి - నేకపోతే గుండెల్తీసిన బంటైనా అవాలి

నా మాటబద్దమేఁవోఁ! ఓపాలి.... అలా....అలా.... ఏటంటారు సెప్మా? అఁ- "సెవెన్ మూన్స్" ఒటేలు- ఏడంతస్తులుంటాదే....అక్కడికి రేత్తిరేళ వొద్దులెండి - మద్దేనపేళ ఎళ్ళినా సరే, దేని మొగుడికాడ అది తొంగుంటే, నన్ను తొత్తుకొడకా అని పిలండి. నాను పలుకుతాను.

చెమించాలండి ఏటో సెప్పటోయి ఏటో సెప్పేస్తున్నానండి.

బీగాన్ని జెయిల్లో సూసినానా? అదేటోగాని సినీమాల్లో సూపించినట్లు మమ్మల్నిద్దర్నీ ఒక్కపాలే ఒగ్గినారండి. ఇద్దరం బైటకొచ్చినావండి. నానే ఓ పాక ఒటేలుకి తీసికెళ్లినానండి. ఇద్దరం "టీ" తాగినావండి. అనక - ఓ సెట్టు వోర కూకున్నాక -

"ఇదిగో సూడూ - నువ్వు పతివ్రాత వని నాననుకోను. నాను సీరామ సెంద్రుడ్నని నువ్వూ అనుకోక. నీ కిష్టవైఁతే కలిసుందాం. పెళ్లీ ఒద్దు. పెడాకులూ ఒద్దు.

యిడిపోయీ వోళ్లని పెళ్ళాపదు.
కలిసుండే వోళ్లకి పెళ్లక్కర్లేద్దు.

"కాని ఒక్కమాట-నువ్వు నీ వృత్తి మానియ్యాల. నీ దానికన్నా నాదేం గొప్పదని కాదు. కాని నీ పన్లో వొళ్ళు సెడతాది - నా పన్లోనూ సెడతాదనుకో దొరికిపోతే - కాని అదో రకం సెడ్డం. ఆలోసనజేసి సెప్పు - కలిసుందావోఁ, వొద్దో" అన్నానండి.

"కాన్నాకో కాడుకున్నాదే"అందండి.

"నీ బేటా బాబెవడని అడగను సరా" అన్నానండి.

అంతే.

గుడి కెళ్ళనేదండి

మసీదు కెళ్ళనేదండి.

బేమ్మడ్ని పిల్నేదండి,

ముల్లానీ పిల్నేదండి.

సక్కగా—సుకంగున్నావండి అప్పటి కాడ్నించీ -

యీకాలం పెళ్ళాలకంటే పతివ్రాతే అది. అయినా సరేనండి. నాను జెయిలు కెళ్తే మాత్తరం దాన్ని పోలీసోళ్ళు అల్లరిపెట్టేస్తారండి.

నాను మైసూరు మారాజుని గాను.

జైపురం జమీన్దార్ని కానండి.

కాని - నాకంటూ - స్పెషల్‌గా ఓ అడదంటూ వుండాలని మా సెడ్డ ఆశ ఉండేదండి. భగవంతుడి దయవాల్ల అది తీరిపోనాదండి.

"సిటీలో బతకాల్సినోడివి. ఏటీ పల్లెటూరి పితలాటకంలో యిరుక్కు-పోనావ్ ?" అంటారా. మరక్క-డేనండి తిరకాసు.

నా జ్జే సి న పనికి - నానే మరో యాబయ్యేళ్ల - బతికుంటే - బూ‹వీ‹- బంగారప్పతకం- యిస్తాదండి గవుర్న మెంటు.

సరీగ్గా అయిదేళ్ళ కిందటండి-అచారి గోరింట్లో జూసినాడంపి నన్ను-ఎవుడూ? యెంకటరవ‹ణ బాబు. అప్పుడా బాబు కంటపడకపోతే నా యిష్టరీనే మారి పోయీాదండి.

ఆయేళ ఆ ప్లీడరుగోరి ఆఫీసుకెళ్లి నానండి. ఎందుకంటారా? అదే సెప్తున్నా నండి.

ఆ ముందురేత్తిరి మా యాదది మలాట సినీమా కెళ్లినాదటండి.

నా యాపారంమీద నానెల్లిపోనానండి. కలకత్తా కాశిగోడని.... ఆకు యిసప్పెట్లు బిడ్డలు కొట్టడానికీ, పోలీసోళ్లచేత యీపు బిడ్డలుకొట్టించుకోడానికీ పుట్టి నాడండి.... మన్ని సేతిలాగవం- అంటే- అ స్త లా గ వం - బిజినెస్సండి. ఇళ్లక్క-న్నాలు కొట్టవండి మనం.

శెవం జోబీలో పరుసు కూడా తియ్యడండి కాశిగోడు.

కాని హార్బరులోంచి-షిప్పు తెచ్చీరా అంటే తెచ్చేస్తాడండి

లోకోషెడ్డులోంచి రై లిం జను తెచ్చీరా అంటె తెచ్చేస్తాడండి.

ఆదే నచ్చజెప్పినాడండి- ఏటనీ? "ఒరే-కెప్టెనూ నాతో వోటా కూ‌డా-కోపరేటివు కోటసీలో ఓ యిల్లున్నాది-యింటోళ్లు తిరపతెళ్లినారు-నీకు తెలుసు గదా-ఏ తాళవ‹న్నా ఊడదీసీగల్ను నాను. నా నొక్కడ్నీ ఎల్లనేక గాదు-ఏదో సిన్నప్పటి ఫ్రెండువిగదా సపోరటు వుంటావని" అని బతిమాల్నాడండి.

ఆదిగో - ఆ డూటీమీదెల్లిపోనానండి ఆ రేత్తిరి.

మా యాదది మలాట సినిమాకెళ్లిందా? ఆటైపోనాక యింటికొచ్చేస్తుందటండి.

మద్ది తోవలో- 'వేన్' ఆపినారటండి పోలీసోళ్లు. వేను దిగినాట్టండి అడ్డబుర్ర హేడ్డు.దిగినోడు-దిగినట్టే ఒల్లకుండాలా? అహా. మా యాడదాని మొకంలో మొకవెట్టి "ఇంత సీకట్లో యీ సీతమ్మోరెవరా అనుకున్నాను. ఓసీ, నువ్వేనా! ఎక్కు ఎక్కు"అన్నాడటండి.

"నానా పని మానీసినాను గదా" అందటండి అది.

"ఏట్రా పేచీ?" అని అరిసినాడటండి ముందుసీట్లోంచి ఇనస్పెట్టు.

" పత్రివ్రాతై పోనానంటున్నాదండి " అన్నాడటండి హేడ్డు.

"వేన్లో వున్న ప్రెతీ లంజా అమాటే అందని జెప్పు-బేగి వేనెక్కమను-నేక పోతే వేనుకింద పడిపోద్దని చెప్పు" అన్నాట్టండి ఇనస్పెట్టు.

అడ్డబుర్రగోడూ, మరో యిద్దరు "పీ.సీ."లూ కలిసి - మా యాడదాన్ని బలవంతంగా వేనెక్కించేసి తీసుకు పోనారటండి.

ఆ మర్నాడు పొద్దున్న నాను యింటి కాడ కొచ్చేసరికి ఏటుందీ? సంగతెలిసి స్టేషనుకి పరిగెత్తినానండి. అక్కడ మా యాడది కాక మరో పదిమంది ఉన్నారండి - ఆడోళ్ళు.

అడ్డబుర్రగోడ్ని పిలిసి "ఏటి యవ్వారం?" అనడిగానండి-అంటే నీకు తెలని యెవ్వారం ఏటుంటాదిరా? కొత్త యేయస్పీ దిగినాడు - నిన్ననే - కలకతా వోడట.... మాఅపీసర్లు దండలేసినారు. ఇంతకీ-దండలేయించుకోడాని కూడా ఓ యోగం ఉండాల - ఆ బాబు కదినేదు- దండలన్నీ మావోళ్ల మొకాల్ని కొట్టేసి నాడట. కొట్టినోడు-కొట్టినట్టూ ఊరుకోక ఓ స్పీచి కూడా ఇచ్చినాడట - ఏటనీ - సంగానికి జబ్బు సేసిందన్నాడట పోలీసోళ్లకి పెద్దరోగవన్నాడట. పోలీ సోళ్లు బతికీది వొణ్ణం తినిగాదు, గేంబ్లింగు డెన్నులూ, బ్రోతల్ హౌసులూ తిని అన్నాడట తన హయాంలో - లంజెరికం, జూదం సాగ నివ్వనన్నాడట. పదిరోజుల్లో- పోలీసోళ్ల పెళ్లాల పుస్తెలమ్మించీకపోతే - తను - ఐ.పీ.యస్సోడ్నే కానన్నాడట. యింకే టుంది? తిరిగొచ్చిన మా ఆపీసర్ల మొకాలు జూడాల - పక్కింటాడితో పెళ్లాం లెగిసిపోయినట్టున్నాయి మొకాలు

మరంచేత - రేత్తిరి రెయిడింగ్ కి బైలెల్లినారువు. ఏ కంపెనీ కెల్లినా సీతలుకాకపలాలున్న లచ్మనుల్లా ఉన్నారు రౌడీ నంజకొడుకులు-అక్కడికి మావేదో రావణాసురుళ్లైనట్టు.

మాకేటి గతి?

కలకత్తావో డాచ్చేడన్జెప్పి- కంపెనీ లోళ్ళతో కసాలా పన్లేం కదా-పడితే పెళ్ళాల్ని పుట్టిళ్ళకి అంపేవల్సిందే పోషించనేక- మరంచేత బతిమాలా డ్నాము- బియం కూడా పెట్టినావనుకో! నానో మాట సెప్తా ఇంటావా! ఏటంటే

బొక్కల బనీనుందండి.

మూరెడు జుత్తూ- జానెడు మీసం ఉన్నాయండి.

మొలని ఇత్తడిగుండీల బెల్టుందండి.

కుడిసేతికి తోలు పటకా ఉందండి.

నోట్లో బీడీ ఉందండి.

సేతిలో లాఠీ ఉందండి.

అచ్చు సినీమాల్లో రౌడిలాగున్నానండి -అప్పుడు.

మన సైజు సూస్తున్నారు కదండీ. నచ్చిన్నాడు మొయ్యడానికి నలుగురు సాల్రు. రెండు పుంజీలు కావాలండి.

అయ్యేళ ఏటి జరిగిందో మూడు ముక్కల్లో సెప్పేస్తానండి. ఎంకట్రవణబాబు లోనికెళ్లినాడు గదండీ? అప్పుడే ఆచారిబాబుకాడ నాగురించంతా టోగట్టా పీకినాడటండి ఆనక ఆచారిబాబు నన్ను లోనికి పిలిసినాడండి. పిలిసి, ఎంకట్రవణతో "కావాలంటే అడి లాఠీతోనే- అడి జబ్బమీద దెబ్బ ఏసి సూడు. యిరుగుతే అడి లాఠీ ఇరుగుద్ది. నేకపోతే నీ సెయ్యి యిరుగుద్ది. అంతే- కానాడికి సెదనం వుండదు" అన్నాడండి.

ఆ తరవాత- ఆచారిబాబే అంతా సెటిల్ సేసేసినాడండి. నాను ఎంకట్రవణబాబుకి బాడీగార్డుగా ఎల్లడానికీ- ఆ బాబు నన్ను పోషించి- నెలకి నూటయాభై జీతం యివ్వడానికీ- మా యాడదాని సేత- ఉల్లాళ్లోసే- ప్రెసే "టీ" కొట్టు ఎట్టించడానికీ, ఏర్పాటు జేసినాడండి.

నాకూ ఆ బేరం నచ్చినాదండి. అప్పటి వోరకా నాను బతికీ బతుకంటె నాకీ బతుకంటే- యిసుగొచ్చేసినాదండి అంత వోరకా దొంగతనాలు జేసి పోలీసుల్ని పోషించినాను- గాని- నాను సుకపడ్నేదండి. నాకంటూ నాకు ఏటి మిగిల్నాదండి? పోలీసోళ్ళ దెబ్బలూ- స్టేషన్లో జాగరాలూ- పైగా స్టూడెంటు కుర్రాళ్ళ "టూరు" కెళ్లినట్లు ఏడాదికోపాలి జైలుకెళ్లడం. మరింక యీ బతుకొగ్గేస్తేనే బాగుంటాదనిపించినాదండి.

మరంచేత-మా యాడదాన్తో మాటాడకుండానే ఉజ్జోగానికొప్పేసుకున్నానండి. అదెప్పుడూ నామాట కాదన్దులెండి.

నాను పనిలో జేరకముందు ఎంకట్రవణబాబు 'ఇస్టరీ' నాను యినదవేఁగాని- నాకు సొయంగా తెల్దండి- ఏటి బాబూ- అదికూడా కావాలంటారా? మర్తైతేనండి- అల్లదుగో- గంగిరెద్దులా బుర్రకి కట్టుకొని- గాల్లో రెండు కాళ్లూ ఏళ్లాడేసి సచ్చిన కొంగలా గున్నాడే- సన్నాసి గోడు, అడ్నడగండి. సెప్తాడు. అదికంతా సొయంగా తెలుసండి.

(సశేషం)




ఇండికేటర్ డ్రాప్ అయింది.

ఆపరేటర్ జాక్‌లో ప్లగ్ ఇన్‌సర్ట్ చేసి "కె.జి." అంది. కె.జి. అంటే షార్ట్‌ఫాం. ఫుల్‌ఫాం ఈజ్ కింగ్ జార్జ్ హాస్పిటల్ అన్నమాట.

"గెట్ మి భావనగర్-బి" అవతలి వైపు ఓ పురుషకంఠం పలికింది

ఆపరేటర్ కనెక్ట్ చేసింది.

భావనగర్ బి నర్స్ ఫోనెత్తి "భావనగర్-బి ప్లీజ్" అని అంది.

"నమస్కారమండీ!" పురుష కంఠం.

"నమస్కారం. ఎవరు కావాలండీ?"

"బాగున్నారా?"

"బాగున్నాను. మీ కెవరు కావాలో చెప్పండి?"

"మీ రెవరు మాట్లాడుతున్నారు?"

"ప్రొబేషనర్ని"

"పేరేంటి?"

"నా పేరు మీ కనవసరం మీకెవరు కావాలో చెప్పండి. పిలుస్తాను."

"నా కెవరూ వద్దు. మీరే కావాలి. టెలిఫోన్లో మీ కంఠం ఎంత తియ్యగా వుందో తెలుసా! ఒక్కసారి మిమ్మల్ని చూస్తే నా జన్మ చరితార్థమౌతుంది."

"ఓహో. అదా సంగతి. నోరు మూసుకు ఫోను పెట్టేయండి" అంటూ నర్స్ రకీమని ఫోను పెట్టేసింది.

పురుషకంఠం మళ్ళీ ఫోనుచేసింది.

ఇండికేటర్ డ్రాప్ అయింది

ప్లగ్ ఇన్సర్ట్ చేసి మళ్ళీ "కె.జి." అంది ఆపరేటర్.

ఆ పురుషకంఠం మళ్ళీ అదే వార్డు అడిగింది.

ఆపరేటర్ కనెక్ట్ చేసింది.

పురుషకంఠం మళ్ళీ నర్స్ ను పేరడిగింది.

ఆమెకు చిరాకేసింది. పైకి తిడితే ఆ పురుషకంఠం తనమీద దాడిచేస్తుం దని మనసులోనే 'ఇడియట్' అని తిట్టుకుని మాట్లాడకుండా ఫోన్ పెట్టేసింది.

అదే సమయంలో—

మరో పురుషకంఠం మరో వార్డుకు ఫోన్ చేసింది ఆ నర్స్ ఫోనెత్తింది

"బాగున్నారా?" పురుషకంఠం.

"మీ రెవరు?"

"మీ పరిచయాన్ని కాంక్షించే ఓ అబ్బాయిని"

"ఎందుకు మీరిలా వార్డులకు ఫోన్ చేసి మమ్మల్నేడిపిస్తారు? మీకూ అక్కచెల్లెళ్ళు లేరా?"

"వున్నారు. కాని, వాళ్ళు చాలా పతివ్రతలు" పురుషకంఠం గొప్పగా పలికింది.

'మా నర్సులమేనన్న మాట పతితలం' ఆమె మనసు బాధగా ఆక్రోశించింది. మౌనంగా ఫోన్ క్రేడిల్ చేసింది.

అదే సమయంలో—

మరో వార్డు

ఇంకో వార్డు

చెప్పలేనన్ని వార్డులు పురుష కంఠాలు తెల్లవార్లూ ఫోన్ చేస్తూనే వుంటాయి. నర్సులను ఏడిపిస్తూనే వుంటాయి

కె.జి.హెచ్. ఆపరేటర్ని వార్డులకు కనెక్షన్లు అడుగుతూ తెల్లార్లూ ఆమెను గజిబిజి పెడుతూనే వుంటాయి.

నర్సులకూ విసుగేస్తుంది. ఆప రేటర్ కూ విసుగేస్తుంది. అందుకే

ప్రొఫెషనర్సు (నర్సెస్) ఆపరేటర్‌తో "ఎవరు ఫోన్‌చేసినా ఎవరు కావాలో అడిగి మరీ కనెక్ట్‌చెయ్యండి" అని చెప్పేస్తూంటారు.

ఆపరేటర్ అలాగే చేస్తుంది. వెంటనే పురుషకంఠాలకు కోపం వస్తుంది. ఆపరేటర్నే ఏడిపించడం ప్రారంభిస్తారు. ఆమె కాల్ అటెండ్ చేసి "కె.జి." అంటే "కె.జి." ఎంతండీ ?" అనడుగుతారు, కూరగాయల బేరంలా. లేకపోతే ఆమెనే పేరడుగుతారు. ఆమెనే ఏడిపించడం ప్రారంభిస్తారు. "మీరు మాకు వార్డులు కనెక్ట్‌చేస్తారా ? లేక పోతే మిమ్మల్నే ఏడిపించమంటారా ?" అని అడుగుతారు. ఫలితంగా ఆమెకు ఇష్టంలేకపోయినా కనెక్షన్స్ ఇవ్వడం పరిపాటి.

కొంతమంది నర్సులను "ముద్దిస్తారా?" అనడుగుతారు. మరి కొంతమంది "భోజనం పెడతారా ?" అనడుగుతారు. ఆ రోమియోల భాషలో "భోజనం" అంటే తమతోపాటు పాన్పుపై పవళించడం అన్నమాట ఎంత ఘోరం?

టెలిఫోన్ రోమియోలలో టెలిఫోన్ ఆపరేటర్లున్నారు. ఎలక్ట్రిషియన్లున్నారు. క్లర్కులున్నారు. వాచ్‌మెన్‌లున్నారు. ప్యూనులున్నారు—ఇలా చెప్పుకుంటూ పోతే ప్రతి ఆఫీసులోనూ ఒక్కో రోమియో వుంటాడు.

పగలనక రేయనక రోగులకు సేవ చేసే ఆ నర్సులంటే వీళ్ళకెంత అలుసు? సమాజంలో "నర్స్" వృత్తికి వున్న చెడ్డపేరు మరేవృత్తికీ లేదు. ఆఖరికి పడుపువృత్తికి కూడా అంత చెడ్డపేరు లేదు. "నర్స్" అంటే సమాజానికి ఏహ్యభావన.

నర్స్—ఆ వృత్తి ఎంత మంచిది రేయింబగళ్ళు ఒళ్ళు దాచుకోకుండా రోగులకు ఆమె ఎంత సేవచేస్తుందని అలా సేవ చేయడమే ఆమె పాప మేమో అందుకే ఆమె సమాజం దృష్టిలో చులకన కాను మరి : సమాజం చాలా మంచిది. సత్ప్రవర్తన గలది ఏదీ లేనిది "నర్స్"కు మాత్రమే.

వాళ్ళు వేసుకునే తెల్లటి యూని ఫాంలను చూస్తే అందమైన తెల్లటి శాంతి పావురాలు దివినుండి భువికి దిగి వచ్చినట్లనిపిస్తుంది. ప్రతీ నర్స్ ముఖం లోనూ మదర్ థెరీసా తొంగిచూస్తుంది. ఫ్లారెన్స్ నైటింగేల్ సాక్షాత్కరిస్తుంది. అలాంటి దేవతలకు వాళ్ళెలా ఫోన్ చేయగలుగుతున్నారో ?

* * *

రాత్రి పన్నెండయింది. అమావాస్య చీకటి.

ఈశ్వరమ్మ గట్టిగా మూల్గుతోంది. పోలయ్యకు, మిగతా బంధువర్గానికి ఏమీ పాలుపోక గుడిసెబయట అటూ ఇటూ పచార్లుచేస్తున్నారు.

మాఆయన నాపేర 'ఇల్లు' వ్రాశారు మరి మీవారు నీకేంరాశారు ?

ఆయన రచయితగదా. నాపేర ఓ నవల 'వ్రాశారు !




మంత్రసాని బయటకు వచ్చింది.

"బిడ్డ కడుపులో అడ్డం తిరిగిపోనాది. నానెంత ప్రయత్నంచేసినా నాదం నేక పోయింది. ఎంటనే పెద్దాస్పత్రికి తీస్కపొండి" అని చెప్పి వెళ్ళిపోయింది.

పోలయ్యకు, అతని బంధువర్గానికి తదుపరి కార్యక్రమం ఏమిటో, ఎలా చెయ్యాలో అర్థంకాలేదు.

కొద్ది సెకనులపాటు అంతా శిలా ప్రతిమల్లా నిలిచిపోయారు.

పోలయ్య ఫ్లోర్‌మిల్లులో కూలీ. పోలయ్య - పోలయ్య కొడుకు తొమ్మిదేళ్ళవాడు రంగయ్య. ఐదోక్లాసు చదువుతున్నాడు. రంగయ్య అంటే ఇంగ్లీషు మాస్టారు సుబ్బరామయ్యగారికి ఎంతో ఇష్టం. రంగయ్య చాలా బాగా చదువుతాడు. ప్రతీ క్లాసులోను రంగయ్యదే ప్రథమస్థానం. అందుకే రంగయ్యంటే సుబ్బరామయ్యగారికి ఎనలేని అభిమానం.

"పోలయ్యా! నీ కొడుకు రంగడికి మంచి తెలివితేటలున్నాయి. వృద్ధిలోకి వస్తాడు బాగా చదివించు" అనేవారు సుబ్బరామయ్యగారు.

"అది కెందుకు బాబయ్యా సదువు? ఐనా పూటకి గతిలేనోల్లం. అది నెలా సదివించగలం సెప్పండి" అనేవాడు పోలయ్య.

"ఐతే నేనే వాడిని బాగా చదివించుతాను" అనేవాడు సుబ్బరామయ్యగారు. రంగయ్యకు మాట్లాడే భాషలోకూడా యాస వచ్చేదికాదు. తెలుగు కాని, ఇంగ్లీషుకాని చాలా చక్కగా స్వచ్ఛంగా ఉచ్చరించేవాడు.

ఆ సమయంలో సుబ్బరామయ్యగారు

అక్కడే వున్నారు. ఆయనకు చాలా కోపం వచ్చింది. "ఇలాంటిదేదో జరుగు తుందనినీకు ముందేచెప్పాను పోలయ్యా! మల్లమ్మని వెంటనే పెద్దాసుపత్రిలో చేర్చమన్నాను. నువ్వు విన్నావు కాదు. ఇప్పుడు చూశావా ఏమైందో. అయినా కంగారు పడనవసరంలేదు. నువ్విక్కడే వుండు. నేను అంబులెన్సుకు ఫోన్‌చేసి రప్పిస్తాను" అంటూ సుబ్బరామయ్యగారు దగ్గర్లోనే వున్న టెలిఫోన్ బూత్‌కు పరుగుతీశారు. అంబులెన్స్‌కోసం కె. జి. హెచ్‌కు ఫోన్ చెయ్యడానికి.

సుబ్బరామయ్యగారు కె జి హెచ్ కు రింగ్‌చేశారు.

చాలాసేపు రింగయింది.

కాల్ కట్ అయింది.

మళ్ళీ రింగ్‌చేశారు

చాలాసేపు రింగయింది

మళ్ళీ కట్ అయింది.

మళ్ళీ మళ్ళీ రింగ్‌చేశారు.

మళ్ళీ మళ్ళీ కట్ అయింది

సుబ్బరామయ్యగారి మనసులో ఏదో ఆశ కె.జి.హెచ్ ఆపరేటర్ ఇప్పుడైనా అటెండ్‌కాదా అని ఆయన అలా ఆశతో ఓ గంటసేపటిదాకా అలా కె.జి.హెచ్ కు ఫోన్‌చేస్తూండిపోయారు.

చివరికి ఆయన ఆశ నశించిపోయింది. టాక్సీకోసం పరుగుతీశారు.

టాక్సీ సులభంగానే దొరికింది.

టాక్సీ పోలయ్య ఇంటిముందు ఆగగానే సుబ్బరామయ్యగారు నిరుత్తరు లయ్యారు. పోలయ్య, రంగయ్య-వాళ్ళ బంధువులు ఆమె శవంమీద పడి హృదయవిదారకంగా విలపిస్తున్నారు. అప్పటికి ఐదు నిముషాల క్రితమే మల్లమ్మ ప్రాణాలు ఈశ్వరునిలో లీనమైపోయాయి

'గంటక్రితమే కె.జి.హెచ్. దొరికి వుంటే ఈపాటికి మల్లమ్మ బతికి వుండేది' ఏడుస్తున్న తొమ్మిదేళ్ళ రంగయ్యను అక్కున చేర్చుకుని ఓదా రుస్తూ బాధగా అనుకున్నారు సుబ్బ రామయ్యగారు.

అప్రయత్నంగా ఆయన కనులనుండి రెండు కన్నీటి బిందువులు నేలరాలాయి

సుబ్బరామయ్యగారు అంబులెన్స్ కోసం ఫోన్‌చేసిన సమయంలో- అంతకు ముందు అర్ధగంటనుంచి ఏకధాటిగా టెలిఫోన్ రోమియోలు "నర్స్"లను ఏడిపించడంకోసం వార్డులకు కనెక్ట్ చెయ్యమని ఆపరేటర్ని ఏడిపిస్తూంటే ఆమె విసుగుచెంది, ఆ తరువాత వచ్చిన సుబ్బరామయ్యగారి కాల్స్‌ను ఆమె ఎటెండు చెయ్యకుండా డిస్కనెక్ట్ చేసే సిందని ఆయనకేం తెలుసు?

———




ఎండ భరించరానిదిగా వుంది.

'నాలాంటి ముసలివాణ్ణి ఇంకా కష్ట పెట్టాలనేదే నీ ధ్యేయమా స్వామీ? శివుని మూడవ కంటి కనుకొలకుల మధ్య నుంచి ప్రచండ రూపుడవై బయలు దేరావు.'

ఒక్కసారి పైకి చూడబోయి ఆ కాంతి వేగాన్ని భరించలేక కళ్ళు మూసుకున్నాడు రామ్మూర్తిగారు. అంతలోనే షాక్ తగిలినట్లయి తూలి పడబోయారు. ఇంతలో రెండు చేతులు అతన్ని అదిమిపట్టేయి.

"ఏంటి బాబూ అట్టా ఐపోయారు. ఇట్టా కూకోండి" అంటూ తాటాకు గొడుగు క్రింద తన ప్రక్కనే కూర్చో బెట్టేడు ఆ మనిషి. కాస్త నీడ దొరికి తెప్పరిల్లారాయన. వాడు....ఆ చెప్పులు కుట్టేవాడు.... తన పని తాను చేసుకుపోతున్నాడు. ఇద్దరి మధ్యా నిశ్శబ్దం. చెవుల్లో మాత్రం వేడిగాడ్పుల హోరు. కళ్ళముందు రక్తం పారబోసినట్లుగా వుంది ఎండ.

"టైంమెంతవుతుందోయ్" రామ్మూర్తిగారడిగారతన్ని.

"ఉండండి" అన్నాడు. ప్రక్కనే వున్న సంచిలోంచి ట్రాన్సిస్టర్ తీసి ఆన్ చేసాడు. తెలుగు పాటలొస్తున్నాయ్. "ఒంటి గంటైందండి. ఇగో ఈ సెప్పులు కుట్టిచ్చేత్తే భోజనానికెళ్ళిపోవాల" అన్నాడు. తిరిగి చెప్పులు కుట్టడంలో నిమగ్నమయ్యేడు. రేడియోలో వస్తున్న పాటకు లయగా తలాడిస్తూ మధ్య మధ్య కూనిరాగాలు తీస్తూ వాడు చెప్పులు కుడుతున్నాడు.

అతని పనే బాగుంది. పాట వింటూ కూనిరాగాలు తీసుకుంటూ ఎండనీ, పడుతున్న కష్టాన్నీ లెఖ్ఖచేయకుండా నాటి బాధలకు అతీతుణ్ణనే జిజ్ఞాసిలా, ఆనందమయ జీవితాన్ని బోధించే ప్రవక్తలా ఆ తాటాకుగొడుగు క్రింద కూర్చుని చకచకా పనిచేస్తున్నాడు.

ఈ సంసార జలధిలో అతడు నాకన్నా చిన్నవాడే కాబోలు. అయితేనేం. అతని జీవితం ఉత్తుంగ తరంగమై తేలియాడుతుంటే తన జీవితం తుఫానుల మయం.

తన గుండెల్లో వేయి సముద్రాల ఘోష. తనని పిచ్చివాణ్ణి, పిరికివాణ్ణి చేస్తున్నాయి. సన్నగా మూల్గేరు రామ్మూర్తిగారు.

"నీ పనే బాగుందోయ్" అన్నారు.

ఆయన కళ్ళలోకి చూసి నవ్వుతూ "ఏదోలెండి బాబూ" అన్నాడు.

"నీ పేరేమిటోయ్."

"సాంబులంటారండి."

"రోజు కెంత సంపాదిస్తావ్."

"ఐదో ఆరో వస్తాయండి. ఒక్కో రోజు రూపాయి కూడా రాదండి. మరో రోజు ఎన్నో సెప్పులొస్తాయి. కుట్టటానికి టైం సాల్దండి."

"మరి వచ్చే ఆదాయం సరిపోతుందా"

"అదే సరిపోద్దండి. మా యింటిది చాలా యిళ్ళలో పాచిపనేజస్తదండి. నా పెద్ద కొడుకు హోటల్లో సర్వరండి. ఇంకొద్దిలో హోటలు పెట్టేస్తాడండి. రెండోవాడు సారా కంపెనీలో చేత్తాడండి...." అంతలోనే నవ్వుతూ "అప్పుడప్పుడు నాకో సీసా మందుతెస్తాడండి" అన్నాడు సాంబులు.

సాంబులు మాటలు విని భారంగా నిట్టూర్చేరు. ఇందులోనూ అతని బ్రతుకే నయం.

"నీ పెళ్ళాంబిడ్డలు నీతో బాగా మాట్లాడతారా" ఆశగా ప్రశ్న వేశారు.

"ఓ యస్సండి. నా మాట నా పెల్లాం కాదనదండి. దాని కోరిక నేను కాదన్నండి. ఇక కొడుకులు....ఇంతవరకూ బాగానే వున్నారండి. నేనూ సంపాయిస్తున్నాను. అళ్ళూ సంపాయిస్తున్నారు. అళ్ళ నా మాట కాదంటే నాకేటండి. సొతంత్రంగా మరో సోటికిపోయినా ఎవరి కాళ్ళ మీద అళ్ళ బతగ్గల్దుం." అన్నాడు. గర్వంగా తరువాత చెప్పులు కట్టడం పూర్తియ్యే వరకూ ఎవరూ మాట్లాడుకోలేదు.

అర్ధరూపాయి సాంబులు చేతిలో పెట్టి "నా కంటే నువ్వే నయం సాంబులూ" అన్నాడు చెప్పులు చేతపట్టుకుంటూ.

సంతోషంగా నవ్వి, "తేంక్సండి. అదేటండి. సెప్పులు చేత్తోబట్టుకున్నారేటి? కాళ్ళకేసుకోండి. ఎండ మండిపోతోంది" అన్నాడు సాంబులు.

"ఇవి మా పెద్దబ్బాయి చెప్పులులే" అన్నాడు మొహం వెనక్కి తిప్పుకొని వెళ్ళిపోతూ.

సాంబులు బిత్తరపోయాడు.

* * *

"ఇవిగోరా నీ చెప్పులు" ఇంటికి వచ్చి కొడుకు గదిముందు నిలబడ్డ రామూర్తిగారి నివురుగప్పిన స్వరం.

"అక్కడ పెట్టి వెళ్ళండి" కొడుకు గదిలోనుంచే సమాధానం ఇచ్చేడు.

చెప్పులు అక్కడపెట్టి వెళ్ళి పెరట్లో పాకలో మంచంమీద కూర్చున్నాడు. చెమటతో తడిసిన చొక్కా విప్పి మంచం కోడుకి తగిలించారు. ఏ బాధామయ



స్థితినీ చూసి భరించలేక మూలకూర్చొని వెక్కి వెక్కి ఏడుస్తున్న పసివానిలా వుంది, చెమటతో తడిసిన చొక్కా. వెనుకటి తీయటి స్మృతులను బ్రద్దలు కొట్టి అగాధాల్లోకి తోసేసిన చేదునిజాలను కక్కుతోంది చెమటతో తడిసిన చొక్కా. వర్ణనకందని ఆయన చూపుల మధ్య పెల్లుబికిన వేడి కన్నీటి చుక్కలను పలుకరిస్తూ ఊరటకలిగిస్తున్నట్లుంది చెమటతో తడసిన చొక్కా.

రామ్మూర్తిగారు గుమాస్తాగా బతికారు. అలాగే రిటైరయ్యారు. వచ్చే సంపాదనతో భార్యనీ, కలిగిన ఇద్దరు కొడుకుల్నీ, కూతుర్నీ జాగ్రత్తగా చూసారు. వారికి మంచి చదువులు చెప్పించారు. కూతురికి మంచి సంబంధం చూసి పెళ్ళిచేసారు. కోడళ్ళు కూడా వచ్చేరు. పిల్లలతో తానొక మిత్రునిలా చూడాలని వారికి కావలసినంత స్వేచ్ఛ ఇచ్చేరు.

రామ్మూర్తిగారికీ భార్య తులశమ్మకు వయసులో తొమ్మిదేళ్ళ తేడా వుంది. అదే వారి మధ్య అభిమానానికి, ప్రేమకు అడ్డుగోడగా నిలిచింది.

అతను ప్రేమగా చూసేకొద్దీ ఆమెలో అతనిపట్ల నిరసన భావం కలిగేది. ఆయన అనురాగం చూపే కొద్దీ ఆమె ముభావంగా వుండేది. ఆయన స్నేహాన్ని కనపరచిన ప్రతిసారి ఆమె విసుక్కునేది. ఆయన నచ్చజెప్పే కొద్దీ ఆమె బిర్రబిగిసేది.

తన ప్రతి చర్యా ఆమెకు అయిష్టత కలిగిస్తోందని గ్రహించారాయన. నిస్స్పృహ చెందేరు. పిల్లల విషయంలోనూ అదే జరిగింది. పిల్లలు తల్లి పక్షాన చేరేవారు. అప్పుడప్పుడు ఆమె

తనని తిట్టడం, తను పిల్లలను తిట్టడం, వాళ్ళ తల్లితో ఆ సంగతి చెప్పుకోవడం, తిరిగి ఇద్దరి మధ్యా యుద్ధం. ఈ రాద్ధాంతాన్ని భరించలేక, పరిష్కరించే ఓపిక, స్థితీ తనకు లేక పిల్లలకు స్వేచ్ఛ ఇస్తున్నానంటూ వదిలేశారు. తల్లిచుట్టూ చేరి ఆమె చెప్పినట్లే వింటూ ఆమె విపరీత ధోరణిని కూడా పట్టించుకున్నారు.

రిటైరయ్యాక పరిస్థితి మరీ దుర్భరంగా వుంది. కొడుకులు అంతకుముందు 'నాన్నగారూ' అని పిల్చేవారు. ఇప్పుడదీ లేదు. ఏదైనా చెప్పాలనుకుంటే సంబోధన లేకుండా ఏ గోడకో, కుర్చీకో చెబుతున్నట్లు మొహం తిప్పుకు మాట్లాడుతున్నారు. భార్య సరే సరి, కోడలు ఏమంటుందోనని వంటిల్లుదాటి బైటకు రావడం లేదు. కోడలు ప్రాపకం నిలబెట్టుకోపోతే ఏమంటుందోననే బెదురు. సంసారాన్ని వాళ్ళ పుట్టింటికి మోసేస్తుందేమోనని భయం ఆవిడకి. కాలం చేసే పరుగుని భార్యాబిడ్డలు అందుకోగలిగారు. ఆ రీతిగా మారి ప్రవర్తించసాగేరు. తనుమాత్రం వున్న చోటునే వున్నాడు. తనకేదో కావాలి. భార్యా పిల్లలు ఆప్యాయంగా పలుకరించాలని, తనపట్ల గౌరవాన్ని, అభిమానాన్ని చూపాలని వుంది. కల్మషం లేని ఆ పలుకరింతలో పరవశించాలనీ, ఆ తీయటి అనుభూతి ముందు మొక్కిల్లాలని ఆయన కోరిక, తృష్ణ, ఇచ్ఛ.

మంచం కోడుకి తగిలించిన చొక్కా గాలికి ఎగిరిపడింది. ఆలోచనలు మారిపోయాయి. మూగగా నవ్వుకున్నాడు తన ఆశకి. 'ఎక్కడ తీరుతుంది తన కోరిక అంతే!'

ఇంతలో ఏదో ఆలోచన.

'సాంబులు ఎంత సంతోషంగా వున్నాడు. అతని చేతల్లో ఎంత ధైర్యం కనబడుతున్నాయో. కొడుకులమీద ఎంతో ప్రేమ. ఇప్పుడు వాళ్ళ తన దగ్గరే వున్నా రేపు ఏ గొడవైనా జరిగి విడిపోయినా తనకే బెంగ వుండదన్నట్లుగా మాట్లాడుతున్నాడు.తనూ వున్నాడు ఎందుకు కొడుకులను తన ఇష్టప్రకారం చదువు చెప్పించగలిగాడు. వాళ్ళనొక ఇంటివాళ్ళను చేసాడు. కూతురు బాగు చూసాడు. కూతురు సమస్య కాదిప్పుడు కొడుకులే వాళ్ళ తన యిష్టప్రకారం పెరిగారు కానీ తన కోరికలని, ఇష్టాలనీ పంచుకోలేదు. తన గురించి పట్టించుకోవడంలేదు. వారికొక నీడను కల్పించిన తనను హాయిగా నీడపట్టున ఉండనివ్వడంలేదు ఎప్పుడైనా చుట్ట కాల్చాలనిపించినా పది పైసలివ్వడానికి మొహం అదోలా పెడతారు వారిపట్ల తను బాధ్యతగా ప్రవర్తించి వారి బాగోగులు చూసినట్లు వారు తనని చూడడంలేదు. తప్పనిసరై ఇంటిపట్టున ఉంచి తిండిపెడుతున్నారు కాని పెద్దవాణ్ణనే జాలికాని, తల్లిదండ్రుల బాధ్యత మనదని కానీ గుర్తించడంలేదు. ఇక

కోడళ్ళొచ్చేరు. వారి కొంగుదాటి రాలేక పోతున్నారు. అంతా కోడళ్ళ యిష్టమే, స్వంత ఆలోచన, మాటతీరు మరచి పోయిన వాళ్ళు తనపట్ల చూపే పోషణ బాధ్యత, తప్పదని మాత్రమే, వేళకింత తిండి పెట్టడం, తోచినపని చెప్పడం తప్ప తనపట్ల ఏ ప్రత్యేక శ్రద్ధలేదు.

ఇటువంటి స్థితిలో తను స్థిమితంగా ఎలా ఉండగలడు. సాంబులుకున్న స్వభావాన్ని ఎలా అలవరచుకోగలడు. కొడుకులు చూడకపోయినా తను బ్రత గ్గలనన్నాడు సాంబులు. తనని కొడుకులు చూడకపోతే ఎక్కడికి పోవాలి. ఉద్యోగంనుండి రిటైర్ అయ్యాడు కానీ జీవితంనుండి రిటైర్ కావడానికి టైం రావడంలేదు మరి!

ఇటువంటి పరిస్థితిలో ఆత్మీయతని, తనపట్ల గౌరవాన్ని, అభిమానాన్ని, ఆనందాన్ని ఎలా పొందడం ఒక సారి సాంబుల్ని కలుసుకోవాలి.

* * *

రామ్మూర్తి చెప్పిన విషయాలు విని గుంభనంగా నవ్వేడు సాంబులు

"మీ విషయం అర్థమైంది సార్. మీరు మీ అబ్బాయి చెప్పులు తెచ్చి నప్పుడే అనుకున్నా మీరెట్టా బతుకు తున్నారో. అళ్ళు మిమ్మల్ని సూసే ఇదానం మీ సేతుల్లోనే వుందండి నేనో మాట సెప్తాను. ఆ రీతిని సెయ్యండి అళ్ళు కాస్త దారికొస్తారు. ఒకేళ అళ్ళు మామూలుగానే వున్నా మీకు ఎనకటి దిగులు, ఇసారం వుండవు" అన్నాడు సాంబులు. ఆపైన సాంబులు మాట సాయం చేసాడు. రామ్మూర్తిగారు తృప్తిపడ్డారు. వెంటనే అది అమలు చేసాడు.

* * *

నెలరోజుల తర్వాత-ఓ మధ్యాహ్నం వీధిలోంచి వస్తూ కొడుకుని పిలిచారు రామ్మూర్తిగారు. "ఏమిటీ" అన్నాడు నిలబడి.

"అలా కూర్చో. ఇదిగోరా ఈ యాభైరూపాయలు నీ దగ్గరుంచు. ఖాళీగావుంటే ఏమొస్తుందని కొందరు పిల్లలకు ట్యూషన్లు చెబుతున్నాను. నా ఖర్చులకని ఇదుగో ఈ పదీ వుంచు కున్నాను" అన్నాడు డబ్బు అందిస్తూ.

"మంచిపని చేసారు మావగారూ" అంది పెద్దకోడలు.

"నాన్నగారికి కాస్త కాఫీ వుంటే చూడు." అన్నాడు కొడుకు భార్యనుద్దే శించి.

ఆ మాటల్లో ఏదో మార్పు గోచరిం చింది రామ్మూర్తిగారికి. మొదటిసారిగా 'నాన్నగారూ' అన్నాడు కొడుకు. రామ్మూర్తిగారికి అర్థంకానిదొక్కటే. 'ఈ మార్పు స్వతహాగా తెచ్చిపెట్టు కున్నదా? లేక తను డబ్బిచ్చి కొని తెచ్చుకున్నదా?' అని.

చెమటతో తడిసిన చొక్కా చల్లగా హాయిగా వంటికి తగిలింది రామ్మూర్తి గారికి.

———




చాలా సేపటినుంచి తల్లి తనకు పక్క పక్కనే తిరగడం గమనించక పోలేదు సూర్యం. ఆవిడ ఏదో తనతో చెప్పాలనుకోవడం, చెప్పలేకపోతూం డడం కూడా గుర్తించాడు, ఓ పక్క పేపరు చదువుతూనే. తప్పనిసరయి ఏదో విషయం చెప్పాల్సివస్తే తప్ప, తల్లి అంతగా తడబడుతూ తచ్చాడదని పూర్తిగా తెల్సు సత్యం".

అందుకే పేపరు పేజీ తిప్పుతూ "ఏమిటమ్మా!" అంటూ ప్రశ్నించాడు సూర్యం.

సూర్యం అలా అడగగానే సుంద రమ్మగారి ముఖం సంతోషంతో యింతైంది. "అబ్బే ఏం లేదురా! ఇప్పుడే వస్తానుండు!" అంటూ ఒక్క వుదుటున పక్క గదిలోకి వెళ్ళి తిరిగి వచ్చింది. "చూడబ్బాయ్! కంచిపట్టు చీర. భాస్కరరావుగారి భార్య కంచి, రామేశ్వరం అవీ వెళ్ళివచ్చింది కదూ! కంచిలో ఈచీర కొనుక్కువచ్చిందట!" అంటూ చేతిలోని చీరను సూర్యానికందించింది ఆవిడ.

బంతిపూరంగు చీరకి జానెడు వెడల్పున ఆకుపచ్చని జరీఅంచు పట్టుచీరని మడత విప్పి చూస్తూ, "బాగుందమ్మా! ఖరీదెంతేమిటి?" అనడిగాడు. నిజానికా చీర రంగు, అంచు సూర్యానికి కూడా

చాలా నచ్చింది. యింక సుందరమ్మగారి మాట వేరే చెప్పేదేముంది.

"నాలుగొందలు పైనే అయిందట.."

"చాలా బాగుందమ్మా !" అంటూ చీరని తల్లి చేతుల్లో పెట్టేసాడు సూర్యం.

"ఎంతయినా కంచిపట్టు చీరల రంగులు అంచులు బాగుంటాయి. ఈ చీరలు కట్టుకుంటే మనిషికి ఎంత నిండుతనం ఇచ్చెయ్యనా అబ్బాయ్ !"

"ఇచ్చెయ్యమ్మా !" అన్నాడు సూర్యం తల్లి వేపు చూడకుండానే.

సూర్యం అలా అనగానే సుందరమ్మ గారిలో అంతవరకు పొంగుతున్న ఉత్సాహం మీద చన్నీళ్ళు చిలకరించినట్లయింది. ఆమె ఆశించిన మాట సూర్యంనుంచి రాకపోవడంతో, నిరాశ పడిపోయినట్లు ఆమె ముఖమే చెబుతూంది. ఆ చీర పక్కింటి భాస్కర రావుగారి భార్య కిచ్చిరావడానికి వెళ్ళారావిడ.

తల్లి అలా వెళ్ళగానే వికలమయిన మనసుతో సూర్యంకి యింక పేపరు చదవబుద్ధి కాలేదు. పేపరు మడిచి పక్కన పడేసాడు. గుండెల్లో ఏమిటో బాధగా అన్పించింది, తల్లిని తల్చుకోగానే. రివ్వున కన్నీళ్ళు కూడా దూసుకు రాబోయాయిగాని, ఎలాగో ఆపుకున్నాడు సూర్యం. తల్లి ఆ చీర తెచ్చి తనకు చూపెంచటంలోగల అంతర్యం గ్రహించక పోలేదతను.

సుందరమ్మ కోరిక ఈనాటిదా ? చిరాలంగా ఆమెలో దాగివున్న కోరిక... వయసుతో బాటు మనసులో పెరిగిన కోరిక. ఆమె జీవితంలో చిన్నప్పుడు కన్నతండ్రిని గాని తర్వాత కట్టుకున్న భర్తనుగాని కన్నపిల్లలనుగాని ఆమె కోరింది అదొక్కటే కోరిక. అదే కంచిపట్టుచీర కొనిపెట్టమని. కాని, యింతవరకూ ఆవిడ కా కోరిక తీరనే లేదు.

ఆనాడు ఆవిడ తండ్రి ఓ పల్లెటూర్లో కరణం. బంధు బలగం కావల్సినంత. వచ్చేవాళ్ళు, వెళ్ళేవాళ్ళు, ఏ రోజూ యిల్లు సత్రంలా, పెళ్ళివారిల్లులా వుండేది. సుందరమ్మకి చీరలుకట్టుకునే వయసు రాకుండానే పెళ్ళిచేసాడామె తండ్రి. కూతురు చీరలు కట్టుకోవచ్చేటప్పటికి ఏవో సాదాచీరెలు కొనిపెట్టడం తప్ప పట్టుచీరలు కొనే తాహతు ఆయనకు లేకపోయింది.

తర్వాత అత్తగారింట్లోను అంతే యిక్కడ పుట్టింట్లో మాదిరే. తన అవసరములే గాక, అత్తగారి వైపువాళ్ళు మామగారి వైపువాళ్ళు, ఆయన చెల్లెళ్ళు, మేనత్తలు, మేనత్తలకూతుళ్ళు . వాళ్ళ రాకపోకలు, మర్యాదలు, పెట్టుపోతలు వీటన్నిటి మధ్య సుందరమ్మకు పట్టుచీర మాట కల్లోకూడా అనుకోడానికి వుండేది కాదు. మర్యాదలో కొండంత ఆస్తి హారతికర్పూరంలా కరిగిపోగా,

మాధవరావుకి మాస్టారుగిరీ మాత్రం మిగిలింది, జీవనాధారానికి. మాధవరావు తండ్రి కొడుకుకి ఎలాగో తను చనిపోయే నాటికి రెండెకరాల పొలం మాత్రం పిత్రార్జితంగా మిగిల్చాడు.

"కాపరానికి వచ్చిన వెంటనే ఒక్కొక్కరుగా వరుసగా అయిదుగురు పిల్లలు బయల్దేరారు సుందరమ్మకు. వాళ్ళని పెద్దచేయాలనే తాపత్రయంలో పడ్డా, సుందరమ్మ మనసులో కోరిక చెదురు మదురుగా కదులుతూనే వుండేది.

"ఏమండీ! మిమ్మల్ని నేనెప్పుడూ ఏమీ కోరలేదు. ఇంక ముందు కోరను. ఒక మంచి కంచిపట్టుచీర కొని పెట్టండి!" అంటూ భర్తను ఎన్నో సార్లు అడిగింది.

సంసారం ఈదడానికే ఎప్పటికప్పుడు తలమునకలయిపోతున్న మాధవరావు "అలాగే! ఈసారి తప్పకుండా, తల తాకట్టు పెట్టయినా సరే కొనిపెడతాను!" అనేవాడు.

అలా అన్నాక కూడా ఎన్నో సంవత్సరాలు అవలీలగా గడిచిపోయాయి. తల తాకట్టుపెట్టడ మెలాగో, భార్యకు చీర కొనడ మెలాగో తెలియలేదు. నోరు తెరిచి భార్య కోరిన ఒక్కగానొక్క కోరిక తీర్చలేకపోతున్నందుకు మనసులోనే బాధపడేవారాయన.

సుందరమ్మగారు పట్టుచీర కొనుక్కోలేదని కాలం ఆగిపోలేదు.

పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు.చదువు కొంటున్నారు. అందర్లోకి పెద్దవాడు సత్యం. తెలివయినవాడు. క్లాసులో అన్నిటిలోనూ ఫస్టుమార్కులు వాడికే. అందుకే వాడి నెలాగైనా పెద్ద చదువులు చదివించాలనుకున్నారు. వున్న వూళ్ళో కాలేజీ లేకపోయినా పొరుగూరికి పంపించి పెద్దచదువులే చదివించారు.

తను నోరుతెరిచి అడగకపోయినా, కొడుక్కి ఉద్యోగం వస్తే మొదటి జీతం లోనే తనకు పట్టుచీర కొనిపెడతాడను కున్నది సుందరమ్మ. ఆవిడ అనుకున్నట్లు కోరుకున్నట్లు సత్యంకి మంచి ఉద్యోగమే వచ్చింది. కాని తల్లి అనుకున్నట్లు పట్టుచీర కాదు కదా, ఓ నేతచీర కూడా కొనిపెట్టలే దావిడకు. వచ్చిన జీతంలో ఘనంగా ఎలా బ్రతకాలా అన్న ఆలోచన తప్ప మరో ఆలోచనలేదు సత్యంకి. చీర కొనిపెట్టమని నోరుతెరిచి కొడుకుని అడగటం ఆవిడకు అభిమానం అనిపించింది. అలాగే అడగలేదు కూడా. ఇప్పుడు సత్యం తనాఫీసులో పని చేస్తున్న ఒకమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకొని సంతోషంగా, సుఖంగా రోజులు దొర్లించేస్తున్నాడు బొంబాయిలో. గుర్తు వచ్చినప్పుడు తన క్షేమం వాళ్ళకి తెలిపి తల్లితండ్రుల క్షేమం కనుక్కుంటూ వుంటాడు వుత్తరం రాసి.

తండ్రి, భర్తల హయాంలో తన కోరిక తీరకపోయినా, కన్న కొడుకు










తప్పక తీరుస్తాడని ఆశపడిన సుందరమ్మ ఆశ నిరాశ అయింది. అయినా ఆవిడ కోరికను చంపుకోలేకపోయింది. సత్యం తర్వాత శుభ. దాని పెళ్ళికయినా కొనుక్కోవాలని గట్టిగా నిర్ణయించుకుందావిడ. శుభపెళ్ళి కుదిరింది, మూడు వేల కట్నంతో. వున్న రెండెకరాలలో ఓ ఎకరం పొలం అమ్మి శుభ పెళ్ళి చేయాలని నిర్ణయించుకున్నారు మాధవరావు.

"అమ్మా! ఖర్చులో ఖర్చు. నువ్వు ఓ పట్టుచీర నీకు నచ్చినది తీసుకో" అన్నారు పిల్లలందరూ.

"ఆ! యిప్పుడు నాకు పట్టుచీరకు తొందరేమొచ్చిందర్రా! ఈసారెప్పుడయినా కొనుక్కుంటాలే! దాని పెళ్ళి నిర్విఘ్నంగా సాగి, లక్షణంగా అత్తవారింటికి వెళితే నాకంతకంటె కావల్సిందేముంది?" అంది సుందరమ్మ.

"అదేమిటమ్మా! ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నావ్! నాలుగు డబ్బులు చేతిలో వుండగానే కొనుక్కో!" అంది శుభ.

"పిచ్చి మొహమా! నీకేం తెలుసు. ఆడపిల్ల పెళ్ళంటే మాటలా? నేను పట్టుచీర కట్టుకూర్చుంటే ఏమొస్తుందే? నీకెలాగూ చీరలు కొనాలి కదా! ఆ డబ్బుతో నాకో పట్టుచీర వస్తుంది. అవసరానికి పరుగులు పెడితే ఎక్కడనుంచి వస్తుంది. నాలుగు రూపాయలు చేతిలో మిగుల్చుకోవడమే మంచిది. నీ తర్వాత సత్య వుందిగా. దాని పెళ్ళిలో కొనుక్కుంటాలే!" అంటూ దాటవేసింది. గుంటూరు జరీఅంచు నేతచీరలో శుభ వివాహం అయిందనిపించింది సుందరమ్మ.

శుభ తల్లినెప్పుడయినా తనింటికి తీసుకువెళ్ళి ఓ పట్టుచీర పెట్టాలని వుంది

గావి, అది ఆమె తాహతుకి మించిన పని. శుభ అత్తవారు మధ్యతరగతి కుటుంబీకులే.

తర్వాత రెండేళ్ళకే సత్య వివాహం కుదిరింది. ఈ సంబంధం వీళ్ళ తాహతుకి మించినదనే చెప్పవచ్చు. అదృష్టం కలిసి వచ్చింది. సత్య నచ్చిందని వాళ్ళు ఒప్పుకున్నారు. ఆరు వేలు కట్నం. కలిగిన కుటుంబంలో పడితే అమ్మాయి సుఖపడుతుందని, ఆ సంబంధం ఖాయం చేసారు మాధవరావుగారు. వున్న ఎకరం పొలం అమ్మడమే కాకుండా, అప్పు కూడా చెయ్యాల్సి వచ్చింది. వియ్యాల వారు కలిగినవాళ్ళు. అమ్మాయికి పెట్టే సారె చీర వియ్యాలవారికి పెట్టుపోతలన్నీ ఘనంగా వుండాలి.

"ఎలాగూ సత్య పెళ్ళికి పదివేల వరకూ ఖర్చవుతూంది. ఓ నాలుగొందలు పెడితే నీకు పట్టుచీర వస్తుంది. కొనుక్కో!" అన్నాడు భార్యతో మాధవరావుగారు.

సుందరమ్మ నవ్వింది భర్త మాటలకు. "మీరు తెలివివుండే మాట్లాడుతున్నారా? సత్య పెళ్ళి ఏ విధమైన అలజడులూ లేకుండా జరగనీండి. దాని అత్తవారు ఏ విధంగానూ అసంతృప్తి చెందకుండా వుంటే నేను పట్టుచీర కట్టుకున్నంత తృప్తి. ఆ చీరడబ్బువుంటే సత్య ఆడపడుచు లాంఛనాలపైన కల్సి వస్తుంది!" అంది.

సత్య అత్తవారింటికి వెళ్ళిపోయాక పూర్తిగా మారిపోయింది. యిప్పుడామెకు పుట్టింటివారి లేమితనం చూస్తే చిరాకు. ఎప్పుడేనా వస్తుంది. పుట్టింటివారు కలిగినదాంట్లో పెట్టిన సారె, చీర ఆమెకు నచ్చవు. తమ అంతస్తుకి తగినవికావని గునుస్తుంది.

వారిద్దరి వివాహాలు అయి అత్త వారింటికి వెళ్ళేనాటికి మాధవరావుగారు రిటైరయ్యారు. వున్న పొలం కరిగిపోవడమేకాకుండా, అప్పు మిగిలింది. దాంతో సూర్యం చదువు ముందుకు సాగలేదు. ఇంటరుతో చదువు ఆపేసి ఉద్యోగ ప్రయత్నంలో పడ్డాడు. సర్వీసు కమీషను పరీక్షలు రాసి, అన్ని టెస్టుల్లోనూ ప్యాసై ఎలాగైతేనేం ఏ.ఎస్.ఎమ్. (అసిస్టెంటు స్టేషను మాస్టరు) గా ఉద్యోగం సంపాదించాడు. యిప్పుడతని జీవితం ప్లానల్ బోర్డుకి, రైలుపట్టాలకి అంకితమైపోయింది.

* * *

సూర్యం ఉద్యోగం రాగానే తల్లికి పట్టుచీర కొనాలని చూసాడు. కాని, సుందరమ్మే అంగీకరించలేదు. తల్లి తండ్రులేగాక మరో పెళ్ళి కావల్సిన చెల్లెలు నిత్యని పోషించాల్సిన బాధ్యత అతనిమీద పడింది. నిత్యం మండిపోతూ, ఆకాశానంటుతున్న ధరలలో ఆ జీతం రాళ్ళమీదే ఆధారపడిన వాళ్ళకి పట్టుచీరలు కొనడం ఎలా జరుగుతుంది?

'మరెప్పుడయినా కొందువుగా నిలే!' అంది సుందరమ్మ. ఆ తర్వాత తర్వాత అలాగే జరిగిపోయింది. సూర్యానికి వివాహం అయింది. యిప్పుడతనికి ముగ్గురు పిల్లలు. ఇద్దరాడపిల్లలు, ఒక మగపిల్లవాడు.

నిత్యకి సంబంధాలు చూస్తున్నాడు. చివరి కెలాగయితేనేం నిత్యకి ఒక సంబంధం ఖాయంచేసాడు సూర్యం. నిత్య పెళ్ళికి అన్నగారేమయినా ధన సహాయం చేస్తాడేమోనని రాసాడు సూర్యం. కాని, అతని నుంచి ఎటువంటి సమాధానం రాలేదు. పూర్తిగా ఆశ వది లేసుకున్నాడు సూర్యం. తానే ప్రావిడెంటు ఫండులోంచి లోను తీసుకొని నిత్య పెళ్ళి జరిపించాలని నిర్ణయించాడు సూర్యం.

ఆరోజు వస్తూనే, "అమ్మా" అంటూ సంతోషంగా, పెద్దగా పిలిచాడు సూర్యం.

"ఏమిటి నాయనా?" అంటూ వచ్చిన తల్లి చేతిలో ఓ ప్యాకెట్టు పెట్టి, "ఏమిటో చూడమ్మా!" అన్నాడు సూర్యం.

సుందరమ్మ ఆత్రుతగా విప్పి చూసింది. ఆ ముఖం ఆనందంతో విచ్చుకుంది. కళ్ళల్లో మెరుపు కొట్టొచ్చి నట్లుగా కన్పించింది. పట్టుచీర బంతి పూరంగు చీరకి ఆకుపచ్చ జరీఅంచు... ఆవిడకి సంతోషంతో నోట మాటరాలేదు. ఆనందంతో కళ్ళల్లో నీళ్లు తిరుగుతుంటే, కొడుకు వంక ఆప్యాయంగా చూసిందావిడ.

తల్లి సంతోషాన్ని చూస్తూంటే సూర్యంకి మనసు ఆర్ద్రమైపోయింది. "పనిలో పని నిత్యకు చీరకొంటూ నీకూ కూడా కొనేసానమ్మా. ఎప్పుడూ ఇలాగే ఔతూంది" సూర్యంకి కూడా సంతోషంతో మాటలు రావడంలేదు.

"సూర్యం నాకు పట్టుచీర కొన్నాడు" అంటూ యింట్లోవాళ్ళకి, బయటవాళ్ళకి కూడా చూపించి వచ్చింది సుందరమ్మ.

ఆ పట్టుచీర చూసిన సూర్యం పెద్ద కూతురు రమ, "నాయనమ్మా! నీ చీర బావుంది. నాకు కూడా పట్టుపరికిణీ కావాలి," అంటూ అడిగింది.

"అలాగే! ఈసారి నాకు పట్టు పరికిణీ కొంటానమ్మా" అంటూ మెల్లగా బుజ్జగిస్తున్నట్టుగా అన్నాడు సూర్యం.

"ఉహూ నాకిప్పుడే కావాలి!" అంటూ రాగం మొదలుపెట్టింది.అందరూ తలోరకంగా చెప్పి చూసారు. అయినా వినలేదు రమ. అంతకంతకు మంకు పట్టుగా మొదలెట్టింది. దానిని చూసి చిన్న పిల్ల సుధకూడా తనకీ పట్టు పరికిణీ కావాలంటూ ఏడుపు మొదలుపెట్టింది.

యిప్పుడున్న ఈ ఖర్చులలో ఆ చిన్నపిల్లలకు పట్టుపరికిణీలు కుట్టించ లేడు సూర్యం. ఆ సంగతి సుందరమ్మ గారికి తెల్సు. కాని, ఆ చిన్నపిల్లల ఏడుపు చూస్తూంటే ఆవిడ కెలాగో అన్పించింది. ఏదో ఆలోచించుకుని ఒక నిర్ణయానికి వచ్చిందావిడ.

ఆ రోజే షైలరు దగ్గరకు వెళ్ళి సూర్యం తనకు కొన్న పట్టుచీరని రమకి, సుధకి, శుభ పెద్దపిల్ల రేణుకి పరికిణీల క్రింద కుట్టించేసింది.

అది చూసి, "అదేమిటమ్మా! అలా ఎందుకు చేశావు!" సూర్యం ఎంతో బాధగా అడిగాడు.

"పోనీలే, నాయనా! చిన్నపిల్లలు ముచ్చటపడుతున్నారు. పెద్దదాన్ని నేను సర్దుకోకపోతే ఎలా?" నవ్వుతూ తోసి పుచ్చేసారావిడ.

యిన్నేళ్ళు గడిచినా సుందరమ్మగారి కోరిక తీరలేదు. ఆ కోరికను ఆవిడ మర్చిపోనూ లేదు.

సూర్యం మనసు బాధతో విలవిల్లాడింది. తల్లి ఆ పట్టుచీర తెచ్చి చూపించడంలోని అంతరార్థం అతనికి అవగతమైంది. ఆవిడ రెండు మూడు సార్లు ప్రత్యక్షంగా, ఎన్నోసార్లు పరోక్షంగా పట్టుచీర కావాలని సూచించింది. కన్నతల్లి ఆ కోరిక ఒక్కటి తీర్చలేని అతని అసమర్థత మీద అతని కోపం వచ్చింది. తండ్రి వృద్ధాప్యంలో అడుగుపెట్టాడు. ఏ రోజూ ఆయనేదో ఒక అనారోగ్యంతో బాధపడుతూంటారు. ఎప్పుడూ ఏవో బాధ్యతలు, బరువులు. మనస్సుకు క్షణం విశ్రాంతి లేకుండా చేస్తాయి. ఈసారి ఓ. టి. అయినాచేసి సరే అమ్మకు పట్టుచీర కొనాలి! అని గట్టిగా నిర్ణయించుకున్నాడు సూర్యం.

"ఇదుగో! మిమ్మల్నే. ఏంచేస్తున్నారూ? వీడి నవతలకి తీసుకెళ్ళండి కాసేపు. వెధవలు. ముద్దకూడా మింగనివ్వరు?" అంటూ అరిచింది శాంత వంటింట్లోనుంచి.

భార్య అరుపుకి ఉలిక్కిపడి, కుర్చీలోంచి లేచి వంటింటివేపు వెళ్ళాడు. శాంత భోజనం చేస్తూంది. పక్కనే పడి దొర్లి ఏడుస్తున్నాడు చంటాడు

"ఓరోరి! ఎందుకురా! అలా ఏడుస్తున్నావ్!" అంటూ వాడిని భుజాన వేసుకుని ముందు గదిలోకి వచ్చాడు.

అప్పుడే దొడ్డిగుమ్మంలోంచి లోపలకు వస్తున్న తల్లి కన్పించింది. ఆవిడ ముఖం ఎందుకో వాడినట్లుగావుంది. తల్లి మొహంలోకి సూటిగా చూడలేకపోయాడు, ఏదో తప్పుచేసినవాడిలా. 'అమ్మకు తప్పకుండా చీర కొనాలి,' మనసులో మరోసారి గట్టిగా నిశ్చయించుకున్నాడు.

"ఎందుకురా వాడలా ఏడుస్తున్నాడు! ఇలా యివ్వు!" లోపలకు వచ్చిన సుందరమ్మ సూర్యం చేతుల్లోంచి మనవడ్ని అందుకొని చంకనేసుకుంటూ, "ఏందకురా పిచ్చి సన్నాసీ! అంతలా ఏడుస్తున్నావ్! చూడు. కళ్ళు ఎలా ఎర్రబడిపోయాయో! నీకు రైలు చూపించనా?" మనవడి ముక్కు, కళ్ళు చీర చెంగుతో తుడుస్తూ వాడిని బుజ్జగించే

ప్రయత్నంలో వీధిలోకి తీసికెళ్ళింది సుందరమ్మ.

*  *  *

నెలరోజులు నిశ్శబ్దంగా దొర్లి పోయాయి.

ఓ రోజు ఉదయం తొమ్మిదింపావుకి రాయచూరు రేణిగుంట ప్యాసింజరు స్టేషను వదిలి వెళ్ళిపోయిన అయిదు నిమషాలకి ఇంటికి వచ్చాడు సూర్యం డ్యూటీనుంచి. అతనితో మరి ఇద్దరు వచ్చారు.

"నాన్నా! మనింటికి ఎవరొచ్చారో చూడండి!" సూర్యం కంఠంలో ఉత్సాహం ధ్వనించింది.

అప్పుడే స్నానం ముగించి వచ్చిన మాధవరావుగారు సూర్యం మాటలు విని, ఆ వచ్చిందెవరోనని చూసారు. కాని, ఎవరో గుర్తు రాలేదు. "ఎవర్రా!" అంటూ సూర్యంనే అడిగారు.

"గుర్తుపట్టలేదా, నాన్నా? చిట్టిబాబు. చిన్నప్పుడు మీ దగ్గర చదువుకున్నాడు. ప్రైవేటుకి కూడా వచ్చేవాడు!" గుర్తు చేసాడు సూర్యం. ఒక్క-క్షణం గుర్తు చేసుకుంటున్నట్లుగా చూసారాయన. ఇంతలో సుందరమ్మ వచ్చింది వంటింట్లో నుండి.

"అమ్మా! చిట్టిబాబు, భార్య వచ్చారు!" తల్లితో చెప్పాడు సూర్యం.

సుందరమ్మ తొందరగానే గుర్తు పట్టారు. "నువ్వటోయి చిట్టిబాబూ! చాలా మారిపోయావుసుమా! ఆ అమ్మాయి నీ భార్యా! రామ్మా, లోపలికి!" అని "ఏమిటలా చూస్తున్నారూ? యింకా గుర్తు రాలేదా? చిట్టిబాబండీ! అవతారంగారబ్బాయి. మీ దగ్గర ప్రైవేటుకి కూడా వచ్చేవాడు!" అంటూ మాధవరావుగారికి వివరించి చెప్పారు.

"ఓహ్! అవతారంగారబ్బాయా! యిటెక్కడ నుంచి వస్తున్నావయ్యా! ఎన్నేళ్ళో అయింది చూసి. గుర్తుపట్టలేకపోయాను. ఏమనుకోకు!" అన్నా రాయన.

"ఫరవాలేదు మాష్టారూ! పెద్దవారయిపోయారు. మంత్రాలయం రాఘవేంద్రస్వామివారిని చూసి వెళదామని వచ్చాం. సూర్యం ఈ స్టేషన్లో పనిచేస్తున్నాడని తెల్సింది. మిమ్మల్ని చూడాలనిపించింది. దిగేసాను!" అన్నాడు చిట్టిబాబు.

"మంచిపనే చేసావోయ్! అభిమానంతో చూడాలని వచ్చావు చాలా సంతోషం నాయనా!" మాధవరావుగారు ఆనందంగా అన్నారు.

"నా భార్య, దీపిక!" అంటూ పరిచయం చేసాడందరికీ. దీపిక అచ్చం దీపకళికలా అందంగా, పొందికగా వుంది. పెళ్ళయి ఎనిమిది సంవత్సరాలయినా పిల్లలు కలుగలేదుట. మంత్రాలయం రాఘవేంద్రస్వామిని దర్శించుకుంటే సంతానం కలుగుతుందని చెప్పారుట ఎవరో. అందుకని వచ్చారుట.

చిట్టిబాబు యిప్పుడు మద్రాసులో ఓ ఫర్టిలైజర్ కంపెనీలో పనిచేస్తున్నాడుట. దీపిక అందరిలోనూ కలిసిపోయి మాట్లాడింది. స్నానాలూ అవీ ముగించి భోజనాలకు కూర్చున్నారు.

భోజనాలు చేస్తున్నంతసేపు సుందరమ్మగారు, "చాలా పెద్దవాడివి, బుద్ధిమంతుడివి అయిపోయావ్! అమ్మాయ్! చిన్నప్పుడు ఎంత అల్లరి చేసేవాడని. ప్రైవేటుకి వచ్చేవాడా? కాలు ఒకచోట నిల్చేదికాదు. మాస్టారు ఒక్క క్షణం అటో యిటో వెళితేచాలు, ఏ జామచెట్లో, ఉసిరిచెట్లో ఎక్కి కూర్చునేవాడు. ఒకసారలా జామచెట్టు ఎక్కి, కాలుజారి కిందపడ్డాడు. పాపం! కాలుకి బాగానే దెబ్బ తగిలింది. అయినా సరే, ఎవరితోనూ చెప్పొద్దమ్మా అంటూ నన్ను బ్రతిమాలుకున్నాడు!" ఆవిడ చెబుతుంటె సూర్యం, చిట్టిబాబు గట్టిగా, హాయిగా నవ్వుకున్నారు.

భర్త చిన్నప్పటి ఘనకార్యాలు వింటూ దీపిక ముసిముసిగా నవ్వుకుంది.

"ఏ అల్లరుచేసినా, దెబ్బలు తగిలినా ఆ రోజులే బాగున్నాయమ్మా!" అన్నాడు చిట్టిబాబు.

సుందరమ్మ ఆ విషయం, ఈ విషయం మాట్లాడుతూనేవున్నా, ఆవిడ దృష్టి అంతా దీపిక కట్టుకున్న పట్టుచీరమీదనే వుండటం సూర్యం గుర్తించకపోలేదు. ఎందుకో అతని గుండెల్లో కలుక్కుమంది. శాంత అత్తగారిమీద కోపగించుకుంది.

"అమ్మాయ్! ఈ చీర కంచిపట్టు చీర కదూ!" ఎవరూలేకుండా చూసి దీపికని అడిగింది సుందరమ్మ.

"అవునండి. మా అమ్మావాళ్ళు పెళ్ళిలో పెట్టిన చీర ఇది!" చెప్పింది దీపిక.

"చీర చాలా బాగుందమ్మాయ్!" అన్నారావిడ.

ఆ సాయంత్రం నాలుగు గంటలకే మద్రాసుమెయిలుకి వెళ్ళిపోయారు దీపిక, చిట్టిబాబు.

ఆ రాత్రి సూర్యం డ్యూటీకి వెళ్ళబోతుంటే శాంత వచ్చి, "మీ అమ్మగారికి బొత్తిగా మతిపోతుందనుకుంటా! ఆ అమ్మాయి వచ్చినప్పటినుండి ఆమె చీరని ఒకటే ఎగాదిగా చూడడం. ఆ అమ్మాయి ఏమనుకుంటుంది. ఎంత పట్టుచీర కట్టుకోవాలని వుంటేమాత్రం అంతగా బయటపడిపోవాలా?" అంది.

"పోనీలెద్దూ! ఏదో పెద్దది!"

"అదే నేనూ అనేది. ఆ పట్టుచీర మీద అంత కాంక్ష దేనికంటాను. ఇంట్లో పరిస్థితులన్నీ చూస్తు 'పట్టుచీరకొనిపెట్టరా నాయనా!' అనడుగుతే ఎలా కొనిస్తారనీ. నిత్య పెళ్ళికి చేసిన అప్పు తీరలేదు. ఆపైన మన పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారా! వాళ్ళ చదువు సంధ్యలు చూడాలా!"

"సరెలే! ఆ పారమంతా చదవకు.




నాకు తెలియవా ఆ విషయాలు. ఆవిడడిగి నంత మాత్రాన కొన్నామా ? పెట్టామా ? ఏనాటినుంచో అడుగుతూంది. కొనగలి గామా !" సూర్యం కంఠంలో బాధ ధ్వనించింది.

"ఉంటే ఒకటికాకపోతే పది కొను క్కోవచ్చు. ఎవరొద్దన్నారు ? కాస్త ఆవిడ కూడా పరిస్థితి ఆలోచించాలి కదా !" శాంతమాట పూర్తికాకుండానే గది బయటకు దూసుకుపోయాడు సూర్యం.

"అసలీ మనిషిని మెతకచేసి ఆడిస్తు న్నారు. ఆ నాన్నగారిలా నన్ను ముట్టు కోకు అన్నట్లుంటే తెలిసేది వాళ్ళకి...!" అంటూ కుతకుతలాడిపోయింది శాంత.

* * *

"అబ్బాయ్ అమ్మగారిది పునిస్త్రీ చావు. పసుపు, కుంకం, పూలు, కొత్తచీర, గాజులు అన్నీ తెప్పించండి !" అన్నాడు పురోహితుడు.

ఏడ్చి ఏడ్చి ఎర్రబడిపోయిన కళ్ళతో అల్లంత దూరంలో కూర్చున్న భార్య వంక చూసాడు సూర్యం. శాంత మొహానికి చెంగు అడ్డంపెట్టుకొని ఏడు స్తూంది. ఆ పక్కనే నిత్య, శుభ, సత్య దుఃఖిస్తున్నారు. మాధవరావుగారు ఓ గోడకు అంటుకుపోయి కూర్చున్నారు, పుట్టెడు దుఃఖంతో.

ఆ తెల్లవారుజామున గుండెపోటుతో హఠాత్తుగా మరణించారు సుందరమ్మ గారు. అంత ఆకస్మికంగా ఆవిడ మృత్యువాత పడతారని ఎవరూ అనుకో లేదు. తల్లి మరణవార్త వింటూనే దగ్గర్లోనేవున్న శుభ, సత్య భర్తలతో సహా వచ్చారు. సత్యానికి టెలిగ్రాం యిచ్చారుగాని అతను బొంబాయినుంచి రావడానికి చాలా టైంపడుతుంది. తల్లిని చివరి చూపుకైనా నోచుకోని దురదృష్ట వంతుడు.

మధ్యాహ్నం పన్నెండుగంట లవు

తూంది. యింట్లో ఎవరూ వచ్చి మంచి నీళ్లు ముట్టలేదు. పిల్లలందరూ 'ఆకలి' అని గోలపెట్టసాగారు. సుందరమ్మ గారు అంతిమ యాత్రకి సన్నాహాలు జరుగుతున్నాయి.

సూర్యం పైగుడ్డతో కన్నీళ్లు తుడుచు కుంటూ "శాంతా! కొత్తచీరకోసం ఎవరి నైనా పంపావా?" అనడిగాడు భార్య దగ్గరగా వెళ్ళి.

"మీ బావ వెళ్ళారు!" శుభ చెప్పింది ఏడుస్తూనే.

ఇంతలో బయటనుంచి "పోస్ట్" అంటూ కేక వినబడి సూర్యమే వెళ్ళాడు వీధిలోకి.

"రిజిష్టరు పార్శిలుందండి మీకు!" అన్నాడు పోస్ట్‌మేన్. అతని దగ్గరే పెన్ను తీసుకుని సంతకంచేసి, పార్శిలు తీసుకున్నాడు. దానిమీద ఫ్రమ్ అడ్రసు చిట్టిబాబుది. ఆ పార్శిలేమిటో, ఎందుకు పంపాడో అర్థంకాలేదు సూర్యంకి. మనసంతా దుఃఖభారమైపోయిన ఆ సమయంలో విప్పి చూడాలనిపించలేదు. కాని, మనసు పీకేసింది. ఎప్పుడూ ఉత్తరమైనా రాయని చిట్టిబాబు రిజిష్టరు పార్శిలులో ఏం పంపాడు? వీధిలో నిలబడే పార్శిలు ఊడదీశాడు. విప్పు తూనే కళ్ళు చెదిరిపోయాయి. నిర్ఘాంత పోయాడు. పంచల చాపు, బంతిపూ రంగు పట్టుచీరకు జానెడు వెడల్పున్న ఆకుపచ్చని జరీఅంచు గల కంచిపట్టు చీర. అందులోనే ఉత్తరం కూడా వుంది.

"డియర్ సూర్యం!

ఇక్కడ మేము కులాసా. మీరందరూ క్షేమమని తలుస్తాను. మాస్టారి ఆరోగ్యం బాగా ఉన్నదా? రెండు నెలల క్రితం నే నక్కడికి వచ్చినప్పుడు చాలా బల హీనంగా కన్పించారు. అమ్మగారికి, నాన్నగారికి నా నమస్కారములని చెప్పు. మీ పిల్లలేమంటున్నారు?

"సూర్యం! నువ్వు మరోలా అను కోకు. మాస్టారి దగ్గర నేను 4, 5 సంవత్సరాలు చదువుకున్నాను. కాని, ఆయన ఏనాడూ నా దగ్గర పైసా కూడా జీతం తీసుకోలేదు. ఆయనకు గురు దక్షిణగా పంచలచాపు, అమ్మగారికి కంచిపట్టుచీర పంపుతున్నాను. వారికి అందజెయ్. అమ్మగారికి కంచిపట్టుచీర కొనుక్కోవాలని చాలా రోజులుగా వుందని నాకు తెలుసు. ఎలాగంటావా? నేను ఆయన దగ్గరకు ప్రైవేటుకి వచ్చే రోజులలో అమ్మగారు కంచిపట్టుచీర కోసం మాస్టారితో ఒకటి రెండుసార్లు ఘర్షణపడటం విన్నాను. పోతే, రెండు నెలల క్రితం నేనూ, దీపిక అక్కడికి వచ్చినప్పుడు తెల్పింది. ఆవిడ కా కోరిక ఇంతవరకూ తీరనేలేదని. ఆవిడ దీపిక చీరని చాలా మెచ్చుకున్నారుట.

"సూర్యం ఇది మిమ్మల్ని కించ

పరచాలని చెయ్యడంలేదు. నిజానికి మనలాంటివాళ్ళు కొనగలిగే అందు బాటులో వున్నాయా పట్టుచీరలు. ఏమయినా అమ్మగారికి చీర కొనివ్వా లని నేను అక్కడికు వచ్చినప్పుడే నిశ్చయించుకున్నాను. అయితే, డబ్బు సర్దుబాటయి కొనేసరికి యిన్నాళ్ళయింది. అమ్మగారికి నువ్వెంతో, నేనూ అంతే. అలాగే ఆవిడ నాకెలాగో నీకూ అంతే. అందుకే ఈ చీర పంపుతున్నాను. మరోలా భావించవనుకుంటాను. అమ్మ గారికి రంగుచీర అంటే యిష్టమని దీపిక ఈ చీర సెలక్టు చేసింది. అమ్మగారికి నచ్చుతుందనే అనుకుంటాను. మరింక వుంటాను సూర్యం.

ఇట్లు
చిట్టిబాబు,"

సూర్యం కళ్ళనుండి జలజలా రాలి పోతున్నాయి కన్నీళ్ళు, చేతిలో ఉత్తరం మీద, పట్టుచీరమీద. పిచ్చివాడిలా ఆ పట్టుచీరను, ఉత్తరంలోకి చూస్తూండి పోయాడు.

"సూర్యం! ఈ చీర చూడవోయ్. తెచ్చాను." శుభ భర్త బజారునుంచి తెచ్చిన చీరమడత విప్పి చూపించాడు.

కన్నీటి తెరల్లోంచి చూసాడు సూర్యం. ఆకుపచ్చని వరయూరు నేత చీర. సూర్యం తనచేతిలో పట్టుచీరవంక ఆ నేతచీర వంక మార్చి మార్చి చూసాడు. చివరికి తల్లి కోరుకున్న చీరని ఆమె చావునాడయినా కొనలేక పోయాడు తను గుండెలు బ్రద్ద లయేలా వస్తోంది దుఃఖం సూర్యంకి.

సుందరమ్మగారు మరీ అరగంటలో తను కోరుకున్న బంతిపూరంగు పట్టు చీరతో ముస్తాబై, జీవితంలో చివరి గమ్యం చేరుకునేందుకు సిద్ధమైనారు. ఆవిడ మొహంలో తన చిరకాల వాంఛ తీరిందన్న తృప్తి మెరుస్తున్నట్లుగా అనిపించింది సూర్యంకి.

---






(గత సంచిక తరువాయి)

చివరికి పదిహేనవ రోజు వచ్చింది. ఆ రోజుకి చుట్టుప్రక్కలనుంచి పెద్దా పిన్నా చాలామంది వచ్చారు. ఆ రోజంతా ఎడతెరిపిలేకుండా వస్తున్న జనానికి అన్నదానం జరుగుతోంది.

ఆ వుత్సవాన్ని తిలకించడానికీ, దైవ దర్శనం, స్వామీజీ దర్శనం చేసుకునేందుకు పక్కవూరి జమీందారు చంద్రశేఖరంగారు వచ్చారు. ఒక్కరే కాకుండా కుటుంబ సమేతంగా వచ్చారు. ఆయన కృష్ణమరాయుని తండ్రికి మంచి స్నేహితుడు. కృష్ణమరాయుడన్నా, వారి కుటుంబమన్నా సదభిప్రాయం, అభిమానం గలవ్యక్తి చంద్రశేఖరం.

ఆలయ ప్రాంగణంలో ముద్దబంతి పువ్వులా మసులుతున్న శాంతిని

సి. యస్. రావు & శివదత్త్

చూసాడు చంద్రశేఖరం. పూర్నయ్యను అడిగి శాంతి కృష్ణమరాయుని కుమార్తె అని తెలుసుకున్నాడు. భార్యకు చూపించాడు. భార్య శాంతిని పలకరించింది. శాంతి అణకువ, మంచితనంచూసి మురిసి పోయింది ఆవిడ. అందచందాలు చూసి ఆనందపడిపోయింది. "మన పెద్ద మనువడికి సరిగ్గా యీడూజోడూ కదూ," అంది చంద్రశేఖరంతో.

"సరిగ్గా నేనూ అదేమాట అనుకున్నాను."

"మరైతే ఆలశ్యం దేనికి, కృష్ణమరాయలవారిని అడగొచ్చుగా."

"బాగానేవుంది నీ తొందర–ఆ పిల్లకి వేరే సంబంధాలు ఏమైనా చూసారో చూస్తున్నారో తెలుసుకోకుండా తొందర పడితే ఎలా? పైగా మనం పిల్లవాని తరఫువాళ్ళంగాని, పిల్ల తరఫువాళ్ళం కాదుకదా. మన వుద్దేశ్యం మధ్యవర్తికి తెలిపితే అటుతరఫునుంచే అడిగే ఏర్పాటు చేస్తాడు."

"ఇంతకీ కృష్ణమరాయలవారికి చెప్పగల మధ్యవర్తి ఎవరు?"

"ఏమిటమ్మా మధ్యవర్తి అంటున్నారు. ప్రసాదం తీసుకోండి" అంటూ పూర్నయ్య వచ్చాడు.

"అదిగో మధ్యవర్తి మాటలోనే వచ్చారు." అన్నాడు చంద్రశేఖరం.

"మరి ఆలశ్యం దేనికి? చెప్పండి వారికి" అంది చంద్రశేఖరంగారి భార్య.

"శలవియ్యండి బాబూ" అన్నాడు పూర్నయ్య.

"మరేమీలేదు పూర్నయ్యగారు. మన కృష్ణమరాయుడుగారి అమ్మాయి శాంతి మా ఆవిడకు నచ్చిందట. తన మనువడికి చేసుకోవాలని ఆవిడ కుతూహలం" అన్నాడు చంద్రశేఖరం.

"అంటే మా శాంతి నోములు పండాయన్నమాట. కృష్ణమరాయల వారితో ఇప్పుడే మాట్లాడతాను," అని తొందర పడ్డాడు పూర్నయ్య.

"తొందరలేదు. యీ హడావిడి తగ్గాక వారిని కనుక్కొని నాకు కబురుచేయండి" అన్నాడు చంద్రశేఖరం.

ఉత్సవం పూర్తయ్యాక చంద్రశేఖరంగారి కుటుంబం కృష్ణమరాయునికి వెళ్ళొస్తామని చెప్పి వెళ్ళిపోయారు. జనంకూడా సద్దుమణిగారు. స్వామీజీ కూడా వెళ్ళిపోయారు.

మాధవగిరి, పెళ్ళివారు వెళ్ళిపోయిన యిల్లులా, నిశ్శబ్దంగా వుంది.

రెండు మూడు రోజులు గడిచాక, ఒకనాటి సాయంత్రపువేళ కృష్ణమరాయుడూ, పూర్నయ్యా ఆలయ ఉద్యానవనంలో కూర్చుని, పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు.

"యాగానికి చాలా ఖర్చు అయి వుంటుంది." అన్నాడు పూర్నయ్య.

"అంత పెద్ద కార్యం తలపెట్టి

నప్పుడు ఖర్చుకావడం సహజమేకదా,"
అని బదులుచెప్పాడు కృష్ణమరాయుడు.

"అసలే డబ్బుకి ఇబ్బందిగా వుంటూంది కదా యింత ఖర్చుకు ఎక్కడ నుంచి ఏర్పాటు చేసారు డబ్బు?"

"మిగిలిన ఎనభై ఎకరాలూ తనఖా పెట్టి తెచ్చాను."

"దైవ కార్యాలు కాదనలేను గాని, శాంతీ, నాగార్జునుల సంగతికూడా కాస్త గుర్తువుంచుకోవాలి కదా?" అన్నాడు పూర్నయ్య.

ఒక్క క్షణంసేపు కృష్ణమరాయుడు మాట్లాడలేదు. పూర్నయ్య మాటలో నిజం లేకపోలేదన్న సంగతి కృష్ణమరాయుని మనసుకూడా వప్పుకుంది.

"యీ ఆస్తి నేను సంపాదించినది కాదు. మాపెద్దలు ఎలా సంపాదించారో నాకు తెలీదు. దైవకార్యాలు సమాజ శ్రేయస్సుకు ఉపయోగపడతాయంటారు. మనకున్న ఆస్తి సమాజానికి ఉపయోగ పడటం కంటే వేరే ఆనందం ఏముంటుంది చెప్పండి" అన్నాడు కృష్ణమరాయుడు.

"తమ పిల్లలు కూడా సమాజంలోని సభ్యులే" అని వూరుకున్నాడు అర్థోక్తిగా పూర్నయ్య.

"సమాజంలోని ఆయీడు పిల్లలందరికీ ఆస్తిపాస్తులూ యిన్ని సదుపాయాలూ వున్నాయంటారా?" అన్నాడు కృష్ణమరాయుడు నవ్వుతూ. మళ్లీ అంతలోనే "నారు పోసినవాడు నీరు పోయకపోడు. అన్నింటికీ ఆ వేణుగోపాలుడే వున్నాడు" అన్నాడు కృష్ణమరాయుడు.

ఆ వేణుగోపాలుడిమీద మీరు పెంచుకున్న నమ్మకమే మిమ్మల్నీ మీ కుటుంబాన్నీ కాపాడుతోంది బాబూ" అన్నాడు పూర్నయ్య.

"ఏ విధంగా?" అన్నట్లు కృష్ణమరాయుడు పూర్నయ్య ముఖంలోకి చూసాడు.

"మొన్న యాగానికి వచ్చినప్పుడు చంద్రశేఖరంగారు మన శాంతిని చూసారు. వారి మనుమడికి శాంతిని చేసుకోవాలన్న కోరికను వ్యక్తంచేసారు. నాకు ఎంతో ఆనందం మనిపించింది. ఆ కుర్రాడు కూడా చూడముచ్చటగా వుంటాడు. మద్రాసులో బి. ఎ. చదువుతున్నాడట. యీ యేటితో బి.ఎ. పూర్తయి పోతుందట కూడా" అని ఎంతో ఉత్సాహంగా వివరించాడు పూర్నయ్య.

కృష్ణమరాయుడు కాసేపు మౌనంగా వుండి నిట్టూర్చాడు.

"తమ ఉద్దేశ్యం?" పూర్నయ్య అడిగాడు.

"వారితో మనం తూగగలమా?" ముక్తసరిగా అన్నాడు కృష్ణమరాయుడు.

"అదేమన్న మాట కృష్ణమరాయా! చంద్రశేఖరంగారికి మన పరిస్థితి తెలీదంటారా? అనుభవజ్ఞులు వారు. అన్నీ తెలిసే మీ నాన్నగారితో వున్న స్నేహం

కారణంగా, మీ వంశ ప్రతిష్ట కారణంగా యీ సంబంధం కలుపుకోవాలని వారను కుంటున్నారని నా అభిప్రాయం."

"సరే, పెద్దలు మీరు. ఎలా సబవుగా వుంటుందంటే అలా చేయండి."

"యిలాంటి విషయంలో ఆలశ్యం అనవసరం. మనం రెండోమూడో రోజులలో ఓ శుభముహూర్తాన బయలుదేరి వారిని కలుసుకుందాం. విషయాలన్నీ కూలంకషంగా మాట్లాడుకొని ఓ నిర్ణయానికి వద్దాం. శాంతికికూడా పెళ్ళీడు వచ్చింది కదా." అన్నాడు పూర్ణయ్య.

"సరే" అని అంగీకరించాడు కృష్ణమరాయుడు.

కృష్ణమరాయుని కుటుంబానికి సన్నిహితుడూ, హితుడూ అయిన పూర్ణయ్య శాంతిపెళ్ళి యింకా ఆలశ్యం జరిగితే యింకా ఆర్థిక యిబ్బందుల్లో సంసారం పడి ఎక్కడికి దారితీస్తుందో, అసలు శాంతి పెళ్ళి ఓ సమస్యగా మిగిలిపోతుందేమోనన్న భయంతో సాధ్యమైనంత త్వరలో ముహూర్తాలు పెట్టించి పెళ్ళి జరిపించేయాలని నిర్ణయించుకున్నాడు.

కృష్ణమరాయుడు యింటికి వెళ్ళాడు.

శాంతి అప్పుడే పనిమనిషిచేత దీపాలు పెట్టించింది.

కృష్ణమరాయునికి పెందరాళే భోజనం చేయడం అలవాటు. ఆ సంగతి శాంతికి తెలుసు.

తండ్రి రాగా నే "కాళ్ళు కడుక్కోండి నాన్నా, భోజనం చేద్దురుగాని" అంది శాంతి.

ఆ రోజునే తొలిసారిగా శాంతిని పరిశీలనగా చూసాడు కృష్ణమరాయుడు.

'నిజమే ! శాంతికి పెళ్ళీడువచ్చింది' అనుకున్నాడు. దగ్గరవుండి భోజనం వడ్డించింది శాంతి. తండ్రిని కొసరి కొసరి అడిగి వడ్డిస్తోంది.

భోజనం అయ్యేదాక నిలబడేవుంది.

భోజనం కాగానే చేయి కడుక్కున్న తండ్రికి తువ్వాలు అందించింది చేయి తుడుచుకునేందుకు.

ఆ తరువాత తాంబూలం కూడా కట్టి యిచ్చింది. తాంబూలం నములుతూ కృష్ణమరాయుడు ఆలోచనలో పడ్డాడు.

తన గురించి తాను పట్టించుకునే అలవాటు తనకి మొదటినుంచీ లేదు.

చిన్నతనంలోనూ, తన పెళ్ళికాని క్రితమూ తన తల్లి పార్వతమ్మే తన గురించి పట్టించుకొనేది, యింటి విషయాలూ స్వయంగా చూసుకొనేది. ఆ తరువాత తనజీవితంలోకి రాధ వచ్చింది. అది గతించిన తీయని పీడకల. ఆమె తనను పట్టించుకోవడమే కాదు, ఆరాధించేది. కొండ కొనదాక తీసుకువెళ్ళి కిందకు నెట్టేసింది.

తర్వాత లక్ష్మి తన అర్ధాంగి అయ్యాక కొత్తలో ఏదోలావున్నా, రానురాను తన గురించి అనుక్షణం ఆలోచించి తన

# డెట్ బిళ్ల వాడండి, తెలుపును పొందండి

ఇపుడు ముందుకంటే
ఎంతో ఎక్కువ మంది
డెట్ బిళ్ల యొక్క
ఉజ్వలమైన ఉతుకును
ఇష్టపడుతున్నారు;
వారంటారు,
ఇది మిరమిట్ల తెలుపును,
ఎంతో ఎక్కువగా
పొదుపును ఇస్తుంది.




## డెట్ బిళ్ల

Shilpi-DM 41 A/80 Tel

కోసమే బతికినట్లు బతికింది. పసివాడిని చూసినట్లే చూసింది, తన జీవితం చివరి ఘడియదాకా.

ఇప్పుడు వయస్సులో శాంతి చిన్నదే అయినా తనను పసివాడిలాగే చూస్తోంది.

నేను వంటరివాడి నైపోయానని మా అమ్మ మళ్లీ శాంతిగా పుట్టి తనను సాకు తోంది అని అనిపించింది కృష్ణమరాయునికి ఆ క్షణంలో.

శాంతికి పెళ్ళి చేసి అత్తవారింటికి పంపిస్తే ఈ యింట్లో దీపం పెట్టేదెవరు? తనను పట్టించుకునేదెవరు?

నాగార్జున శలవులకు వస్తే వాడి ఆలనాపాలనా చూసేదెవరు?

అలా అని శాంతిని కలకాలం యీ యింట్లోనే యీలాగే వుండిపొమ్మనలేడు కదా.

ఎప్పటికైనా ఓ అయ్యచేతిలో పెట్టక తప్పదు. శాంతి యింటికి శాంతి వెళ్ళక తప్పదు.

అంతా యిలా వూహించుకుంటాము గాని మనిషి జీవితం నీరు లాంటిది. ఏ పాత్రలో పోస్తే నీరు ఆ పాత్రకు అనుగుణంగానే యిమిడినట్లు మనిషి కూడా ఏ పరిస్థితులను బట్టి ఆ పరిస్థితులకు అనుకూలంగా యిమిడిపోతాడు.

పూర్ణయ్యగారు చెప్పినట్లు రెండు మూడు రోజుల్లో చంద్రశేఖరంగారిని కలిసి శాంతి పెళ్ళి నిశ్చయించాలి అనుకున్నాడు కృష్ణమరాయుడు.

## 40

రాజా చంద్రశేఖరంగారి హవేలీలోని కచేరీ హాలులో, చంద్రశేఖరంగారి కెదురుగా కృష్ణమరాయుడూ, పూర్ణయ్యా కూర్చుని వున్నారు. చంద్రశేఖరంగారి పరివారం ఎంతో అణకువతో అతిథులకు మర్యాదలు చేస్తున్నారు. ఫలహారాలు సేవిస్తూ కొంతసేపు ఒకరినొకరు కుశల ప్రశ్నలు వేసుకున్నారు. రాజా చంద్రశేఖరం కృష్ణమరాయునికి ఎంతోమర్యాద నిస్తున్నారు. అంతేకాకుండా కృష్ణమరాయుని వంశంపట్ల తనకు గల భక్తి గౌరవాలను ప్రతి మాటలోను వ్యక్తం చేస్తున్నారు. చంద్రశేఖరం అలా తనను తన వంశాన్ని పొగిడినప్పుడు కృష్ణమరాయుడు వినయంగా తలవంచుకోవడమో, వారినుంచి చూపులు తప్పించడమో చేస్తున్నాడు. అలా కాలం గడిచిపోతోంది. చంద్రశేఖరం, కృష్ణమరాయలలో ఎవరూ అసలు విషయానికి రావటం లేదు. ఇంక పూర్ణయ్య తప్పదనుకుని ఏదో చెప్పతలచినవాడిలా గొంతు సవరించుకున్నాడు.

సరసుడూ, సూక్ష్మగ్రాహీ అయిన చంద్రశేఖరం పూర్ణయ్యా మనసును గ్రహించి "మీరు చెప్పదలచినది చెప్పండి" అన్నట్లు చూసాడు. ఆ అవకాశాన్ని తీసుకుని వచ్చిన పనిని వివరించసాగాడు పూర్ణయ్య."

మా కృష్ణమరాయల వారి "ఏకైక

పుత్రిక శాంతి, ఆమెను " అని పూర్ణయ్య ఇంకా ఏదో చెప్పబోయే లోపున చంద్రశేఖరం మధ్యలోనే అడ్డు వచ్చి "ఆమెను నేను చూసాను" అన్నాడు.

"ఎక్కడ? ఎప్పుడు" అన్నాడు పూర్ణయ్య.

"యాగానికి వచ్చినప్పుడు."

"ఓహో! అవును."

"అమ్మాయి అపరంజి బొమ్మ."

"గుణవంతురాలు కూడా."

"పులికడుపున తొడేలు పుట్టదు కదా! కృష్ణమరాయలవారి వంశంలో గుణహీనులు పుట్టే ఎమస్యే లేదు. అమ్మాయిని చూసిననాడే అన్నానుగా మీతో" అన్నాడు చంద్రశేఖరం.

"మీరన్న విషయం నేను మా కృష్ణమరాయులు వారితో మాట్లాడాను. తమకు వారిపట్ల గల అభిమానానికి చాలా సంతోషించారు."

"మాది తరతరాలుగా పెరుగుతూ వస్తున్న స్నేహం. ఈ రెండు కుటుంబాల మధ్య స్నేహం బంధుత్వంగా మారితే బావుంటుందని ఆశపడ్డాను." అన్నాడు రాజా చంద్రశేఖరం, కృష్ణమరాయులు ముఖంలోకి చూస్తూ. కృష్ణమరాయుడు ఎంతో వినయంగా "మీరు ఆశపడితే జరగనిదేముంటుంది. ఆదేశించే హక్కుంది మీకు.మీ రెలాంటే ఆలాగే" అన్నాడు కృష్ణమరాయుడు.

చంద్రశేఖరానికి ఎంతో సంతోషాన్ని కలిగించాయి కృష్ణమరాయుని మాటలు. క్షణం పాటు ఆనందంతో ఉప్పొంగి పోయాడు. కృష్ణమరాయుని చేతులు తన చేతులలోనికి తీసుకుని "మీరు నా కంటె చిన్నవాడు వయసులో మాత్రమే పేరు ప్రఖ్యాతుల్లోను, దానధర్మాలు విషయం లోను, మీ ముందు మేము పసివాళ్ళము. మీ నాన్నగారే వుంటే శాంతి పెళ్లి విషయం మాట్లాడడానికి ఇంత జాప్యం చేసివుండేవాణ్ణి కాదు. కలసి వేటకి వెళ్లాము, విందులు ఆరగించాము, వినోద యాత్రలు చేసాము. అపురూపమైన స్నేహం మాది. కాని మీ దగ్గర మాకంత చనువులేదు. లేకపోతే ఆలయ మండపంలో శాంతిని చూసినప్పుడే మీతో నేనే స్వయంగా బంధుత్వం కలుపుకోవాలన్న సంగతి ముచ్చటించి వుండేవాణ్ణి." అన్నాడు రాజా చంద్రశేఖరం.

"కాస్త ఆలస్యమైనా తమరు తలచినట్లే జరగబోతోంది కదా" అన్నాడు పూర్ణయ్య నవ్వుతూ.

"మనసులు మంచివైతే తలచినవి జరుగుతాయి పూర్ణయ్యగారూ. ఇంక ఆలస్యం దేనికి, ఇంత మంచి ఆలోచన వచ్చిన వేళ మంచివేళే అయివుంటుంది. వేరే శుభముహూర్తం అవసరం లేదు. ఇప్పుడే తాంబూలాలు పుచ్చుకుందాం" అంటూ చంద్రశేఖరం తమ దివాన్‌జీని పిల్చాడు.

"ఒక్క క్షణం ఆగండి" అన్నాడు కృష్ణమరాయుడు.

ఏమిటి అభ్యంతరం అన్నట్లు చూసాడు చంద్రశేఖరం.

"పది పెళ్లిళ్లు చేసినవాణ్ణి కాదు. నాకున్నది ఒకే ఒక కూతురు. ఇదే నేను చేసే మొదటి పెళ్ళి. ఆడపిల్ల తండ్రిగా మీముందు ఏం మాట్లాడాలో ఎలా మాట్లాడాలో నాకు తెలియదు. నా మనసులో వున్నమాట చెపుతాను ప్రస్తుత పరిస్థితుల్లో మీతో నేను తూగలేనేమో ననే, పూర్నయ్యగారు శాంతి పెళ్ళి విషయం నాతో ఏనాడో ప్రస్తావించినా మీ ముందుకు ఈనాటిదాకా రాలేకపోయాను. ఒక్కసారి కట్నకానుకల విషయం అనుకుని ఆ తర్వాత తాంబూలాలు పుచ్చుకోవడం మంచిదని నా అభిప్రాయం" అని తన అభిప్రాయాన్ని వివరించాడు కృష్ణమరాయుడు.

"ప్రస్తుత పరిస్థితుల్లో మీతో నేను తూగలేను" అన్న కృష్ణమరాయుని మాటలు చంద్రశేఖరం మనసుకి ములుకుల్లా తాకేయి. చాలా బాధపడ్డాడు. బరువుగా నిట్టూర్చి "కృష్ణమరాయూ! మీ శాంతిని నా మనుమడు కిషోర్‌కిచ్చి వివాహం జరిపించాలని ఆశపడింది కట్న కానుకలకోసం కాదు. అమాట కొస్తే శాంతి వరహాల మూట. మీ అమ్మాయి మా ఇంటి కోడలు కావడమే పెద్ద కట్నం," అన్నారు చంద్రశేఖరం.

"అమ్మాయికి కూడ అచ్చటముచ్చట తీరాలిగా" అన్నాడు పూర్నయ్య.

చంద్రశేఖరం నవ్వి "పూర్నయ్యగారూ! మా కిషోర్‌ని చంద్రశేఖరం మనుమడుగా ఈలోకం మరచిపోవచ్చు. చాలా త్వరగా మరచిపోతుంది కూడా. కాని కృష్ణమరాయుని అల్లునిగా మరో నూరేళ్లదాకా ఈ ప్రాంతం మరచిపోదు. పైగా గౌరవిస్తుంది కూడా. అంతకంటె అచ్చటముచ్చట తీరడం ముఖ్యమంటారా" అన్నాడు చంద్రశేఖరం ఆవేశంగా.

"మీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి, అయినా మన సాంప్రదాయాలు మనకున్నాయిగా" అన్నాడు కృష్ణమరాయుడు వినయంగా.

చంద్రశేఖరం తన కుర్చీలోంచి లేచి కృష్ణమరాయుని చేతిని ఆప్యాయంగా తన చేతుల్లోకి తీసుకుని మృదువుగా నొక్కి, "మీ మనసుకు నచ్చినట్లు చేయండి కృష్ణమరాయా. మీరు ఎలా చేసినా నాకు ఆనందమే. కాని పెళ్ళి మాత్రం జరగాలి. శాంతి మా యింటి కోడలు కావాలి," అన్నాడు.

"యాభై వేల నగదు, కొద్దిగా అమ్మాయి వంటిమీదున్న బంగారం— అంతకంటే " అని ఏదో అనబోయే లోపున కృష్ణమరాయుని మాటకు చంద్రశేఖరం అడ్డమొచ్చి "మీ యిష్టమని చెప్పానుగా! మనం కూడా ఈ విషయాలు

మీలాంటి
మగవానికి
తృప్తినిచ్చేది–చార్మినార్!

CHARMINAR

THE VAZIR SULTAN TOBACCO CO. LTD.

చట్టబద్ధమైన హెచ్చరిక:
సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం 1 రూపాయికి 10*

STATUTORY WARNING:
CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

*గరిష్ఠ ధర స్థానిక పన్నులను అనుసరించి

CASVS-239-182

మెయిన్ డీలర్ : మెస్సర్స్ టి. కోటేశ్వరరావు & సన్స్, గుంటూరు–522008

ఇంత విపులంగా మాట్లాడుకోవాలంటారా" అన్నాడు.

కాసేపు ముగ్గురూ మౌనంగా వుండి పోయారు.

"కిషోర్ జాతకం పంపిస్తాను. మీ అనుకూలాన్నిబట్టి ముహూర్తం పెట్టించండి" అన్నాడు చంద్రశేఖరం.

"అలా కాదు. శాంతి జాతకమే మీకు పంపిస్తాను. మీరే ముహూర్తం పెట్టించి తెలియపరచండి" అన్నాడు కృష్ణమరాయుడు.

అలా శాంతి కిషోర్ల వివాహానికి, రాజా చంద్రశేఖరం, కృష్ణమరాయుల కుటుంబాల మధ్య వున్న స్నేహం బంధుత్వంగా మారడానికి నాందీప్రస్తావన జరిగింది.

## 41

ఆరోజు శుక్రవారం. శుక్రవారం అంటే కృష్ణమరాయుని దృష్టిలో శుభదినం. ఆ రోజునే కృష్ణమరాయుడు రాధను తొలిసారిగా చూసాడు. వారం రోజులలో తిరిగి అదేరోజున రాధను కలిసాడు. అందుకని ఆ రోజునుంచి ప్రతి శుక్రవారం, రాధతో స్నేహం చెడనంతకాలం రాధను కలవకుండా వుండలేదు.

ఆ రోజు శుక్రవారం కావడంతో ఎందుకో కృష్ణమరాయుని మనసు గతంలోకి పరుగులు తీస్తోంది వాలుకుర్చీలో నడుం వాల్చి, దిగంతంలోకి చూస్తూ గతాన్ని నెమరవేసుకుంటున్నాడు.

ఇంతలో "అయ్యా" అంటూ ఎవరో పలకరించారు

ఊహాలలోంచి బయటపడి పిలిచిన వ్యక్తిని చూసాడు రాజా చంద్రశేఖరం గారి జవాను, పురోహితుడు ఎదురుగా నిలబడ్డారు.

"రండి, ఇలా దయచేయండి" అంటూ కృష్ణమరాయుడు పురోహితునికి కుర్చీ చూపించాడు.

రాజా చంద్రశేఖరంగారి పురోహితుడు కుర్చీలో కూర్చున్నాడు.

కొండయ్య పురోహితునికి, జవానుకు దాహం తెచ్చి యిచ్చాడు.

"మా బాబుగారు ముహూర్తం పెట్టించి పంపించారు. తమకు కూడా నచ్చితే శుభలేఖలు అచ్చువేయిద్దామన్నారు" అంటూ ముహూర్త పత్రాన్ని కృష్ణమరాయుని చేతికి అందించాడు.

సరిగ్గా అదే సమయానికి పూర్ణయ్య కూడా వచ్చాడు.

"రండి రండి. సరిగ్గా సమయానికే వచ్చారు. చంద్రశేఖరంగారు ముహూర్తం పెట్టించి పంపించారు" అంటూ కృష్ణమరాయుడు తన చేతిలోని ముహూర్త పత్రాన్ని పూర్ణయ్య చేతికి అందించాడు.

పూర్ణయ్య ముహూర్తాన్ని ఒకసారి పరిశీలనగా చూసి, ఏవో లెక్కించి— "రాజావారు పెట్టించిన ముహూర్తానికి

తిరుగేమి వుంటుంది?" అన్నాడు నవ్వుతూ పురోహితుని ముఖంలోకి చూస్తూ.

"సరే. ఈ ముహూర్తానికి మేము సిద్ధమేనని చెప్పండి. రెండు మూడు రోజులలో మా పూర్ణయ్యగారు వచ్చి మిగిలిన విషయాలు వారితో మాట్లాడ తారు." అంటూ, తన అంగీకారాన్ని తెలియజేసాడు కృష్ణమరాయుడు.

"మరో చిన్న పనికూడా నాకు వప్ప గించారు మా రాజావారు" అంటూ పురోహితుడు జవాన్ పట్టుకొని నిలబడిన వెండిపళ్ళాన్ని అందుకొని కృష్ణమ రాయుని ముందు వుంచారు. పళ్ళెం మీద ముఖ్‌మల్ బట్ట కప్పివుంది. ఏమి టిది? అన్నట్లు చూసాడు కృష్ణమ రాయుడు.

"అమ్మాయిగారికి యీ చంద్రహారం ఈ సమయంలో యివ్వడం ఆనవాయతీ" అన్నాడు పురోహితుడు.

"సరే! వారి ఆనవాయితీని మన్నిం చడం మన బాధ్యత" అంటూ ఆ పళ్ళెం తీసుకొని లోపలికి వెళ్ళి శాంతిని పిలిచి యిచ్చాడు పూర్ణయ్య.

శాంతి "ఏమిటండీ యిది" అంటూ తీసుకుంది.

"మీ అత్తవారింటి నుంచి రాజా చంద్రశేఖరంగారు నీకోసం పంపించిన ఆభరణమమ్మా. నిశ్చితార్థ సమయంలో అలా యిస్తారట. పెట్టుకో అమ్మా—యీ రోజు శుక్రవారం కూడా ను." అన్నాడు పూర్ణయ్య.

శాంతి చంద్రహారం వేసుకుంది మెడలో. అద్దంలో చూసుకుంది. ఎందుకో సిగ్గుపడింది.

"అప్పుడే నీకు పెళ్ళికూతురు కళ వచ్చిందమ్మా" అన్నాడు పూర్ణయ్య శాంతిని తృప్తిగా చూస్తూ.

ఫలహారాలు తీసుకున్న తరువాత పురోహితుడూ, జవానూ తిరిగి వెళ్ళిపో యారు.

కృష్ణమరాయుడూ, పూర్ణయ్యా మాత్రం కూర్చున్నారు. ఇద్దరూ కాసేపు ఏమీ మాట్లాడుకోలేదు.

ముహూర్తం పెట్టేసారు గాని, పెళ్ళి కృష్ణమరాయుడు ఎలా జరిపిస్తాడా అని ఆలోచనలోపడ్డాడు పూర్ణయ్య. తన నోటితో తానే ఏభై వేల నగదు యిస్తానని మాటిచ్చాడు పైగా ఆడపిల్ల పెళ్ళిచేయడం అంటే మాటలతో జరిగి పోయేది కాదు. వచ్చే వియ్యాలవారు కూడా మామూలు సాదా మనుషులు కాదు. రాజవంశీకులూ, జమీందారులు. వారి హోదాకు తగ్గట్టు వివాహం జరిపించి మర్యాదలు నిలుపుకోవాలి అంటే కనీసం పెళ్ళి ఖర్చులు క్రింద ఎంతలేదన్నా పాతికవేలు లేనిదే నడవదు. మొత్తం దెబ్భై అయిదువేలు కావాలి. కృష్ణమరాయుని దగ్గర అంత సొమ్ము లేదని పూర్ణయ్యకు తెలుసు. అందుకే

# కన్నతల్లి అనురాగానికి ప్రతిరూపం



విజయస్ప్రే. మాంసకృత్తులు, విటమిన్లు మరియు ఖనిజ పదార్థాలతో సమ్మిశ్రితమైన శిశు ఆహారం. తేలికగా జీర్ణంకాగలదు, సులభంగా నీటిలో కరుగగలదు. ఆరోగ్యసూత్రాలకు అనుగుణంగా తయారుచేయబడింది. విజయస్ప్రేను చాలా సులభంగా కలుపుకోవచ్చు. అంతర్జాతీయప్రమాణాలకు అనుగుణంగా తయారుచేయబడిన విజయస్ప్రే భారతదేశపు పసి పాపలకు చాలా అనువైన శిశు ఆహారం. విజయస్ప్రే తల్లి పాలవలె తియ్యగా ఉండేట్లు తయారు చేయబడింది.

అవును, మీ పాప ఆరోగ్యానికి డాక్టర్లు సిఫారసుచేసే శిశు ఆహారం... విజయస్ప్రే!

ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి కార్పొరేషన్ లిమిటెడ్ వారి ఒక శ్రేష్ఠమైన ఉత్పన్నం
(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ యాజమాన్య సంస్థ)

అమ్మకందార్లు:
స్పెన్సర్ & కం. లిడ్.,
(దక్షిణ ప్రాంతం).

**విజయస్ప్రే**

**కన్నతల్లి కలలపంట**
**కమ్మనయిన విజయస్ప్రే**

FDS APDDC 3068 A TEL

పూర్ణయ్య ఆలోచనలో పడ్డాడు.

కృష్ణమరాయుడు ఈ సంగతులేవీ ఆలోచించడంలేదు శాంతి పెళ్ళి నిశ్చితార్థం కూడా శుక్రవారమే జరిగింది రాధతో విడిపోయిన తర్వాత శుక్రవారం అంటేనే భయం వేసేది ఒకప్పుడు శుక్రవారం అంటే తనకి ఎంతో యిష్టమైన రోజే అయినా రాధతో చెడిన తరువాత శుక్రవారం అంటే యేవగింపు కలిగింది కాని యీనాడు శుక్రవారం అంటే మళ్ళీ తనకి ఏదో తెలియని మమకారం పుట్టుకొస్తోంది.

అలా శుక్రవారం గురించి ఆలోచించుకుంటూ వుండిపోయాడు కృష్ణమరాయుడు.

మనసు ప్రతి మనిషికీ వుంటుంది.

మనసున్న ప్రతిమనిషీ ఆలోచించడు. ఆలోచించకలిగే మనిషి మాత్రం, ఆనందాల్ని విషాదాలని తనలో తనే ఏకాంతంగా అనుభవించేస్తూ వుంటాడు

ఆనంద శిఖరాలను అధిరోహించడం విషాద పాతాళానికి కుంగిపోవడం అంతా ఆలోచనలలోనే ఆలోచన ఎంత హాయి! ఆలోచన ఎంత బాధ! అనిపించింది కృష్ణమరాయునికి

"మాఘ శుద్ధ దశమి ఆదివారం రోజున ముహూర్తం అంటే సరిగ్గా యీ వేళకి రెండునెలల మూడు రోజులు మాత్రమే వుంది వ్యవధి" అన్నాడు పూర్ణయ్య ఆ నిశ్శబ్దాన్ని కృష్ణమరాయుని ఆలోచనలనూ ఛేదిస్తూ

"ఆ! ఔను" అన్నాడు కృష్ణమరాయుడు యీ లోకంలోకి వచ్చి

"మరి ఏర్పాట్ల సంగతి?" అన్నాడు పూర్ణయ్య ముక్తసరిగా

"వాటి గురించి ఆలోచించకండి. అన్నింటికీ ఆ వేణుగోపాలుడే వున్నాడు వీరేంద్రరావుకి అమ్మగా మిగిలిన పొలం బేరం పెట్టాను. ఈవేళో రేపో డబ్బు వస్తుంది. ఆ తరువాత జరగాల్సిన ఏర్పాట్లన్నీ మీరే చూడాలి" అన్నాడు కృష్ణమరాయుడు

"ఆ మిగిలిన చెరువుకింద పొలం అమ్మేసారా? ఆ తరువాత కుటుంబం గడవడం సంగతి?"

"రేపటి గురించి ఆలోచిస్తూ కూర్చుంటే యీ రోజు గడవడం కష్టం"

"రేపు అనేది వున్నప్పుడు ఆలోచించకుండా ఎలా వుంటాము? వుండగలము?"

"నేడు గడిస్తే గదా రేపు వచ్చేది. పోనీలెండి - యీ తర్జన భర్జనలు ఎందుకుగాని వచ్చే పెళ్ళివారికి ఏ లోటూ రాకుండా మర్యాదలుచేసి పంపించడం ఎలాగో ఆలోచించండి" అన్నాడు కృష్ణమరాయుడు (సశేషం)

Printed and Published by A Chandra Seker Rao at 5 9 88 Public Garden Road Hyderabad for YUVA Publications and Printed at Dolton Press Public Garden Road Hyderabad 500 001 Editor A SUDHAKARA RAO

